

















శ్రీరస్తు

శుభమస్తు అవిఘ్నమస్తు

# ఏలుకో శృంగార రాయ

**ఎన్నుకొన్న**

**అన్నమాచార్యుల**

**సరస శృంగార సంకీర్తనలకు**

**ఉపోద్ఘాతము**

మరియు

**తాత్పర్యము**

రచన
అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు
M.Tech.

# ఏలుకో శృంగార రాయ

మొదటి ప్రచురణ
**జూన్ 2012**

రచన
**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech.
**Cell: 9393021360**

వెల : అమూల్యం

ప్రతులకు :
ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం.61, సిద్ధార్థ నగర్,
హైదరాబాద్ - 38. ఫోన్ : 093930 21360

డి.టి.పి. & ప్రింటింగ్ :
**కె. మురళీ కృష్ణ**
9848 51 51 09





# అంకితము

## మా అమ్మ అలమేల్ మంగకు



కం॥ హరి కరగి మురియు తరుణము
నరయుచు వివరింపవమ్మ! అరవిరి కనులన్
మరిమరి ధరునికి నామొర
నెరిగింపవె అంకితమ్ము నిడుదును తల్లీ!

# ఏలుకో శృంగార రాయా

## అన్నమయ్య సరస శృంగార సంకీర్తనలకు

### విషయ సూచిక

ఏలుకో శృంగార రాయ

# ప్రార్థన

కం॥ శ్రీ లలనను భూకాంతను
వీలుగ నిరుగడల దాల్చి వింటూ దీనిన్
కాలుని "కాసేపాగని"
ఏలాగో సర్దిచెప్పు, యెంకన్న దొరా!

సీ॥ తాళ్ళపాకన్నయ్య తాజెప్పె వేలాది
కీర్తనల్ నీలీల నార్తిపాడె
శృంగార రాయ! నీ అంగనలను నిన్ను
మురిపించె తరియించ తరతరాలు
ఏనాటి బంధమో యేను నాతని బాట-
తొక్కి కొల్చితి నిన్ను తోయజాక్ష!
ఇద్దాని బిలిచెద "ఏలుకో శృంగార-
రాయ" ని కొండలరాయ! వినుము

తే॥ అతని శృంగార కీర్తన లనువదించి
వాని తాత్పర్యమెరిగించ బూనుకొంటి
తప్పులెంచకుమోరయ్య! దయను జూపి
స్థిరపు చిత్తమునీయుమా శ్రీనివాస!

తే॥ తొల్లి జయదేవుడెక్కిన త్రోవ ఇదియె
వెనుక శ్రీనాథుడెంచిన విధము నిదియె
అన్నమార్యుడు జేసిన యెన్నిక ఇదె
సరస శృంగారమే హరిన్ మురియ జేయు

ఉ॥ తేలికజేసి నీచుదని తిట్టిన నవ్వెద, స్వామిచేయు ఆ
లీలలు బూతనే మతికి లేదిక మోక్షము ఈ ధరాతలిన్
ఆలిని కూడియే మగడు ఆతని బిడ్డకు జన్మనిచ్చు; ఆ
లీలకు 'నీలి' నీడనిడు లేకి తలంపును ద్రుంచు శ్రీహరీ!

కం॥ సిరులేమి చేతు నేనిక
మరులేటికి? సుఖములేల? మాన్యత లేలా?
కురిసిన నీదయ చాలును
వరములు నాకెందుకయ్య! వనరుహనాభా!

ఆ.వె॥ బూతు తోడబుట్టి బూతుతో పుట్టించు
బూతు చేయ సుతుల ప్రోత్సహించు
బూతు కొరకె హరియు బుట్టించె మదనుని
బూతు 'తలపు' తప్పు భూతమదియె.

తే॥ చాచినానురా కాళ్ళను 'చావు కొరకు'
నీ తలంపుతోనే నేను 'నివురునవుదు',
చివరి క్షణముదాకా నాదు చిత్తమందు
నిలువుమా శౌరి! అన్యంబువలదు నాకు.

చం॥ పదకవితా పితామహుడు మాన్యుడు నౌ మన అన్నమయ్య నా
యెద వసియించుగాత! జగదీశ్వరుడౌ తిరువేంకటేశుడున్
అదనుగ పాల సంద్రసుత నన్నులమిన్నను కౌగలించుచున్
ముదమున నాదు యీ రచన ముద్దిడిమెచ్చిన చాలు ధన్యుడన్.

మ॥ కలయో వైష్ణవమాయయో? తెలియగా కాకున్న దో శ్రీహరీ!
తొలిజన్మంబుల భాగ్యమేమికలదో? తోడైసదా నామదిన్
కొలువై ఇత్తరి అన్నమయ్య చెలగన్ కూర్చేను తాత్పర్యముల్
పలుశృంగారపు కీర్తనంబులకు నా భావంబు జోడించుచున్

ఆ.వె॥ అన్నమయ్య తెలుగు ఆనాటిదౌట చే
అంతు చిక్కదాయె అతని వూహ
ఏ నిఘంటువైన యెత్తేసె చేతులు
యేమి చేతునయ్య యెంకటేశ !





# మనసులో మాట

ఇదివరలో "భావయామి వేంకటేశమ్" అని పిలిచి 606 అన్నమాచార్యుల వారి కీర్తనలకు మున్నుడి (INTRODUCTION) భావామృతం (చరణాలక్రమములో భావ వివరణము) కీర్తనలతోపాటు వ్రాసి అన్నమాచార్యులవారికి అంకితము జేసి శ్రీ వేంకటేశ్వరునికి అర్పించి చరితార్థుడనయ్యాను. భక్తి, శృంగారం, వైరాగ్యం, జ్ఞానబోధ, కళ్యాణం, దశావతార వర్ణన, జానపదం, భజన, అలమేల్మంగ, అన్నమయ్య తత్త్వచింత, శ్రీమన్నారాయణుడు, సంస్కృత కీర్తనలు, హనుమంతుడు, శ్రీకృష్ణుడు, శ్రీ రామచంద్రుడు, నృసింహుడు, తిరుమల, బ్రహ్మోత్సవములు, శ్రీ వేంకటేశ్వరుడు, గోవిందరాజస్వామి... వంటి విభిన్న అంశములతో కీర్తనలనెన్నుకొని ప్రకటించాను. పరిమిత సంఖ్యలో కంప్యూటర్ ప్రింట్ తీయించి మొత్తము 6 సంపుములచ్చు వేయించాను. ఈ జన్మకిదిచాలు అనుకొన్నాను.

కాని ఇది చాలదురా... అన్నాడు ఏడుకొండలవాడు. ఇప్పుడు "ఏలుకో శృంగార రాయా" అనే ఈ అనంత యాత్రలో అన్నమాచార్యులవారి సరస శృంగార కీర్తనలకు చిన్న ఉపోద్ఘాతముతో కూడిన తాత్పర్యమునందించే ప్రయత్నం చేస్తున్నాను. ఆ పురుషోత్తముడు పక్షవాత పీడితుడనని నాపై జాలితో పుత్రచేతి వ్రాతను నేర్పాడు. ఏజన్మదో స్ఫురణనిచ్చాడు. బ్రతికే ధైర్యమిచ్చాడు. అవసరమైన ఆర్థిక స్థోమతనిచ్చాడు. అన్నిటికన్నా మిన్నయైన విరక్తినిచ్చాడు. మంచి మిత్రులనిచ్చాడు. పట్టులేని కాళ్ళు చేతులిచ్చినా పట్టుదలనిచ్చాడు. ఈ రచనలో ఎదురయ్యే కొన్ని ఇబ్బందులను వివరిస్తాను. రాగి రేకులపై అన్నమయ్య కీర్తనలను ఆనాటి రాజు చెక్కించి ధన్యుడయ్యాడు. కొన్ని రాగి రేకులు చిలుము బట్టి నేటి పండితులకు కూడా అంతుబట్టకున్నాయి. కొంతమంది రాగిరేకులపై చెక్కడంలో చేసిన పొరబాట్లు గందరగోళంగా మారాయి. ఆనాటి కొన్ని వాడుక పదములు నేడు 'లుప్తమై' పోయాయి. ఆ ప్రాంతంలో (రాయలసీమలో) కన్నడ, తమిళ భాషల వాడుకకు

లోనై పరివర్తన చెందిన తెలుగు పదాలను అన్నమయ్య వాడటం వలన కొన్ని పదాలనర్థం చేసికోవటం గగనమవుతున్నది. అరసున్న లేకుండా కొన్ని ఆనాటి అన్నమయ్య తెలుగు పదములను ఉపయోగిస్తే వాటి అర్థం తారుమారయ్యే ప్రమాదమున్నది. నేటి కాలంలో ఆ పదాలలో వాడే 'ఱ' (శకట రేఫము) నేడు, వాడిక తగ్గిపోయింది. అన్నిటికంటె గొప్పతంటా యేమిటంటే... ఒక్కొక్కమాటకు మూడు లేక నాలుగు అర్థాలున్నప్పుడు అన్నమయ్య వేర్వేరు చోట్ల వేర్వేరు అర్థాలలో ఆ మాటను వాడారు. ఒక్కొక్కప్పుడు సందర్భాన్ని బట్టి సరిపోయే అర్థం చెప్పుకోవాలి. ఉదాహరణకి దోమటి, అసోదము, గజరు, పల్లదము... ఇలా అనేక పదములున్నాయి.

నేనుకూడా చేసేదేమిలేనప్పుడు, చేతులెత్తేసి సందర్భానుసారం అతికిన అర్థం వాడవలసి వచ్చింది. ఇది ఎటువంటిదంటే, దూరంనుంచి చూచి నున్నగా చిన్నగా వుందని భ్రమించి, దగ్గరకెళ్ళి కైలాస పర్వతం ఎక్కాలనుకొన్న వెఱ్ఱివాడి పరిస్థితే నాదీ అయిది. ఇది కైలాస పర్వతం. దీన్ని ఎక్కగలనా? ఇది మహోదధి దీనినీదగలనా? ఇది అనంతాకాశం. దీనిలోని చుక్కలను లెక్కించగలనా? ఇది సువిశాల కీకారణ్యం, నేను కడతేరగలనా? ఏమో... తెలియదు. అయినా, నా నిరంతర ప్రయత్నం నేను చేస్తూనే వుంటాను.

ఈ ప్రయత్నానికి ఆరంభం వుంటుంది. గాని... అంతం వుండదు. శృంగార కీర్తనల అనంతరం నాచేత ఆ దేవదేవుడు ఏమి చేయిస్తాడో ఆయనకే తెలియాలి.

నాకు పద్యం చెప్పటమంటే ప్రీతి. అందులోను శబ్దాలంకారాలతో చెప్పటం ఇంకా ఇష్టం. కానీ ఆ ప్రయత్నాలన్నీ నా ఆత్మానందాన్ని మాత్రమే నాకు ఇస్తున్నాయి. మనం చెప్పేది ఎదుటివానికి అర్థం కానప్పుడు దానివలన ఉపయోగమేమిటి? నేను ఇప్పటికిప్పుడీ పద్యం చెబితే దీని వలన ప్రయోజనమేమి?





**కం॥ ఇది మొదలిడి వొదవుటయే**
**కుదిరినదని ముదమునంది కొదలేదనుచున్**
**యెదగొని సదమదమగుచును**
**చెదరక తుదిలేదనచు సేవింతు హరీ!**

అందుచేత "ఏలుకో శృంగార రాయా!" వచనానికే పరిమితం చేశాను.

నా పరిమిత మతికి తట్టిన ఒక సత్యం వెల్లడిస్తాను. వైష్ణవతత్త్వం ప్రభోదించే అన్నమాచార్యులవారు జగతికే తల్లిదండ్రులైన శ్రీ వేంకటేశ్వరుడు అలమేలుమంగలపై ఎందుకు శృంగారం కుమ్మరించారు? వారి కూటముల నెందుకు మాటిమాటికీ వివరించారు. పైకి శృంగారమే అయినా ఇది ఆధ్యాత్మ తత్త్వం. శ్రీ వేంకటేశ్వరుడు పరమాత్మ. అలమేలుమంగ, గోపికలు, ఆయనను వలచిన వారంతా... ఆత్మలు. ఇవన్నీ ఆ పరమాత్మలో లీనమవ్వాలని తహతహలాడుతూ భక్తితో పారవశ్యంతో ఎదురు తెన్నులు చూస్తున్నాయి. ఏ జామున ఆయన యెవరిననుగ్రహిస్తాడో తెలియదు. అందరికీ ఆ స్వామి తమతో రమిస్తాడనే... ఆశ. ఏ తీరుగ నను దయజూచెదవో... అని రామదాసులాంటి వారు వేడుకొన్నారు. ఎందుకు దయరాదురా అని త్యాగరాజులాంటివారు విలపించి తపించారు. ఆ పరమాత్మ ఏ ఆత్మని దగ్గర తీసికొంటే దానికి మోక్షం సిద్ధిస్తుంది. కాకపోతే.. అది యెన్నడు, యెవరికి, ఏవిధంగా దక్కుతుందో ఏడుకొండలవాడికొక్కడికే తెలుసు. మనపని యెదురు తెన్నులు చూడటమే.

సప్తగిరీంద్రుని సరసశృంగారం సాధ్యమైనంత నర్మగర్భంగా చెప్పాను. కానీ యెక్కడన్నా మర్యాద నతిక్రమిస్తే పెద్దలు నిందించక నా అజ్ఞానాన్ని మనస్ఫూర్తిగా మన్నించండి.

శృంగార కీర్తనల భ్రమలో మనసు చలించుట మానవ సహజం. అందుకని మధ్య మధ్య "హరి" సంకీర్తనలను పేర్చాను. శ్రీ రాముడో నారసింహుడో, శ్రీ మహావిష్ణువో–ఎవరో ఒకరైనా కరుణించరా?

అన్నమయ్య కీర్తనలకే కాదు అనేకమంది దివ్యుల స్తోత్రాలకోసం.. Please Visit my website...... www.geetadeeksha.com.

సంపుటి : 21 కీర్తన : చొల్లెపు జుట్ల వో చొక్కనాథా

సంఖ్య : 436 పుట : 291 - రాగం : వరాళి

1. చొల్లెపుఁజుట్ల వో చొక్కనాథా నీ-
చుల్లరిచేఁతలు గంటిఁ జొక్కనాథా ॥పల్లవి॥

చూడ వేగన్నులు నిన్నుఁ జొక్కనాథా నీకు
జోదు భూమియును లక్ష్మిఁ జొక్కనాథా
సూడిదె నాపాయమిదె చొక్కనాథా నీతో
సూడువట్టీ నారతులు చొక్కనాథా ॥చొల్లె॥

చొక్కపుసింగారాల చొక్కనాథా! మోవిఁ
జుక్కలు నించె నెవ్వతో చొక్కనాథా
చొక్కించితి గోపికలఁ జొక్కనాథా! నాతో
సుక్కులమాట లేలోయి చొక్కనాథా ॥చొల్లె॥

సొమ్ములతో విఱ్ఱవిఁగేచొక్కనాథా! పోదు-
సుమ్మీ నీకు నాకుఁ జొక్కనాథా
ఇమ్ముల శ్రీవేంకటాద్రి నిటు నీవు గూడఁగాను
జుమ్మన మై పులకించెఁ జొక్కనాథా ॥చొల్లె॥ 436/21

**ఉపోద్ఘాతము :**

తెలుగు నాట చొక్కరావులు, చొక్కయ్యలు, చు(చొ)క్కమ్మలు విస్తృతంగా కనిపిస్తుంటారు. ఇవి మన పూర్వీకులు పెట్టుకొన్న ముద్దు పేర్లు. నాకు తెలిసిన, తెలివిగల తెలుగువాడికెవరికీ దీని అర్థం తెలియదు.



ఏలుకో శృంగార రాయ

చొక్కనాధుడంటే "దోషరహితు"డని అర్థం.

శ్రీమన్నారాయణుడు 'అస్ఖలితుడు', 'నిర్మోహి'

**తాత్పర్యము :**

చొల్లెపు జుట్ల (జడవేసి జుట్టు చుట్టగా చుట్టి అలంకరించుకొనిన) ఓ చొక్కనాథా! (దోషరహితుడవైన నాధుడా!) నీవు చుల్లరి (ఎగతాళి కూడిన) చేతలవాడవు (చేష్టలు చేయు చొక్కనాధుడవు).

ఓ చొక్కనాథా! నీవు చూడబోతే వేయికన్నులవాడవు. నీకు జోడు (జంట) అయిన వారు భూదేవి లక్ష్మీదేవి. ఓ చొక్కనాథా! నీకు 'సూడిదె ఇదె నాపాయము (నా కానుక నీకు నా వయస్సు). నీకు ఆరతులు సూడువట్టుచున్నాము (హారతులెత్తుచున్నాము).

చొక్కపు సింగారాల (దోషము చూపలేని సింగారములు గల) ఓ చొక్కనాథా! యెవ్వతో నీ మోవిపై (పెదవిపై) చుక్కలు నించె (పంటిగాట్ల గుర్తులన వదలినది). ఓ చొక్కనాథా! నీవు మా గోపికలను విపరీతముగా చొక్కించితివి (శ్రమ పెట్టితివి). నీవన్నీ సుక్కులమాటలు (మాయదారిమాటలు). అవి యేలోయీ యెందుకయ్యా! చొక్కనాథా!

ఓ చొక్కనాథా! నీ నగలన్నింటిని ధరించి విఱ్ఱవీగుచున్నావు.
నీకు నాకు పోదు సుమ్మీ! (పొసగదు సుమా!)
ఇమ్ముల(ఇంపైన) శ్రీవేంకటేశ్వరా! నీవు నన్నిట్లు కూడితివి.
ఇక నా తనువు 'జుమ్మని' పులకించినదయ్యా!

సంపుటి : 21 కీర్తన : పట్టము గట్టితివింక బ్రతుకరయ్యా

సంఖ్య : 152 పుట : 102 - రాగం : సాళంగ నాట

**2.** పట్టము గట్టితి వింక బ్రతుకరయ్యా
చిట్టకాలు లేవు మీకు శ్రీవేంకటేశుఁడా ॥పల్లవి॥

అలమేలుమంగకు సింహ్వా(హా?)సనము నీవురము
కలితహారములే సింగారపుదండలు
తొలఁకు నీహస్తములే తోరణగంభములు
చెలిరాజ్యమే నీవు శ్రీ వేంకటేశుఁడా ॥పట్ట॥

పరగుతులసిదండ పచ్చతోరణ మాపెకు
మెరుఁగుఁగౌస్తుభమణి మించుటద్దము
గరిమ నీసొబగులు కప్పములుఁగానికలు
సిరులు నీకూరిములు శ్రీ వేంకటేశుఁడా ॥పట్ట॥

సంతతమైన విందులు సారె నీమోవితేనెలు
వింతరతిభోగములు వినోదాలు
కొంత నియ్యారును బొడ్డు కుంచెయుఁ గాళాఁజి
చెంతల నన్నీ నమరె శ్రీ వేంకటేశుఁడా ॥పట్ట॥ 152

**ఉపోద్ఘాతము :**

శ్రీ వేంకటశ్వరునికి ధన్యవాదాలు చెబుతున్నారు అన్నమయ్య. మాకు పట్టము గట్టితివయ్యా! ధన్యులము అంటున్నారు. మీకు చిట్టకాలు లేవు (నీ లీలలకు పరిమితియే లేదు) అంటున్నారు.





**తాత్పర్యము :**

ఓ శ్రీ వేంకటేశ్వరా! నీవు మాకు పట్టము గట్టితివి (వైభవము నొసంగితివి). బతుకరయ్య(ధన్యులమైతిమి). మీకు చిట్టకాలకు లేవు (నీ లీలలకు పరిమితియే లేదు).

అలమేలు మంగమ్మకు నీ వురము సింహాసనము. అందమైన ఆమెచేతి దండలే నీకు అమరిన హారములు. తొలకు (చలించు) నీ హస్తములే ఆమె పాలిటి తోరణ స్తంభములు. ఓ శ్రీ వేంకటేశా! నీవే ఆమె రాజ్యము.

ఓ శ్రీ వేంకటేశ్వరా! ఆమెకు నీమెడలోని తులసిమాల ఆకు పచ్చని తోరణమువలె భాసిల్లుచున్నది. మెరయుచున్న నీ కౌస్తుభమణి ఆమెపాలిటి అద్దమై ప్రకాశించినది అనిపించుచున్నది. నీ అద్భుతమైన సొగసులు ఆమెకు నీవిచ్చిన కప్పములు, కానుకలు. నీ వలపులే ఆమెకు సిరిసంపదలు.

ప్రభూ! నీ మోవి తేనె (అధర సుధ) ఆమెకు ప్రతిసారి శాశ్వతమైన విందు భోజనము. అచ్చెరువు గొలుపు రతిభోగములు అనేకమైన వినోదములు. ఓ శ్రీవేంకటేశా! కొంచెము కొంచెముగా నీ ఎఱ్ఱటి తమ్మి (తాంబూలపు వుమ్మి) వూయుటకు పాత్ర (బొడ్డు కుంచెము) నీ కొరకు అమర్చబడినది.

సంపుటి : 21 కీర్తన : ఊరకున్న వారితోడ వూరు

సంఖ్య : 161 పుట : 108 - రాగం : దేశాళం

**3.** ఊరకున్న వారితోడ వూరు నోప దెఱఁగవా
చేరి నాతో సుద్దులెల్లాఁ జెప్పేవుగాక ॥పల్లవి॥

వద్దని నీతో నేను వాదులడిచేనా
గద్దించి యప్పటి నిన్నుఁ గాదనేనా
తిద్ది నీగుణాలు నేఁడు తీరుచవచ్చేనా
వొద్దనే నీ వెట్టుండినా నుంటివిగాక ॥ఊర॥

చలపట్టి నిను నేను సాధించవచ్చేనా
కలవి లేనివి తారుకాణించేనా
నిలువుకు నిలువే నిన్ను నేరాలెంచేనా
వెలి నెంతనవ్వినా నవ్వితివిగాక ॥ఊర॥

పంతమాడి సారెసారెఁ బంగించదొరకొనేనా
వంతులకు నంతేసి వాసిపట్టేనా
యింతలో శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను
యెంత చనవిచ్చినాను ఇచ్చేవుగాక ॥ఊర॥ 161





**ఉపోద్ఘాతము :**

ఆమె స్మామితో నిష్ఠూరాలాడుతోంది. నేడు నావద్ద చేరి యేవేవో కతలు చెబుతున్నావు. ఊరకున్న వాళ్ళని వూరు ఒప్పదు అనే మాట నెరుగవా?

**తాత్పర్యము :**

ఊరకున్న వాళ్ళతో ఊరు ఒప్పదు. స్వామీ! నీవా మాట నెరుగవా? నేడు నావద్ద చేరి యేవేవో సుద్దులు (కథలు) చెబుతున్నావు కదా!

నీతో వలదని నేను వాదన లణగింతునా? నిన్ను, పోనీ, అప్పటికి గద్దించి తిరస్కరింతునా? నేటికి నేడు నీ గుణాలను తిద్ది (సవరించి) తీర్చవత్తునా? నీవెట్లుంటే నాకేమిటికయ్యా?

చలపట్టి (మత్సరముతో) నిన్ను సాధించవత్తునా? అయినవీ కానివీ నీకు ఋజువు చేసికొనుటయే నా పనియా? నిలబడిన వాడినలాగే నిలబెట్టి నిన్ను నేరాలెంచుతూ బాధించితినా? ఏదో పైకి నవ్వుతున్నావుగాని నీవెంత నవ్వినా అది నిజమైన నవ్వా? పంతమాడి మాటి మాటికీ నన్ను బంగించ దొరకొనేనా (వంచించ పూనుకొందువా... అని ఊహ...) వంతు పెట్టుకొని అంతటి ఆధిక్యము చూపింతువా?

ఓ శ్రీ వేంకటేశ్వరా! ఇంతలోనే ఈ విధముగా నన్ను యెనసితివి (పొందితివి). నాకు ఎంత చనువు కావాలంటే అంత చనువు ఇచ్చెదవు గాక!

సంపుటి : 21 కీర్తన : ఇన్నియు నీవే నేరుతువిక నెన్నడు

సంఖ్య : 41 పుట : 29 - రాగం : ఆహిరి

4. ఇన్నియు నీవే నేరుతు విఁక నెన్నఁడు
పన్నిన సటలెల్లాఁ జేసి పాలార్చవయ్యా ॥పల్లవి॥

కాంతకు నీబుజము రేకలు చూచినంతనుండి
చింతతోడ చెక్కులెల్లాఁ జెమరించెను
మంతనానకుఁ బిలిచి మనసుమర్మము సోఁక
పొంతనే నీవానవెట్టి బొంకఁగదవయ్యా ॥ఇన్ని॥

కొమ్మ నీతురుము చూచి కొత్త పూవులెల్లాఁ జూచి
తమి మోము వంచుకొని తడఁబడీని
నెమ్మనమలర నీవు నేరుపులెల్లా మెరసి
సమ్మతించేయట్టుగాను సత్యాలు చూపవయ్యా ॥ఇన్ని॥

అలమేలుమంగ నీవాడేటిప్రియాలు చూచి
కలసి మోవిచ్చె శ్రీవేంకటేశ్వరుఁడా
వెలయ నింకా నీవు వేవేలుచందముల
పలుసాకిరులు చెప్పి భ్రమయించవయ్యా ॥ఇన్ని॥ 41/21





**ఉపోద్ఘాతము :**

ఓ శ్రీ వేంకటేశ్వరా! నిన్ను నీ భుజంమీది ఈ రేఖలు, నీ కొప్పులోనున్న కొత్త కొత్త పూలు, నీవాలకం చూస్తేనే అసలు సంగతి తెలిసిపోతోంది. నీవునేర్వని విద్య వున్నదా? పన్నిన సటలెల్లాజేసి (మాయచేయటంలో నినున మించిన వారెవరు?) పాలార్చవయ్యా (ఆమె చిరాకును ఉపేక్షించవయ్యా!)

**తాత్పర్యము :**

ఇన్నియు నీవే నేరుతవు (ఈ విద్యలన్నీ నీకు తెలిసినవే). ఇక ఎన్నడో 'పన్నిన సటలెల్లా' (పన్నుగడలతో కూడిన మాయలన్నీ) చేసి, పాలార్చవయ్యా (ఓపిక ప్రదర్శించవయ్యా!) చివరికి ఆవిడే నీదారికి వస్తుంది.

కాంతకు (అలమేలుమంగమ్మకు) నీ భుజము మీద ఈ రేకలు (గుర్తులు) చూచిన దగ్గరనుంచి దిగులుతో బుగ్గలన్నీ చెమటతో తడిసిపోయాయి. మంతనానకు బిలిచి (ఏకాంతంగా ఆమెను పిలిచి) నీ మనస్సులోని మర్మమెల్లనూ విప్పజెప్పవయ్యా! నీ దగ్గర జేర్చుకొని ఏవన్నా ఒట్లు పెట్టుకొని, అబద్ధాలాడియైన ఆమెను అనునయించవయ్యా!

ఈ భామిని నీ కొప్పులో నున్న కొత్త కొత్త పూలను చూచి అనుమానంతో సతమతమవుతున్నది. పైకి యేమీ అనలేక తన మొకము వంచుకొని తడబడుచున్నది. ఆమె మనస్సు కుదుటబడునట్లు జేసి నీ నేర్పునంతయు జూపి ఆమె నీతో సమ్మతించునట్లు కొన్నైనా నిజాలు చెప్పవయ్యా!

ఓ శ్రీ వేంకటేశ్వరా! ఈ అలమేలుమంగ నీవు జెప్పే ప్రియములు (ప్రేమ చూపు మాయ మాటలు) విని, కఱగిపోయి నిన్ను కలసి తన మధురాధరం నీకందిస్తుంది. ఇంక నీవు విజృంభించి అనేక రములైన 'సాకిరులు' (సాక్ష్యాలు) చెప్పి ఆమెను భ్రమలో ముంచవయ్యా! నిన్ను కాదనే వారెవరు?

సంపుటి : 14 కీర్తన : అట్టు సేయక రావే యిట్టె నీవు

సంఖ్య : 557 పుట : 322 - రాగం : సింధురామ క్రియ

5. అట్టు సేయక రావె యిట్టె నీవు
గట్టిగా వచ్చేవంటాఁ గాచుకున్న వాఁడు ॥పల్లవి॥

చెలిమి చేసినవారు చేతికిలోను గావలె
చలములు సాదించ సంగతిగాదు
వలచిన వారలు వద్దఁ బాయకుండవలె
పొలయలుకలు చూపఁ బొసఁగ చెప్పుదును ॥అట్టు॥

సరస మాడేటివారు సమ్మతించి వుండవలె
నెరసులు పట్టేది నేరుపుగాదు
మరుతంత్రములవారు మంతనాన నుండవలె
విరసాన రచ్చలుంటే వేడుక గాదు ॥అట్టు॥

వొడఁబాటు గలవారు వొద్దికతో నుండవలె
అడియాసలఁ బొరలే దందము గాదు
అదరి శ్రీ వేంకటేశుఁడలమేల్మంగవు నీవు
తడియక కూడితివి తగులాయ మోహము ॥అట్టు॥

**ఉపోద్ఘాతము :**

అలమేలు మంగమ్మ చెలికత్తెయై, ఆమెకు హితవు చెబుతున్నారు అన్నమయ్య. ఆమె చేయవలసిన పనులు, చేయరాని పనులు వివరిస్తున్నారు. స్వామిని వలచిన వారికి సవతి పోరు తప్పదు. చంద్రుని చల్లదనం, సూర్యుడి వెలుగు నాకొక్కరికే కావాలంటే ఎలా కుదురుతుంది. ఆయన అందరివాడు. అందనివాడు. అందరాని వాడు. అందగాడు. అందెగాడు (ఆరితేరినవాడు).





**తాత్పర్యము :**

ఓ నెచ్చెలీ! నీవు అట్టు సేయక (నిందించకుండా) యిట్టే నీ ప్రియుని వద్దకు రావే. నీవు గట్టిగా (ధృడ నిశ్చయంతో) వచ్చెదవా అని ఆ కాచుకొని యున్నవాడు అనుమానిస్తాడు. కావున త్వరపడు.

పురుషులతో చెలిమి చేసిన వారు, వారి చేతిలో లొంగి వుండవలసి వస్తుంది. "చలములు సాధించ సంగతి కాదు" పట్టుదలలకు పోకూడదు. వలచిన వారిని యెన్నడూ వదలియుండరాదు. ఎప్పుడూ, పొలి యలుకలు చూప (రుస రుస లాడుట) పొసగదు (సరిపోదు).

సరసములాడుకొనే ప్రేయసీ ప్రియులు ఒకరిమాట ఇంకొకరు వినుటకు సిద్ధపడి వుండాలి. "నెరసులు పట్టేది" (ఒకరి తప్పులింకొకరు యెత్తి చూపటం), నేరుపు కాదు (తెలివైన పనికాదు). మరు తంత్రములవారు (శృంగార తంత్రములు వాడదలచినవారు) మంతనాలనుండవలె (ఒకరితో ఇంకొకరు మాట్లాడుకోవాలి గాని పోట్లాడుకోరాదు). సరసం విరసంగా మారి బజారుకెక్కారంటే అది మీకు సంతోషం కాదు కదా!

పరులసొమ్మునాసించువారు వినయ విధేయతలతో వుండవలెను. వారు అడియాస (ప్రత్యుపకారము జరుగుతుందనే ఆశతో) బొరలిన (వ్యవహరించుట) అందమైన పనికాదు. అలమేలుమంగవైన నీవు శ్రీ వేంకటేశ్వరునితో, అదరి (అతిశయించి) తడయక (తడబడకుండా) కూడినావు. ఇక మోహములు తగులాయెను (ఆసక్తికరములైనవి).

సంపుటి : 14 కీర్తన : ఆపెనా చెల్లెలు గాదా అందుకేమి

సంఖ్య : 491 పుట : 284 - రాగం : నారాయణి

**6.** ఆపె నా చెల్లెలు గాదా అందుకేమి
నా పొందు విడువ నని నమ్మించేవు నీవు ॥పల్లవి॥

ప్రేమము గలిగినాపె ప్రియపడి మాటాడఁగా
నామోము చూచి యేమి నవ్వేవు నీవు
వేమరు గడ్డము వట్టి వేడుకొని పిలువఁగా
ఆముకొని నన్నేలప్పణడి గేవు నీవు ॥ఆపె॥

వావి గలసినయాపె వలపులు చల్లఁగాను
సోవలుగా నా కేఁటికిఁ జూపేవు నీవు
కావరించి యిక్కువకు గనుసన్న సేయఁగా
భావించి నన్నెంత వొడఁబరచేవు నీవు ॥ఆపె॥

పొరుగున నున్నయాపె భుజముపైఁ జెయి వేయఁగా
అరసి నన్నిట్టుగూడే వప్పటి నీవు
నిరతి శ్రీ వేంకటేశ నే నలమేలుమంగను
సిరుల నిచ్చుకా లెన్ని సేసేవు నీవు ॥ఆపె॥

**ఉపోద్ఘాతము :**

ఓ శ్రీ వేంకటేశ్వరా! నీవెన్ని చెప్పినా నీ పట్టపురాణిని నేనే. నిన్ను వలచి వలపించుకొన్నవారు వేలాది యుండవచ్చును. నాకేమి! నీపై ప్రేమతో ఎవ్వతైనా మాట్లాడితే పోనీ నాకేల? ఆమె నాకు చెల్లెలే అవుతుంది. మన పెళ్ళినాడు నా పొందు విడువనని 'నాతిచరామి' అని ఒట్టేశావు కదా! నన్ను నమ్మించావు గదా! ఆ పుణ్యం నీవే కట్టుకో.





**తాత్పర్యము :**

ఆమె నా చెల్లెలు అని, ఇచ్చకాలు యెన్నైనా చెబుతావు, దానకేముందిలే. నీకు వరుస అయినదని, చెప్పకనే, నాకు చెబుతున్నావు. పైగా నా పొందు (జంట) విడువనని నమ్మించటానికి మాయ మాటలు చెబుతున్నావు.

ఆమె నీ ప్రేయసి. అందుకని పరవశించి నీతో ప్రేమగా మాట్లాడుతుంది. దానికేం. కానీ ఆమె నీతో అట్లా మాట్లాడితే నా మొగములోకి చూచి ఎందుకు నవ్వుతావు? నిన్ను గడ్డము పట్టుకొని బ్రతిమిలాడుతోందని, ఆముకొని (మిక్కిలి చొరవతో) నన్నేల, అప్పణ (అనుమతి) అడుగుతావు? ఇదెక్కడి చోద్యం?

నీకు ఆమెకు వావి (చుట్టరికం) కలిసివుండవచ్చును గాక! ఆమె నీపై సోవలు (వలపులు) కుమ్మరించుతున్నదని, నాకెందుకు ఋజువులు చూపిస్తున్నావు? ఆవిడకు కావరించి (మదమెక్కి) ఇక్కడికి రమ్మని సైగలు చేస్తే, దానికి భావము అది కాదని నన్నెందుకు నచ్చజెప్పాలని చూస్తావు ఎవరెట్లా పోతే నాకేమి?

ఆమె నీ పొరుగున వున్నదని చనువుగా ఆమె నీ భుజముపై చేయి వేయగానే, అరసి (పరవశించి) నన్ను ఈ విధముగా, అప్పటి (మరల మరల) కూడేవు. నిరతి (మిక్కిలి ఆసక్తిగల) ఓ శ్రీ వేంకటేశ్వరా! నేను అలమేలు మంగను. నీవు సిరులన్ ఇచ్చకాలు యన్నిసేసేవు? (వైభవోపేతమైన ఇచ్చకాలు యెన్ని ఆడుతున్నావు స్వామీ?

సంపుటి :14 కీర్తన : ఇంకనేల వెరపు యెదుటనే వున్నారము

సంఖ్య : 15 పుట : 10 - రాగం : మలహరి

**7. ఇంకనేల వెరపు యెదుటనే వున్నారము**
**వంకలొత్తకిఁక మఱి వద్దు వద్దు ఇపుడు ॥పల్లవి॥**

**వావులు నీ కెంచనేల వాడల గొల్లెతలకు**
**దేవరపు గావా తెలిసినదే**
**యీవల మావంక నిట్టె యేమి చూచేవు తప్పక**
**మోవనాడితి మిదివో మొదలనే నేము ॥ఇంక॥**

**చందాలు చెప్పఁగ నేల సతినెత్తుక వచ్చితి-**
**విందుకు రాజవు గావా యెరిఁగినదే**
**దిందుపడి మమ్ము నేల తిట్టేవు పెదవులను**
**నిందవేసితి మిదివో నిన్ననే నేము ॥ఇంక॥**

**వెలినవ్వేల పదారు వేలఁ బెండ్లాడితివి**
**బలిమికాఁడవు గావా భావించినదే**
**చెలఁగి పులివిందల శ్రీ రంగదేవుఁడ వని**
**కలసితి మిదె శ్రీ వేంకటరాయ నేము. ॥ఇంక॥**

**ఉపోద్ఘాతము :**

నేటి కడపజిల్లా పులివెందులలో నాడు వెలసిన శ్రీ రంగనాథ స్వామిపై శృంగార కీర్తన ఇది. పదియారు వేల భామలను పెండ్లాడిన వెలి నవ్వుల (ప్రకాశవంతమైన నవ్వులు) గల దిట్టవు కదా! నీ భావాలకు తగినట్లే ద్యోతక మవుతున్నావు. ఇంకా నీకు భయమెందుకు? మేము నీ ఎదుటనే వున్నాము. ఇప్పుడు మఱి వంకలు పెట్టొద్దు. వద్దు స్వామీ అంటున్నారు అన్నమయ్య. చాలా మాటలకు అర్థాలు యే నిఘంటువులోను దొరకలేదు.





**తాత్పర్యము :**

ఓ రంగనాధస్వామీ! ఇంకనేల వెరపు? (ఇంకా భయమెందుకు)? మేము నీ యెదుటనే వున్నారముకదా! మఱి ఇక వంకలు పెట్టవద్దు. ఇప్పుడు వంకలు పెట్టి లాభమేమి? స్వామీ!

మేమెంత? గొల్లవాడలలో వుండే గోపికలము. ఇక తెలిసినదే, నీవు దేవరవు గావా? (నీవు దేవ దేవుడవనే సంగతి తెలిసినదే కదా!) మఱి వావులు నీకెంచనేల? (మా వావి వరుస యెంచితే నీకు వొరిగేదేమిటి?) నేము (మేము) మొదలనే "మోవనాడితిమి" (నోటి మాటగా చెప్పాము... ఆ విషయం) ఈ వల (ఇప్పుడు) ఇట్లా మా వంక ఏమి చూచెదవు? ఇక నీ చందాలు (పద్ధతులు) చెప్పగనేల (చెప్పవలసిన అవసరమే లేదు) (అది యెరిగినదే. ఆనాడు సతినెత్తుక వచ్చేశావు). ఇందుకు రాజవు గావా? (ఇందులో నీవే మొనగాడివి, నీకు సాటిలేరు). మేమెవరికైనా నీ అఘాయిత్యం చెప్పామా? దిందువడి (నీచానికి దిగజారిపోయి) పెదవులతో మమ్మెందుకు నిందిస్తావు? నేము (మేము) నిన్ననే నిందవేసితిమి. (నీ మీద నింద గురించి చెప్పాము). ఇదిగో మమ్మల్ననవద్దు.

పులివెందులలో వెలసిన ఓ రంగనాథా! నీవు వెలినవ్వుల (ప్రకాశవంతమైన నవ్వులతోనున్న) బలిమికాడవు గావా? (మొనగాడివి కదా!) ఇట్లా గని మేము భావించినదే (వూహించినదే). అట్లు చెలగిన (వెల్లివిరిసిన) నిన్నే మేము ఈ తిరుమలలోనూ వేంకటరాయనిగా కలిసితిమి. ఇది మా భాగ్యము.

సంపుటి :14 కీర్తన : నమ్మినవారి పాలిటి నచ్చిన చింతామణి

సంఖ్య : 386 పుట : 224 - రాగం : దేసాక్షి

8. నమ్మినవారి పాలిటి నచ్చిన చింతామణి
నమ్మి వరాలిచ్చే విదే పదవేమి గడమా ॥పల్లవి॥

పూచిన తంగెడువంటి పొలఁతి నీవురమున-
నేచినది నీ సింగార మేమి చెప్పేది
కాచి పండిన కల్పవృక్షమువలె నీ మేను
చేచేత దొరకెనిదె సిరులేమి గడమా ॥నమ్మి॥

అరచేతిమాణిక్యమై యాపె నీ పొత్తున
యెరుక సే శారగించీ నేమి చెప్పేది
గురుతైన నీలాల కొండవలె నీవు నీవు (?)
జరుగుచు నున్నారు జయమేమి గడమా ॥నమ్మి॥

ముంగిట నిధానమైన మోహపుటలమేల్మంగ
అంగమందే కొలువున్న దదివో నీకు
సంగతి శ్రీ వేంకటేశ సరిఁ బరుసవేదివై
సంగడి నున్నారు మాకు చనమే(వే?)మి గడమా ॥నమ్మి॥





**ఉపోద్ఘాతము :**

క్షీరసాగర మథనము జరిగినప్పుడు శ్రీ వేంకటేశ్వరుడైన నారాయణుని పరిణయమాడిన లక్ష్మీదేవి వుద్భవించినది. ఆనాడు ఆమెతోపాటు అనేక దివ్యసంపదలు తోడబుట్టినవి. చింతామణి, కల్పవృక్షము, పరుసవేది అట్టివే అందుచే దుర్లభమైనవి. కానీ ఈ స్వామి సులభుడు. ఈయన తోడుంటే "చనవేమి గడమా? (కోరిక తీరుట అనేదానికి కొరత వుంటుందా?) అంటున్నారు అన్నమయ్య.

**తాత్పర్యము :**

ఈ శ్రీ వేంకటేశ్వరుడు, నమ్మినవారి పాలిటి చింతామణి. నమ్మినవారికి నచ్చిన వరాలిచ్చేటటువంటి మహానుభావుడీయన. ఇదే ఈయన నాశ్రయించండి. "పదవేమి గడమా?" (ఆశించిన పదవి దొరకటం ఒక లెక్కా?)

ఓ ప్రభూ! నీ వురముపై పూచిన తంగేడు పుష్పము వంటి (ఎఱ్ఱని) పొలతిని యేచితివి (స్త్రీని ధరించావు), నీ శోభనేమని వర్ణించను? కాచి పండిన (రక్షించే) కల్పవృక్షమువంటి, నీ మేను (విగ్రహము) చేచేత (వెంటనే) దొరికినది. ఇక మాకే సిరి సంపదలు కొరవడతాయి? మాకేం తక్కువ.

అరచేతిలో మాణిక్యం వుంటే యెంత నిబ్బరంగా వుంటుంది? నీ పొత్తున (పక్కన) ఆమె (లక్ష్మీదేవి) యెరుకసేసి (తన వునికి తెలుపుతూ) ఆరగించీని (మా నివేదన స్వీకరిస్తోంది). మా భాగ్యమేమని వర్ణించను? నీవు ప్రసిద్ధి చెందిన ఇంద్రనీలమణి కొండవలెనున్నావు. మీరు వూరేగింపుగా జరుగుచున్నారు. ఇక మాకు జయము నీకు కొదవేముంటుంది?

ప్రభూ! నీముంగిట (యెదురుగా) నిధానము వలె (పెన్నిధివలె) సమ్మోహకరమైన అలమేల్మంగ, అంగమంది (సాకారముగా) కొలువైవున్నది. ఓ శ్రీ వేంకటేశ్వరా! అదివో నీకు సరి సంగతి (జోడై) వున్న ఆమెతో కూడిన నీవు, మాకు పరుసవేది (స్పర్శవేది... దానితో ముట్టుకుంటే ఏదైనా బంగారం అవుతుంది) వలె నున్నారు. ఇక మాకు చనవు (కోరిక తీరుటకు) యేమి కొరత అవుతుంది తండ్రీ?

సంపుటి :14 కీర్తన : మేమేమి సేతుము మాకు మీరే

సంఖ్య : 454 పుట : 263 - రాగం : దేసాక్షి

9. మే మేమి సేతుము మాకు మీరే దిక్కు
చేముట్టిరా దితనిఁ జిత్తగించవమ్మా ॥పల్లవి॥

వోయశోద నీ కొడుకు వూరిపడుచులుఁ దాను
ఖోయని వుట్లు గొట్టీఁ గోలలఁగొని
చాయల జోరునఁ గారీ చమరుఁ బాలుఁ బెరుగు
సోయగపు నీ కన్నులఁ జూతువు రావమ్మా ॥మేమే॥

కొత్త జవ్వను లైన కొమ్మలచన్నులు తేనె-
దుత్తలంటా పొందించ దొరకొనీని
మొత్తములై యున్నారు ముంగిళ్ళ నెల్లాఁ దామే
గుత్తముగ నీవే కనుఁగొందువు రావమ్మా ॥మేమే॥

చేరలమేల్మంగఁ గూడి శ్రీ వేంకటాద్రిమీఁద
వీరుఁడె యేఁగీని వీది వీథుల
కూరిమి మేము నవ్వితే గుట్టున సన్నలు సేసీ
తేరకొన యిది నీవే తిలకించవమ్మా ॥మేమే॥

**ఉపోద్ఘాతము :**

రేపల్లెలోని గోపికలు వచ్చి యశోద దగ్గర మొరపెట్టుకుంటున్నారు. కృష్ణయ్య పాలు, వెన్న దొంగతనం చేస్తున్నాడనే కాదు, గోపెమ్మలతో అఘాయిత్యం చేస్తున్నాడని. వేంకటేశ్వరుడు తిరుమల వీధులలో వూరేగుతుంటే అన్నమయ్య పాడుతున్న ఈ కీర్తనలో యౌవన తొలకరిలోనున్న నల్లనయ్య చేసిన కొంటె చేష్టలెలా వున్నాయో చూడండి.





**తాత్పర్యము :**

ఓ యశోదాదేవీ! మీరు పెద్దవాళ్ళు. మేము చిన్నవాళ్ళము. మేము నీకేమని చెప్పము. మేమేమి చేయగలము? మాకు మీరే దిక్కు. ఈ కృష్ణుడున్నాడే... ఇతనిని చేతులతో పట్టుకోవటం అసాధ్యం. మా బాధలను కాస్త చిత్తగించవమ్మా!

ఓ యశోదా! నీ కొడుకు వూరి పడుచుల చాయల దాగి "ఖో"యని వులిక్కిపడేట్లు చేసి, వారి ఉట్లు తన కోలలతో (కర్రలతో) పగులకొడతాడు. వాటిలో దాచిన పాలు పెరుగు జోరుగా కారిపోతుంటే వాటిని చమరుతాడు, (తన అరచేత్తో కొట్టి నేలనంతా చిత్తడి చేస్తాడు). సోయగపు (అందమైన) నీ కళ్ళతో నీవే చూద్దువుగాని రావమ్మా!

ఓ యశోదా! అప్పుడే పుష్పవతులైన అమ్మాయిల ఱొమ్ములను "తేనె కుండలు బాగున్నాయే.." అంటూ పొందికగా పట్టుకొంటాడు. వాడి బాధపడలేని వాళ్ళంతా నీ ముంగిట జేరి మొత్తుకుంటున్నారు. తామంతా గుత్తముగా (గుంపుగా) చేరి నీ దగ్గరకొచ్చారు. రావమ్మా! నీ కళ్ళతో నీవే చూడు!

చేసినవన్నీ చేసి, నేడు బుద్ధిమంతుడిలా అలమేల్మంగతో చేరి శ్రీ వేంకటేశ్వరుడైన వీరాధివీరుడేవాడు. చూడండి ఈ తిరుమల వీధి వీధులలో యేగీని (వూరేగుతున్నాడు). మేము ఆయనను చూచి నవ్వితే.. మాకు కూడా గుట్టున (రహస్యముగా) సన్నలు సేసీని (సైగలు చేస్తున్నాడు). నేడు నీవే వకుళాదేవివి కదా! తేరకొని (నిదానంగా) ఇది నీవే చూడవమ్మా! ఆనాటి చిలిపితనం ఇంకా పోనేలేదు.

సంపుటి :14 కీర్తన : వేడుక కాడవౌదువు విట్ఠలేశా నాకు

సంఖ్య : 281 పుట : 164 - రాగం : లలిత

**10.** వేడుక కాఁడవౌదువు విట్ఠలేశా నాకు
వీడేమిచ్చేవప్పటిని విట్ఠలేశా ॥పల్లవి॥

వాసితో నీవద్దఁ దలవంచుకొంటేనంతలోనే
వేసేవు పూవులఁ గొని విట్ఠలేశా
ఆసపడి నీమీఁద నాకానలేల పెట్టేవు
వీసమంత పనికైన విట్ఠలేశా ॥వేడు॥

సన్నల నీవద్ద నేను సమ్మతించకుండఁగానే
వెన్నెల నవ్వు నవ్వేవు విట్ఠలేశా
చన్నులంటి వూరకైనా సరసములాడేవు
విన్న కన్న సుద్దిగాదు విట్టలేశా ॥వేడు॥

పలుకకుండితే నాతో బండుఁబూతుఁ గెలసేవు
వెలయ శ్రీ వేంకటాద్రివిట్ఠలేశా
బలిమి నన్నుఁగూడఁగా బనులెల్లాఁ జక్కనాయ
వెలుపలే లోనాయ విట్ఠలేశా ॥వేడు॥

**ఉపోద్ఘాతము :**

వేడుకకాడు (విలసపురుషుడు) అయిన విట్ఠలేశుని పై అన్నమయ్య శృంగార కీర్తన చెబుతున్నారు. నాయిక పాడుతున్న ఈ కీర్తనలో తను (నాయిక) మౌనవ్రతం పట్టితే విట్ఠలేశుడు బండ బూతులు తిడతాడట. నన్ను కూడితే నీ పనులన్నీ చక్కబడతాయి అని నచ్చ చెబుతున్నారు, స్వామికి.





**తాత్పర్యము :**

ఓ విట్ఠలేశా! నీవు గొప్ప వేడుక కాడవయ్యా! (విలాస పురుషుడవు) నాకు అప్పటికి (మళ్ళీ) వీడెమిచ్చేవు (రమ్మనమని తాంబూలమిచ్చి ఆహ్వానించుచున్నావు).

వాసితో (నీ ఆధిక్యతను గుర్తించి) నేను నీ వద్ద తలవంచాను. అంతలోనే నీవు పూవులను తీసికొని నాపై వేసినావు. నా చేత ఇప్పుడు ఏ చిన్నపని చేయించుకోవాలన్నా నీమీద 'ఒట్లు' పెట్టుకొంటావు. ఓ విట్ఠలేశా! నేను నీపై ఆశపడిన మాట వాస్తవమే... కాని నాపై ఇంత దాష్టీకం తగదు.

నీ దగ్గర నేనింకా నీ సైగలను ఆమోదించనే లేదు. నీవు వెన్నెలనవ్వులు (మనోహరమైన చల్లని నవ్వులు వెదజల్లుతున్నావు). నా కుచములను వూరకే, చీటికీ మాటికీ తాకుతూ సరసోక్తులు పలుకుతావు. విట్ఠలేశా! నీవు విన్న కన్న సుద్దికాడు (గొప్పమాటకారివి, ఎన్నడు వినలేదు చూడలేదు.. ఇటువంటి వాడిని).

నీ ప్రవర్తనకు నేను విసిగిపోయి, మాట్లాడటం మానేశానంటే వరుస బెట్టి బండు బూతులు (అసహ్యామైన తిట్లు) తిడతావు. స్త్రీనని కూడా ఆలోచించవు. నీవు శ్రీ వేంకటాద్రి మీద వెలసిన విట్ఠలేశుడవు. నన్ను నీవు బలవంతుడవై కూడితివి. నా పనులన్నీ జక్కనాయ (నెరవేరినవి). వెలుపలే లోనాయ (నేను బహిరంగంగానే... నీకు లొంగిపోయాను). ఓ విట్ఠలేశా! నీకు లొంగని వారెవరు ప్రభూ!

సంపుటి :14 కీర్తన : వేడుక కాడుదమ్మ విజనగరములోన
సంఖ్య : 294 పుట : 171 - రాగం : సామంతం

11. వేడుక కాఁడు గదమ్మ విజనగరములోన
వేడె వెట్టీ సతులను వెన్న ముద్ద కృష్ణుఁడు ॥పల్లవి॥

ఇంటిలో నా మొగఁడు నే నిద్దరమునున్న వేళ
వొంటినే తాఁజొచ్చి వచ్చీనోయమ్మలాల
దంట తనమున నేను తనకన్నులు మాసితే
చంటికి చేతులు చాఁచీ జాణఁడే యీ కృష్ణుడు ॥వేదు॥

కమ్మర మాయాతఁడు నేఁ గాఁగిలించుకుండఁగాను
వుమ్మడిఁ దా మోవి యిచ్చీనోయమమలాల
చిమ్ముచు నే నంతలోన సిగ్గువడితే నాపక్క
నిమ్ముసేసుకొని పండీనిదివో యీ కృష్ణుడు ॥వేదు॥

పేరుకొని నా విభునిఁ బిలిచితేనూ ఁకొని
వూరకె తా వచ్చికూడె నోయమ్మలాల
యీరీతి శ్రీ వేంకటాద్రినిరవై యీడా నాడ
కూరిములు వెదచల్లీ గోపాలకృష్ణుడు ॥వేదు॥





**ఉపోద్ఘాతము :**

విజయనగరంలో వెలసిన గోపాలకృష్ణుని కొంటె చేష్టలు వివరిస్తున్నారు అన్నమయ్య. ఆ గోపాల కృష్ణుడు వేడుకగాడట. వెన్నముద్దలు తినే ఈ కృష్ణుడు వెట్టి సతులను (గొల్లభామలను) వెన్న కావాలని వేడుకొన్నాడట. ఇక భర్తచాటున భార్యల్ని కూడా తన చిలిపి పనులతో వేధించాడట. ఏమా పనులు?

**తాత్పర్యము :**

ఓ ఇంతులారా! విజయ నగరములో వెలసిన ఈ గోపాలకృష్ణుడు వెన్నముద్దలు తినే వేడుకకాడు (విలాస పురుషుడు) కదటమ్మా! ఆ వెన్నముద్దలను కూడా వెట్టి సతుల (వెట్టి చాకిరీ చేసే గోపికల దగ్గర) వేడె (యాచిస్తాడు).

మా ఇంటిలో, నేను నా మొగుడు ఇద్దరము వున్న వేళ తాను ఒంటరిగా నక్కి వస్తాడమ్మా! ఈ కృష్ణుడు. దంటతనమున (నేర్పరితనంతో) నేను అతని కళ్ళు వెనకనుంచి మూస్తే... వెనక్కి చేతులు చాచి నాకు కుచములను పట్టు కొంటాడు. ఈ కృష్ణుడ గొప్ప జాణడు (చతురుడు, నంగనాచి).

ఓయమ్మలారా! కమ్మర (మళ్ళీ ఒకసారి) మాయాతడు (మా ఆయన) నేను కౌగలించుకుని వుంటే... తను మధ్యలో దూరి తన పెదవులు నాకందించాడు. నా వెట్టి మొగుడికి జరిగింది తెలియలేదు కానీ, నేను సిగ్గుతో చితికి పోయాను. అంతతో వదిలాడా.. ఇమ్ము సేసుకొని (మెల్లిగా నా పక్కన చోటు చేసుకొని) ఇదిగో ఈ కృష్ణుడు పడుకున్నాడు, (ఎవరన్నా చూస్తే నా గతి ఏమయ్యేది?)

ఓయమ్మలారా! నేను నా మొగుడ్ని పేరు పెట్టి పిలిస్తే ఆయన బదులు ఈ గోపాలకృష్ణుడు 'ఊ కొని' (ఊ కొట్టి) అనవసరంగా తను వచ్చి నాతో రమించాడు. ఇట్లాంటి చిలిపివాడు. ఇక్కడ విజయనగరంలోనే కాదు, అక్కడ శ్రీ వేంకటాద్రి మీద కూడా ఉన్నాడు. ఈ దేవదేవుడు కూరిములను (ప్రేమలను) వెదజల్లుతాడు. ఇదంతా మన అదృష్టమే సుమా!

సంపుటి :13 కీర్తన : ఐతివే యేలికెసాని వందరికిని

సంఖ్య : 151 పుట : 91 - రాగం : ఆహిరి

12. ఐతివే యేలికెసాని వందరికిని
నీతితో సవతులెల్ల నీకు లోనే యింకను ॥పల్లవి॥

ఆరసి నీ కాతఁడు అరవడమచ్చునే
పేరు రాన నేపొద్దూఁ బెట్టుకున్నాఁడు
సారెకు నీవు మంచి సకినాన వచ్చితివే
యీరాని చనవులెల్లా నిచ్చినాఁడు నీకు ॥ఐతివే॥

పొందుల నీకాతనికి పొంతనాలు గూడునే
మందలించి నీవాడినమాట దోయఁడు
యెందును నీమొకమాయ మందు యెటువంటిదే
కందువ నీ మోవికే కాచుకున్నాఁ డిపుడు ॥ఐతివే॥

చెలఁగి మంచివేళనే సేస నీవు వెట్టితివే
కలసి పాయఁడు శ్రీ వేంకటేశ్వరుడు
అలరి మమ్మేలెనాతఁడప్పణ నీవిచ్చితివే
వలపించ నేరుతువే వసమాయ నతఁడు ॥ఐతివే॥

**ఉపోద్ఘాతము :**

స్వామిపై మరులు గొనిన నాయికను హెచ్చరించి హితవు చెబుతున్నారు అన్నమయ్య. నీవు అందరికీ 'యేలికసాని' (రాజవేశ్య) వయ్యావు. ఇపడు నీకు ఆయన వలపు కత్తెలందరూ సవతులే. నీతితో ఆలోచిస్తే వాళ్ళంతా నీకు 'లోనే' (లొంగియుండవలసినవారే). మా కందరికీ 'ఏలిక' అయిన స్వామికి నిన్ను నీవే అర్పించుకొన్నావు. వలచి వలపించుకోవటం తెలిసినదానివి అందుకే నీకు ఆయన వశమైపోయాడు. అని కితాబునిస్తున్నారు.





**తాత్పర్యము :**

(ఓ చెలియా!) మొత్తానికి అందరికిని (స్వామిని వలచిన వారందరికీ) నీవు 'యేలికసాని' (రాజవేశ్య)వైపోయావు. ఆయనను వలచిన మా బోటి సామాన్యులందరూ నీ సవతులు. ఇక నీతో (న్యాయప్రకారము) ఈ సవతులందరూ నీకు 'లోనే' లొంగియుండవలసినవారే.

నీకు (నిన్ను) ఆయన కావాలని 'ఏపొద్దూ' (అన్నివేళలా), అచ్చునే (అచ్చముగా), 'పేరురాన' (ప్రేమతో) అరవడము పెట్టుకొన్నాడు (వుంచుకున్నాడు) ఆయన ఇష్టం. నీవు సారెకు (ఈ పర్యాయము) మంచి 'సకినాన వచ్చితివి. (శకునం చూసి వచ్చినట్లున్నావు), నీకు ఆయన ఇయ్యకూడని స్వాతంత్ర్యము ఇచ్చాడు. ఇకనేం.. యేలికసానివైపోయావు.

నీకు ఆయనకు పొందుల (కూటములలో) పొంతనాలు గూడునే (మంచి స్నేహము కలిసినది). నీవాడిన మాటను ఆయన దోయడు (మందలించి కాదనలేదు). యెందును (ఇక యెప్పుడైనా), ఆయనకు నీమొకమాయ మందు (నీ అందమైన ముఖము మందు అయిపోయింది). ఎటువంటిదే.. ఇప్పుడు నీ తీయటి అధరామృతం కోసం కాచుకొనియున్నాడు.

ఓ సఖీ! చెలగి (ఉత్సుకతతో) నీవు మంచివేళనే, సేసవెట్టితివి (ఆ స్వామి ఆశీర్వాదం పొందినావు). ఈ శ్రీవేంకటేశ్వరుడు నిన్ను కలసి పాయడు (నీపొందు విడువడు). నీ పొందువలన అలరి (తృప్తుడై) స్వామి మిమ్మల్ని కూడా యేలె (మన్నించినాడు). ఆయన అందరినీ ఏలే శృంగారరాయడు కదా!

సంపుటి :13 కీర్తన : చూతువు రావయ్యా సుదతిలాగు

సంఖ్య : 38 పుట : 23 - రాగం : శ్రీరాగం

13. చూతువు రావయ్యా సుదతిలాగు
చేతిమీఁది చెక్కుతోడ సిగ్గువడి వున్నది ॥పల్లవి॥

చెప్ప రానిమాటలు చెలి విన్నవించరాక
వుప్పతిల్లువలపుల నూరకున్నది
ఇప్పుడు నీవే విచ్చేసి యేకతాన నన్నీ విను
దప్పిదేరే మోముతోడ తలవంచుకున్నది ॥చూతు॥

భావములో కోరికలు బయలుసేయఁగ రాక
సోవలచెమటతోడ జొబ్బిలున్నది
వోవరిలోనికి వచ్చి వొరసి నీవే యడుగు
కావిరి నివ్వెరఁగులఁ గమ్ముకొని వున్నది ॥చూతువు॥

రతిలో రహస్యములు రవ్వలు సేయఁగ రాక
అతితమకముతోడ నలశున్నది
తతి శ్రీ వేంకటేశుఁడ దండనుండి కూడితివి
మతి నీవే యాసవపడి మంచముపై నున్నది ॥చూతు॥

**ఉపోద్ఘాతము :**

నాయికదైన్యావస్థను వర్ణిస్తున్నారు అన్నమయ్య. ఆమెకు రతి రహస్యాలు రవ్వలు సేయగ రాక (వెలువరించలేక) అతి తన్మయత్వంతో అలసిపోయి వున్నద. ఈ సుదతి అవస్థ చూతువుగాని రావయ్యా! చేతిమీద చెక్కుతోడ సిగ్గుపడి వున్నది, అంటున్నారు. ప్రాసకోసం అలా అన్నప్పటికీ ఆమె చెక్కిలి మీదనే చెయ్యివేసుకొని సిగ్గుపడి వున్నది.





**తాత్పర్యము :**

ఓ శ్రీ వేంకటేశ్వరా! నీవే చూతువు రావయ్యా! ఈమెకు నీపై ఎంతలాగు (ఆకర్షణ) కలిగివున్నదో చూడుము. ఈమె తన చెక్కిలిపై చేయి వేసికొని మిక్కిలి సిగ్గుపడి వున్నది.

తల వలపులు వుప్పతిల్లుచుండగా (ఉత్పత్తియగుచుండగా) ఆమె వాటిని నీకు విన్నవించుట చేతకాక, మాటలలో చెప్పలేక మౌనముగానుండి పోయినది. ఇప్పుడు నీవే విచ్చేసి ఏకాగ్రతతో ఆమె చెప్పేదంతా విను. దప్పిదేరే (తనివి తీరిన) ముఖము కలిగినదై తలవంచుకొని యున్నది.

తన భావనలలో నున్న కోరికలను బహిర్గతము చేయలేక చిరు చెమటలలో చిత్తడి అయిపోయినది. కావాలంటే వోవరిలోనికి వచ్చి (అంతఃపురంలోకి వచ్చి) వొరసి (చూచి) నీవే అడుగు ఆమెను. ఆమె కావిరి (దట్టమైన) నివ్వెరగుల (పారవశ్యము) కమ్ముకొని యున్నది.

ఈ సుదతి (యువతి) రతి రహస్యములను రవ్వలు సేయగరాక (బహిర్గతము జేయలేక) మిక్కిలి తన్మయత్వంతో అలసిపోయివున్నది. ఓ శ్రీ వేంకటేశ్వరా! నీవు దండ నుండి (ఆమె సమీపముననే యుండి) ఆమెను నీవే మతి (సమ్మతించి) కూడితివి. ఆమె యెట్లున్నదో చూచితివా ప్రభూ! యాసవపడి (యాసపడి... (అయివుంటుంది...) మంచముపై నీ కొరకు నిరీక్షించుచున్నది.

నోట్ : ఇది నా వూహకు తట్టిన వివరణము.

సంపుటి :13 కీర్తన : అటు చూడు సతి నేర్పులవుభళేశ

సంఖ్య : 471 పుట : 283 - రాగం : రామక్రియ

**14.** **అటు చూడు సతినేర్పు లవుభళేశ**
**అటమటములు గావు అవుభళేశా ॥పల్లవి॥**

**యెదురుఁ గొండలమీఁద నెక్కినట్టి లకిమమ్మ**
**అదివో నీతొడ యెక్కెనౌభళేశ**
**వుదుటున నంతలోనే వురముపై నెలకొని**
**అదిమీఁ జన్నుల నిన్ను నౌభళేశా ॥అటు॥**

**ముంగోపముతోడను మొక్కలీఁడవైన నిన్ను**
**నంగన గద్దెపైఁ బెట్టె నౌభళేశ**
**కంగక వేదాద్రి నిన్ను గరుడాద్రికిఁ దీసె**
**అంగాలంటె నింటిలోన నౌభళేశా ॥అటు॥**

**చేరి నీవు నవ నారసింహరూపులైతేఁ జెలి**
**ఆ రీతుల నిన్నుఁగూడె నౌభళేశ**
**గారవాన నీవు శ్రీ వేంకటముపై నుండఁగాను**
**ఆరసి రతి మెప్పించె నౌభళేశా ॥అటు॥**

**ఉపోద్ఘాతము :**

అహోబల నవనారసింహునిపై సరస శృంగార కీర్తన వినిపిస్తున్నారు అన్నమయ్య. ఆయన నవరూపులవాడైతే 'లకిమమ్మ' (ఆదిలక్ష్మి) కూడా ఆయనను నవ విధములుగా అలరించిందట. ఆ సతి నేర్పులు అటు చూడవయ్యా అవుభళేశా! (అహోబలేశ్వరా!) అటమటలుగావు (ఆమెప్రేమ నిజమైనది వంచనలు లేని నిర్మలమైన ప్రేమ). నీవే, వేంకట గిరిపైనున్నావని, నీ వురముపై నెలకొని రతి మెప్పించినదట.





**తాత్పర్యము :**

ఓ అవుభలేశ! (అహోబల నారసింహా!) నీ సతి నేర్పును అటు వొక్కసారి చూడవయ్యా! ఆమె నీపై చూపించు వలపు స్వచ్ఛమైనది. అటమటలు గావు (అందులో వంచనలు లేవు).

అదివో ఎదురు కొండలమీదనెక్కిన లకుమమ్మ (అదిగో నీ అహోబలపు యెదురుగానున్న గరుడాద్రి కొండలపై లక్ష్మీదేవి). ఆమె నీ తొడపై యెక్కి కూర్చున్నది. అంతలోనే వుదటన (గర్వముతో) నీ వురముపై నెలకొని నిను తన కుచయుగ్మముతో అదుముచున్నది. ఓ అవుభలేశా! ఆమె ఆ విధముగా నిన్ను అలరించుచున్నది.

ఓ అవుభలేశా! మొక్కలీడువైన (శూరుడవైన) నీవు గద్దెపై (సింహాసనముపై) కూర్చుండగా నీవు ముంగోపముతో నున్నావని అంగన (లక్ష్మీదేవి) నీతో చేరగా నీ భక్తులను కరుణించుచున్నావు. వెనుదీయక వేదాద్రిపై నిన్ను గరుడాద్రికి తెచ్చి, ఇంటిలో (పడకటింటిలో), అంగాలంటె (కౌగలించినది).

ఓ ఔబలేశా! నీవు అహోబలమున చేరియుండి నవ విధములైన నారసింహునిగా వెలసితివి. నీతోపాటు నీ అంగనకూడా ఆ రీతుల జేరి నిన్ను గూడెను. నీవు గారవాన (గౌరవముతో) శ్రీ వేంకటాద్రిపై శ్రీ వేంకటేశ్వరునిగా నుండగా నీదేవేరి కూడా అలమేలు మంగయై నిన్ను రతిలో మెప్పించినది. ఓ ఔబలేశా! అమె నీకు తగిన జంట, ప్రభూ!

సంపుటి :13 కీర్తన : సిగ్గువడ డిదివో చెలులాల

సంఖ్య : 128 పుట : 77 - రాగం : సాళంగనాట

15. సిగ్గువడఁ డిదివో చెలులాల
వెగ్గలపు సంతోసాన విఱ్ఱవీఁగీని ॥పల్లవి॥

వాఁడివో గోవిందరాజు వలపులు చల్లుతాను
పోఁడిమితోఁ బవ్వళించి భోగించీని
కోఁడి కోఁడి(?) చూపులను కొమ్మలు చూడఁగాను
నాఁడు నేఁడు వొక్కరీతి నవ్వు నవ్వీని ॥సిగ్గు

సంకుఁ జక్రములతోడ చంద్రగావి రెంటెముతో
కంకణముల చాఁచిన కరములతో
వుంకువ కానికలు వువిదలియ్యఁగాను
సంకెలేక మోవితేనె చవి చూపీని ॥సిగ్గు॥

బంగారు కటారమదే పానుపు శేషుఁడు వాఁడే
సింగారపు వేడుకలఁ జెలఁగీ నదే
చెంగటఁ బెండ్లాడుతాను శ్రీ వేంకటేశుఁడు దానే
వుంగరపు వేలు చూపి వొద్దికయ్యీని ॥సిగ్గు॥

**ఉపోద్ఘాతము :**

గోవిందరాజస్వామిని తిరుపతిలో సేవిస్తూ అన్నమయ్య చెప్పిన శృంగార కీర్తన ఇది.ఒకటి రెండు పదాలకి ఇదమిత్థంగా అర్థం తెలియకపోయినప్పటికీ సందర్భానుసారంగా ఆ పదములకర్థం భావించవలసి వచ్చింది. ఎందుకంటే అన్నమయ్య రాయలసీమలో ఆనాటి ప్రజల భాషను వాడినారు. కన్నడ, తమిళ భాషల ఒరవడి ఆయన వాడిన పదాలలో కనిపిస్తుంది. రాగి రేకులపై వ్రాసిన వారి





పొరబాట్లు వుండనే వున్నాయి. తాటియాకులపై వ్రాసిన వారి పొరబాట్లు వాటికి తోడై కొన్ని పదాలకు అర్థం వూహించవలసి వస్తున్నది.

**తాత్పర్యము :**

ఓ సఖియలారా! ఈ గోవిందరాజ స్వామిని చూచితిరా! ఇదిగో ఏమాత్రమూ సిగ్గుపడని ఈ స్వామి వెగ్గలపు సంతోసాన (మిక్కిలి ఆనందముతో) విఱ్ఱ వీగుచున్నాడు.

ఓ చెలియలారా! వాడివో గోవిందరాజు (వాడేనమ్మా గోవిందరాజంటే). ఆయన వలపులు చిందిస్తూ పోడిమితో (సౌఖ్యముతో) పవళించి భోగించుచున్నాడు. కోఁడి కోఁడి చూపులు ( ఆ ప్రక్కా, ఈ ప్రక్కా వాటుగా అటూ ఇటూ కనుగుడ్లు తిప్పుతూ చూచుట) తన ఇద్దరు కొమ్మలను (స్త్రీలను... శ్రీదేవి భూదేవీలను) చూస్తూ, నాడు (పురాణికాలంలోనూ) నేడూ (ఈరోజున) ఒకేవిధంగా నవ్వుతూ పడుకొనియున్నాడు.

ఈ గోవిందరాజు సంకుజక్రములతో (శంఖ చక్రములు) ధరించియున్నాడు. చంద్రగావి రెంటెముతో వున్నాడు. (సింధూరపు రంగు గల జంట వస్త్రములు ధరించి యున్నాడు). చాచిన చేతులకు కంకణములు ధరించియున్నాడు. ఉంకువ కానికలు (వసూలు చేసిన కానుకలను) వనితలు (శ్రీదేవి భూదేవి) ఆయన కర్పించగా లెక్కలేనన్ని పర్యాయములు వారి అధరామృతములను జుర్రుకొనుచున్నాడు.

ఈ స్వామి శేషతల్పశాయియై బంగారు కటారము (పెద్ద ఖడ్గము) ధరించి యున్నాడు. శృంగార లీలలను ప్రదర్శించుచున్నాడు. తన కాంతలకు దగ్గరయై పెండ్లాడుచున్నాడు. తానే శ్రీ వేంకటేశ్వరుడునూ అవుటజేత ఇదిగో ఇక్కడ తన వుంగరం వేలు చూపిస్తూ నేను మీవాడినే అని నమ్మకంగా చెబుతున్నాడు.

సంపుటి :13 కీర్తన : మగువను దయజూడు మగవాడి

సంఖ్య : 265 పుట : 159 - రాగం : శోక వరాళి

**16.** మగువను దయఁజూడు మగపాడి
యిగురుమోవి యిచ్చుటిది మగపాడి ॥పల్లవి॥

చెక్కిటి చేతితోడి చెలి సిగ్గుదేరిచి
మక్కువ సేయించుకుంటే మగపాడి
అక్కజపు విరహాన నసురుసురై యుండఁగ
ఇక్కువలంటి మన్నించుటిది మగపాడి ॥మగువ॥

చినుకుఁ జెమట మేని చింతతోడ నున్నదాని
మనసు రంజిలించుటే మగపాడి
తనివోని కోరికతో తలవంచుకుండఁగాను
యెనసి నవ్వు నవ్వించుటిది మగపాడ ॥మగువ॥

చాటుచు నీకుఁ బ్రియాలు సారెసారెఁ జెప్పఁగాను
మాటలాలించి వినుటే మగపాడి
ఆఁటదని చిత్తగించి అట్టే యీకెఁ గూడితివి
యీటున శ్రీ వేంకటేశ యిది మగపాడి ॥మగువ॥

**ఉపోద్ఘాతము :**

'మొగపాడి' (మొగతనం) అంటే మీసాలు మెలేసి, అహంకారం ప్రదర్శిస్తూ పెళ్ళాన్ని 'చెప్పుల్లాగా' వాడుకోవటం కాదు. భార్యని సుఖపెట్టగలవాడే భర్త. ఆమె మనస్సు నెరిగి రంజింపచేయాలి. ఈమె (అలమేల్మంగ) ను అట్లే గూడితివి యీటున, శ్రీ వేంకటేశ ఇదయ్యా 'మగపాడి' అంటే అని నిశ్చయించారు అన్నమయ్య. మగువని దయతో చూడటమే మొగతనం కానీ పదిమంది పిల్లల్ని పుట్టించడం కాదు.





**తాత్పర్యము :**

ఓ శ్రీవేంకటేశ్వరా! మగువను (భార్యను) దయగ జూచుట మగపాడి (మొగతనం) అనిపించుకొంటుంది. ప్రతి రేయీ ఆమెకు ప్రేమతో యిగురుమోవి (లేత అధరము) నందించుట మగపాడి.

ప్రభూ! తన చెక్కిళ్ళకు చేతినడ్డుపెట్టి సిగ్గుపడే చెలియను సిగ్గులనుండి దూరంచేసి ప్రేమింపచేసికొనుటే మగపాడి. ఆ విరహోత్కంఠిత, అచ్చెరువు కలిగించు విరహమున యసురుసరని (ఉస్సురుమని) నిట్టూర్చుచుండగా, ఇక్కువలంటి (ఆవైన తెలిసికొని) ఆమెను మన్నించుట, మొగతనము. ఆమెను లెక్క చేయనివాడేం మొగాడు?

ప్రభూ! భర్త ఇంకా రాడేమిటో అనే వ్యధతో మేనిపై చెమటలు చినుకులు వెల రాలుతుంటే దాని నాదరించి, ఆమె మనస్సును రంజింపచేయుట (సంతోష పెట్టుట) మగపాడి. తనివి దీరని కాంక్షతో తరుణి తలవంచికొని తహతహ లాడుతుంటే, యెనసి (పొంది) ఆమెను సుఖపెట్టి నవ్వులు నవ్వించుట మగపాడి అనిపించుకుంటుంది. (ఆరు అడుగుల పొడవు, ఆరి తేరిన కండలు కాదు మగపాడి అంటే...)

ఓ శ్రీ వేంకటేశ్వరా! నీకు తనప్రేమలను మాటి మాటికీ చెప్పుకొనే చిన్నదానిని మాట్లాడించి, ఆమె తన 'మనోగతం' తనే చాటుచుండగా వినుటయే మగపాడి. ఆటదాని (స్త్రీయని) చిత్తగించి (ఆమెను అర్థం చేసికొని) (ఈకెను) ఈమెను అట్టే గూడితివి. ఈటున (ఇక్కడ 'ఈటు' అనే మాట ఈ విధముగా అనే అర్థంలో వాడబడింది), తిరుమలేశా! ఇదయ్యా మగపాడి అంటే.

సంపుటి :13 కీర్తన : నాకెంత ప్రియము చెప్పీ నాటకీడు

సంఖ్య : 501 పుట : 301 - రాగం : మాళవ గౌళ

**17.** నాకెంత ప్రియము చెప్పీ నాఁటకీఁడు
కైకొని పొదిగీ నట్టే కాతరీఁడు ॥పల్లవి॥

వన్నెలఁ జెరఁగువట్టి వద్దఁగూచుండఁ బెట్టుక
యెన్ని మాటలాడి నాతో నెమ్మెకాఁడు
కిన్నెర నాచేతికిచ్చి కిణకిణ వాయింపించి
అన్నిటా మెచ్చీఁగదె ఆసోదకాఁడు ॥నాకెంత॥

వూరకే నేనుండఁగాను వొళ్ళిమీఁదఁ జేయివేసి
సారెకెంత నవ్వీనే జాణకాఁడు
మేరమీఱి జూజాలాడి మిక్కిలి తానే వోడి
కూరిమేమి గొసరీనే కోడెకాఁడు ॥నాకెంత॥

తనివిదీరక వచ్చి తనకు నే మొక్కఁగాను
పనులెన్ని చెప్పీనే పంతగాఁడు
చనవిచ్చి శ్రీ వేంకటేశ్వరుడు తానె నన్నేలె
ననుపు తానెంత సేసీ నాలికాఁడు ॥నాకెంత॥

**ఉపోద్ఘాతము :**

నాయిక శ్రీ వేంకటేశ్వరుని యేమంటోందో వినండి. ఆయన నాటకీడట, కాతరీడట, నెమ్మెకాడట, జాణకాడట, కోడెకాడట, పంతగాడట, నాలికాడట, ఆసోదకాడట, అలా యెందుకంటున్నాడో వివరిస్తున్నారు, అన్నమయ్య. దురదృష్టమేమంటే ఆనాటి తెలుగు అర్థం చేసికోవడం అంత తేలిక కాదు.





**తాత్పర్యము :**

ఆహా! నాటకీడు (నాటకాలరాయుడు) నాకెంత ప్రియము చెప్పీ (ప్రేమ గుమ్మరించే మాటలు చెబుతాడు!!) ఆ కాతరీడు (కలతపెట్టు స్వభావం కలవాడు) నన్ను కైకొని (పూనుకొని) అట్టే (తేలికగా) పొదిగీని (ఆక్రమించుకొంటాడు).

ఈ నెమ్మికాడు (ప్రేమికుడు) రంగులీను నా చీరకొంగు పట్టుకొని తనవద్ద కూర్చుండబెట్టుకొని యెన్ని మాయ మాటలు చెబుతాడు!! నా చేతికి కిన్నెర అనే వాయిద్యం ఇచ్చి దానిని కిణకిణ అనేట్లు మ్రోగింపజేసి, భళీ! యెంత అద్భుతంగా వాయించావు అని నన్ను వుబ్బిస్తాడు. ఎంత ఆసోదికాడు (అసాధ్యుడు)!! ఎంత చతురుడు!

ఈ జాణకాడు (టక్కరివాడు) వూరకే నా మానాన నేను వుంటే నామీద చేయి వేసి, మాటి మాటికీ నవ్వులు చిలికిస్తాడు. మేరమీరి (లెక్క లేకుండా) జూజాలాడి (జూదమాడి) బాగా ఓడిపోయి ఏమి కూరిమి గొసరని (ఏమి ప్రేమ కుమ్మరిస్తున్నాడండీ) ఈ కోడెకాడు (కోడెగిత్తలాంటి కుర్రవాడు)

ఇదిట్లావుండగా నేనాయనకు లొంగిపోయి తనకో నమస్కారం పెట్టగానే తృప్తి దీరక ఆ పంతగాడు (మొండిపట్టువాడు) యెన్ని చెప్పరాని పనులు చేస్తాడు!! ఈ శ్రీ వేంకటేశ్వరుడు నాకు చనవిచ్చి (ఆదరించి) తానే నన్నేలె (నన్ను ఏలుకొన్నాడు) ఈ నాలికాడు (జిత్తులమారి శ్రీనివాసుడు) ననుపు తానెంతజేసీ (ఎంత అనురాగము చేస్తాడు!!) ఎంత ప్రేమిస్తాడు!!)

సంపుటి :13 కీర్తన : ఇన్నియు నీయందే కంటిమిక నొకచోట
సంఖ్య : 524 పుట : 316 - రాగం : మంగళకౌశిక

18. ఇన్నియు నీయందే కంటి మిఁక నొకచోటఁ గాదు
సన్నల చాయల నేము సంతోషించేమయ్యా ॥పల్లవి॥

మగవానికేడ సిగ్గు మగువలు వద్దనుంటే
తగిలి కాఁగలించఁగఁ దమకింతురు
యెగసక్కేలాడేవారి నెరఁగరు చెలరేఁగి
పగటు వయోమదము పచరింతురు ॥ఇన్ని॥

కోడెకానికేడ వేళ కొమ్మలు మాటలాడితే
యేడనైనాఁ గూడుమంటూ నెచ్చరింతురు
ఆడికెకు వెరవరు అండవారిఁ జూడరు
వీడెపు మోవితేనెకు వేఁడుకొందురు ॥ఇన్ని॥

మొక్కలీనికేడ నీతి ముదితలఁ బొడగంటే
గక్కనఁగాఁగిట నించి కరగింతురు
మక్కువ శ్రీ వేంకటేశ మండెమురాయఁడవై
యిక్కడ నన్నేలితివి యింతా నెరుఁగుదురు ॥ఇన్ని॥

**ఉపోద్ఘాతము :**

మండెము అనుగ్రామమున వెలసిన నారసింహునిపై సరసశృంగార కీర్తన చెబుతున్నారు అన్నమయ్య. మొక్కలీనికి (తెగించిన ముష్కరునికి) స్త్రీల వద్ద నీతియేమిటి? అంటున్నారు. ఈ తెంపరితనం లాంటి ఇన్ని గుణాలూ నీ వొక్కడిలోనే





చూశామయ్యా! కాని మేము చీకటిపడంగానే నీ చిలిపి సైగలు చూచి కోపగించుటగాక మిక్కిలి సంతసించుచున్నాము. ఏమిటీ విడ్డూరం?

**తాత్పర్యము :**

ఓ మండెము రాయా! ఈ గుణాలన్నీ కూడా నీవొక్కడిలోనే చూస్తున్నాము. సన్నల చాయల నొకచోట గాదు (రేయింబగళ్ళు వెదకినా ఒక్కచోట, ఇవన్నీ చూడాలంటే సాధ్యమేకాదు.) మేమెక్కడా చూడలేదు. కానీ నీలో చూచి మేము సంతోషించామయ్యా!

స్త్రీ వద్దనుండే మగవాడికి సిగ్గెందుకయ్యా? వాళ్ళని తగులుకొని కౌగలించి తమకింతురు (మైమరపింతురు) చెలరేగిపోయి పగటు వయోమదమున (లావణ్యము కనబడే కోడెవయస్సు మదముతో) పచరింతురు (ప్రవర్తిస్తుంటారు). స్త్రీలతో పరాచికాలాడుతుంటారు. ఓ మండెము రాయా! ఇవి నీకు తెలియవా?

కోడె ప్రాయములో వున్నవారికి వేళాపాళా వుంటుందా? ఆడవాళ్లు కనబడగానే యెక్కడ పడితే అక్కడ రమిద్దామని బలవంతం చేస్తూనే వుంటారు. స్త్రీలు వారితో మాటలాడితే వదలరు. ఆడికెకు వెరువరు (తిట్టినా దులపరించుకొని పోతారు). అండవారి జూడరు (దగ్గర యెవ్వరున్నారో కూడా చూసికొనరు). తాంబూలం వేసికొన్న అధరామృతం కావాలని వేడుకొంటారు. నీకివన్నీ తెలుసుకదయ్యా!

ఓ మండెమురాయా! మొక్కలీడుకి (తెగించిన చాటు మాటు ప్రియుడికి) ఆడవాళ్ళ దగ్గర నీతియేమిటయ్యా! చటుక్కున కౌగలించి కరగించివేస్తారు. నీవే తిరుమల శ్రీ వేంకటేశ్వరుడవు కూడా కాబట్టి, ఇక్కడ (ఈ మండెములో) నన్ను యేలుకొనినావు. ఇంతా (ఇక్కడున్న వీళ్ళంతా) దీనిని యెరుగుదురు.

సంపుటి :13  కీర్తన : ఇట్టే కరుణించవయ్యా యింతిని జూచి

సంఖ్య : 301                    పుట : 181 - రాగం : ఆహిరి

**19.** **ఇట్టే కరుణించవయ్యా యింతినిఁ జూచి**
**దట్టమాయ వలపులు తమకమువల్లను** ॥పల్లవి॥

**నొసలి కస్తూరిబొట్టు నునుఁజెమటఁ దడిసి**
**యసలాయ నిన్నుఁ బాసినందువల్లను**
**వుసురు నూరుపులచే నూఁగఁజొచ్చెఁ బయ్యద**
**వెస నలయించినట్టి విరహమువల్లను** ॥ఇట్టే॥

**పూసిన గందపుఁబూత పులకలచేఁ జిటిలి**
**రాసివడెఁ బాసిన రారాఁపువల్లను**
**వేసటతోఁ బొరలఁగా వీడి వున్నది తురుము**
**పోసరించినట్టి తలపోఁతలవల్లను** ॥ఇట్టే॥

**తట్టుపునుగు చెక్కులఁ దతి కాఁకలఁ గరఁగి**
**వుట్టిపడీ నిన్ను! బాసి వున్న వల్లను**
**గట్టిగా శ్రీ వేంకటేశ కలసితి వింతలోనే**
**వెట్టదీరిన రతుల వేడుకలవల్లను** ॥ఇట్టే॥

**ఉపోద్ఘాతము :**

నాయిక విరహావస్థను వర్ణిస్తున్నారు అన్నమయ్య. ఈ యింతిని చూచి ఇట్టే కరుణించవయ్యా! అని స్వామిని వేడుకొంటున్నారు. తమకమువల్ల (అనురాగము వలన) ఆమెకు ఆయనపై ప్రేమలు దట్టమైనవి (ఇనుమడించినవని) అంటున్నారు. ఆ దశలో ఆమె అవస్థను వర్ణిస్తున్నారు. శ్రీ వేంకటేశ్వరుని వేడుకొంటున్నారు.





**తాత్పర్యము :**

ఓ ప్రభూ! ఈ ఇంతిని ఇట్టే (ఇప్పుడే) కరుణించవయ్యా! నీపై తమకము (అనురాగము) వలన ఆమెకు దట్టమాయవలపులు (ప్రేమలు అధికమైని). నీవే పరికింపుము.

ఆమె నుదుటిపై లోజెమట వలన తడిసి నొసలిపై నున్న కస్తూరీ తిలకము అస్తవ్యస్తమైనది. నిన్ను బాసినందువలన (విడిచియున్నందున) ఆవేదనచే ఆ చెమటలు అసలారినవి (అతిశయించినవి). ఆమె పైట వడి వడి నిట్టూర్పులచే వూగి పోతున్నది. ఓప లేని విరహము ఆమెను వెస (శీఘ్రంగా) అలయించినది (అలసిపోవునట్లు చేసినది).

ప్రభూ! మేని పులకరింతల వలన, ఆమె పూసికొనిన గంధపు పూత చిట్లి పొడి పొడిగా రాలిపోయింది. దాదాపు (మిక్కిలి వ్యధ) బాసిన వలన (నీవు ఆమెను వీడినందువల్ల) ఆమెకు కలిగినది. వేసట (అలసట) వలన అటూ ఇటూ పొరలి ఆమె తురుము (కొప్పు) ముడి వూడిపోయినది. ఈ అవస్థ ఆమెకు యెందుకు కలిగినది? పోసరించిన (ఇక్కడ.. మత్తెక్కిన.. అని చెప్పుకోవాలి) ఆలోచనలు నీపై కలిగిన కారణము వలన.

ప్రభూ! నిన్ను వీడుట వలన ఆమె చెక్కిళ్ళు వేడెక్కి వాటిపై రాసిన తట్టు పునుగు (ఒక సుగంధ ద్రవ్యము) కరిగి వుట్టిపడి (బైటకు వచ్చేసింది). ఓ శ్రీ వేంకటేశ్వరా! అప్పుడు ఆమె తిప్పలు చూడలేక నీవామెను ఇంతలోనే (శీఘ్రముగా) గట్టిగా వెట్టదీరిన (తాపము నశించునట్లు రతుల కూడితివి. నీ రతుల వేడుకవల్ల ఆమెకు ఉపశమనము కలిగినది తండ్రీ!

సంపుటి :13 కీర్తన : మెచ్చిరి గొల్లెతలెల్ల మీద మీదను

సంఖ్య : 80 పుట : 48 - రాగం : దేసాళం

**20.** మెచ్చిరి గొల్లెతలెల్ల మీఁద మీఁదను
యిచ్చిరి చనవులు నీవిట్టే బతుకవయ్యా ॥పల్లవి॥

అంగనలై తేఁ జాలు నట్టే దయ దలఁతువు
యెంగిలి మోవులని యెంచవు
కంగులే కెప్పుడు మెడఁగట్టు కొనే వుందువు
యింగితపురతులు నీకేమి గడమయ్యా ॥మెచ్చి॥

వెలఁదులైతేఁ జాలు వేడుకఁ బెండ్లాడుదువు
పొలసి వారేమిచ్చినాఁబూసుకొందువు
నెలకొని యేపొద్దు నెత్తిఁ బెట్టుకొందువు
వలపులనోము నీకు ఫలియించెనయ్యా ॥మెచ్చి॥

మానినులై తేఁ జాలు మర్మములు చూతువు
ఆనుక వీఁపున మోచు కలరుదువు
నే నలమేలుమంగను నీవు శ్రీ వేంకటేశుఁడ-
వీనిజాన నిన్నుఁ గూడితింక నేలుకోవయ్యా ॥మెచ్చి॥

**ఉపోద్ఘాతము :**

గోపాలకృష్ణునిపై చెప్పిన ఈ సరస శృంగారకీర్తనలో గోపికలు ఆ నల్లనయ్యను మెచ్చుటచేత ఆయనకు మీద మీదను (అతి తేలికగా) చనవులు యిచ్చిరి (అనురాగము చూపారు). ఇదే అదనుగా ఆయన రకరకాల చిలిపి చేష్టలతో వారిని అలరించాడు. అన్నమయ్య వేంకటకృష్ణయ్యతో 'నీవిట్టే బతుకవయ్యా! (నీవిలాగే వీరిని అలరించవయ్యా!) అని ఉత్సుకించుచున్నారు. చివరికి అలమేల్మంగ యేమంటున్నదో వినండి.





**తాత్పర్యము :**

ఓ గోపాలకృష్ణా! నిన్ను గోపికలందరు మెచ్చుకొనినారు. నీకు మీద మీదను (అతి తేలికగా) చనవులు (వారి వలపులను) ఇచ్చారు. నీవు ఇలాగే బ్రతుకవయ్యా! నీవు వారిని "ఏలుకో శృంగార రాయా!"

అంగనలైతే (స్త్రీలైతే) చాలును. వారిని సులభముగా దయజూచెదవు. ఎంగిలి అనికూడా చూడక అధరామృతము నాసిస్తావు. జంకు గొంకులేక వారిని పరిష్వంగముల నూరింతువు. అయినా నీవు 'జారు' డవు గావు. ఇంగితపు రతుల (ఔచిత్యముగల కూటముల) నారితేరినావు. నీకేమిలోటయ్యా?

కాంతలైతే జాలు కళ్యాణమునకు సిద్ధమవుతావు. నీకు బెండ్లి వొక వేడుక. వారు మంచిగంధమిచ్చినా, గొల్ల కంపునిచ్చినా ప్రేమగా పూసుకొంటావు. వారిని నీనెత్తిన బెట్టుకొని మన్నిస్తావు. నీవు అతి నిష్ఠతో చేసే ఈ 'వలపులనోము' ఫలించకుండా ఉంటుందా? ఫలించిందయ్యా! వారు నీవు లేక జీవించలేని స్థితికి వచ్చేశారు.

మరి, నీవు మాత్రం తక్కువ తిన్నావా? మానినులైతే చాలు (అమ్మాయిలైతే చాలు) మర్మములు చూతువు (వారి రహస్యాంగములను చూచెదవు). అటు పిమ్మట నీ వీపుపై వారిని మోని అలరించెదవు. అది.. ఆనాటిమాట. నేడు నీవు శ్రీ వేంకటేశ్వరుడవు. నేనే అలమేల్మంగను. ఇదే నిజం. నిన్ను నేను కూడితిని. ప్రభూ! నన్ను ఏలుకోవయ్యా! శృంగారరాయా!

సంపుటి :13 కీర్తన : సతికిని బతికిని చలములేల

సంఖ్య : 156 పుట : 94 - రాగం : నారాయణి

**21.** సతికినిఁ బతికిని చలములేల
రతివేడుకలనే రమించుటగాక ॥పల్లవి॥

బింకములే తఱచై తే ప్రియములేరీతి మించు
జంకెన లెక్కుడైతేను శాంతములేవి
మంకులే మెరసితే మర్మములెట్టు గరఁగు
లంకెలై వొకరొకరు లాలించుట గాక ॥సతికి॥

నాలితనము నేర్చితే ననుపులెక్కడ నుండు
తూలపోవ నాడితే సంతోసమేడది
కేలనే వొడ్డు కొంటేను క్రియలెట్టు సమకూరు
తాలిమితో నవ్వులను దైవారుటగాక ॥సతికి॥

యెమ్మెలే మిక్కుటమైతే యియ్యకోలెట్ల నౌను
దొమ్ములే నెరపితే పొందులెట్టు గల్గు
కొమ్మ నిన్నలమేల్మంగ కూడె శ్రీ వేంకటేశుఁడ
వుమ్మడి సరసముల నోలాడుట గాక ॥సతికి॥

**ఉపోద్ఘాతము :**

భార్యాభర్తలమధ్య చలము (ద్వేషము) వుండవచ్చునా? సతిపతులు సతతము రతి కౌతుకమున నుండవలె. రమించుటయందే సమయము గడుపవలె అంటున్నారు అన్నమయ్య. శ్రీవేంకటేశ్వరునికి ఆయన దేవేరికి కూడా అదే సలహా నిచ్చివుమ్మడి సరసముల నోలాడుటేగాక! ఇంకా చెప్పేదేముంది స్వామీ! అంటున్నారు. కొత్తగా పెళ్ళయిన జంటే కాదు, షష్ఠిపూర్తి చేసికొన్న ముసలి దంపతులు కూడా దీనిని చదివి లెంపలేసుకోవలసిందే.. మరి.





**తాత్పర్యము :**

ఓ ప్రభూ! భార్యా భర్తల మధ్య పొరపొచ్చాలుండదగునా? అసలు వారి మధ్య చలములు (ద్వేషభావము) లెందులకు? వారి ధ్యాస రతి సౌఖ్యములపైనుండవలెను. గాని మత్సరము పనికిరాదు.

సతిపతులమధ్య పట్టుదలలు తఱచుగా వస్తుంటే, ఇక ప్రేమలెట్లా పెరుగుతాయి? జంకెనలు (బెదిరింపులు) అతి అయితే వారు శాంతంగా యెలా వుంటారు? మంకు పట్టుదల లెక్కువైతే ఒకరి గురించి ఇంకొకరు రహస్యాలు విప్పిచెప్పుకోగలరా? అందుకనే భార్యాభర్తలు లంకెలై (ఒకరినొకరు పెనవైచికొని) లాలించుకొనుచు (బుజ్జగించుకొంటూ) వుండాలి.

స్వామీ! సతిపతులు నాలితనము (కుత్సితము) నేర్చితే ననుపెలెక్కడ? వారి మధ్య అనురాగము యెట్లా మిగులుతుంది? ఒకరినొకరు నిందించుకొంటుంటే సంతోషం యెక్కడుంటుంది. చేతులతో అడ్డగిస్తే పనులెట్లా జరుగుతాయి? ఇక... దారేమిటి? నిబ్బరంగా నవ్వి దైవారవలెను (అతిశయించవలెను. ఇదిగాక ఇంకో దారి లేదు.)

ప్రభూ! భార్యాభర్తలమధ్య 'యెమ్మెలు' (నేను అందగాణ్ణి), నేను అందగత్తెను అనే విలాసవంతమైన ఆలోచనలు) యియ్యకోలు (ఇచ్చి పుచ్చుకోవటాలెలా జరుగుతాయి) ఎలా జరుగుతాయి? దొమ్ములు (ఒకరితో నొకరు బాహాబాహి ముష్టియుద్ధం చేసికొంటే ఇంకా రతులెట్లా సాధ్యం అవుతాయి? ఓ శ్రీవేంకటేశ్వరా! నిన్ను కొమ్మ (అందాల యువతి) అలమేల్మంగ కూడినది. ఇక ఉమ్మడి సరసముల (ఒకరితో నొకరు సరస సల్లాపాలాడుకొంటూ) వుండండి. అట్లు ఓలాడుట (ఓలలాడుట) గాక ఇంకా చెప్పేదేముంది తండ్రీ!

సంపుటి :12 కీర్తన : వూరకే దక్కునటవే వుడివోని వలపు

సంఖ్య : 252 పుట : 146 - రాగం : శుద్ధవసంతం

**22.** వూరకే దక్కునటవే వుడివోని వలపు
గారవించి యాతని ఁ గౌగిలించఁగదవే ॥పల్లవి॥

మంచిమాట లాడితేను మరిగి నమ్మిక పుట్టు
ఇంచుకంత నవ్వినాను యియ్యకో లవును
వంచనతో మొక్కితేను వడి మొగమాట గల్గు
మించుగాఁబొగడితేను మేలెల్లా దైవారును ॥వూర॥

మళ్ళి మళ్ళి చూచితేను మనసులు గరఁగును
వెల్లివిరిఁ గొసరితే వేడుక లవును
వొల్లనే వీడె మిచ్చితే వుప్పతిల్లుఁ దమకము
చెల్లుబడి గలిగితే సిగ్గు లెల్లాఁ దేరునూ ॥వూర॥

యిచ్చకమై వుండితేను యింపు లౌను రతులెల్లా
పచ్చిదేరఁగూడితేను బలుసు నాస
యిచ్చట శ్రీ వేంకటేశుఁడే నలమేలు మంగను
తచ్చన లేక యేలెఁ దలఁపు లీడేరెనూ. ॥వూర॥

**ఉపోద్ఘాతము :**

అలమేలుమంగమ్మ చెలికత్తెగా అవతరించిన అన్నమయ్య అమ్మవారితో అంటున్నారు. "ఓ చెలియా! వుడివోని వలపు (యెన్నడూ క్షీణించని ప్రేమ), వూరకే దక్కుతుందే? నీవు చేయాల్సింది యేమిటో తెలుసా? ఆతని (శ్రీ వేంకటేశ్వరుని) గౌరవంతో ఆహ్వానించి కౌగలించాలి కదటే? (చూస్తూ కూర్చుంటే సరిపోతుందా?) అంటున్నారు. అంతేకాదు కొన్ని కిటుకులు కూడా చెబుతున్నారు.





**తాత్పర్యము :**

ఓ సఖీ! అలమేల్మంగా! వుడివోని వలపులు (యెన్నడూ తరిగిపోని ప్రేమలు) వూరకే దొరుకుతాయటే. ఆతని ( నీ భర్తయైన శ్రీనివాసుని) గౌరవంతో ఆహ్వానించి కౌగలించుకోవద్దా!! (నేను చెప్పేది జాగ్రత్తగా విను.)

స్త్రీ మంచిగా మాట్లాడితే పురుషుడు మరిగి (పరవశించి) అతనికి నమ్మకం కలుగుతుంది. కొంచెము నవ్వగానే తన అంగీకారం తెలియజేస్తాడు. వంచనతో నమస్కరిస్తే సంకోచం కలుగుతుంది. పురుషుని యెంత పొగిడితే అంత మేలు (వలపు) దైవారును (అతిశయించి కలుగుతుంది). ఓ దేవీ! ఈ కిటుకులు తెలియవలెనమ్మా!

పురుషుని, మళ్ళీ మళ్ళీ చూచితేను (కొసరి కొసరి స్త్రీ చూచిందంటే) అతని మనస్సు కరిగిపోతుంది. బ్రతిమిలాడి వద్దంటుంటే అతనికి వేడుక కలుగుతుంది. ఒల్లన (తిన్నగా నోటి) తాంబూలమునిస్తే అతనికి తమకము వుప్పతిల్లుతుంది. (పరవశత్వం కలుగుతుంది). చెల్లుబడి కలిగితే (అతనిపై కొద్దిగా అధికారం వస్తే) నీ సిగ్గులన్నీ పోయి చనువు వస్తుంది. (అప్పుడు మరింత దగ్గరవుతావు).

ఓ దేవీ! యెంత అనుకూలవతివైవుంటే సంభోగములంత మధురముగా నుంటాయి. పచ్చిదేర (అరమరికలు లేక) కూడితేనే ఆశలు బలిష్టమవుతాయి. ఇక్కడ స్వయంగా శ్రీ వేంకటేశ్వరుడే, అలమేల్మంగను తచ్చనలేక (పరిహాసముగా కాకుండా) యేలె (యేలుకున్నాడు.) మనస్ఫూర్తిగా ఆ స్వామి ఆమెను ఏలుకున్నందువల్ల ఆమె తలపులు ఈడేరినని (ఆమె కోరికలు ఫలించినవి).

సంపుటి :12 కీర్తన : సముఖా అవధారు సర్వేశ రాఘవేంద్ర
సంఖ్య : 527 పుట : 302 - రాగం : సాళంగనాట

**23.** సముఖా అవధారు సర్వేశ రాఘవేంద్ర
అమరులు వా రివో చిత్తావధానా ॥పల్లవి॥

రాముఁడు గొలువున్నాఁడు రాజులాల కొలువుఁడు
వామదేవ సేవించు వసిష్ఠకను
సామజములవా రవో జవనాశ్వములవార
మీమీ పౌఁజులతో నిరుమేలా నిలువరో ॥సముఖా॥

భరత గొడుగువట్టు బాగాలిమ్ము శత్రుఘ్న
సరుస లక్షణుఁడ వింజామ రిడుము
సొరిది నిలుచుండుడు సుగ్రీవాంగదులాల
వెరపుతో విభీషణ విన్నపాలు సేయవో ॥సముఖా॥

వానరులాల మొక్కుడు వాయుజ పాదము లొత్తు
నానా దేశాధీశులాల కానుక లిందు
పూని శ్రీవేంకటాద్రిపైఁ బొంచి సీతాసమేతుఁడై
శ్రీనిధియై వరా లిచ్చీ చేకొనరో ప్రజలు. ॥సముఖా॥

**ఉపోద్ఘాతము :**

రాఘవేంద్రుడైన శ్రీరామచంద్రునిపై కీర్తన నాలాపిస్తున్నారు అన్నమయ్య. "సముఖా! అవధారు సర్వేశ.." అంటే ఈ సర్వేశుని సముఖము అవధరించి హెచ్చరికగానుండుడు. వారివో (అదిగో వారే) అమరులు చిత్తగించియున్నారు, అని అర్థం. శ్రీరామచంద్రుని దర్బారును వర్ణిస్తున్నారు. ఇది శృంగార కీర్తన కాకపోయినా ఈ సంపుటి 12లో వెలువరించబడినందును. దీని నెన్నుకొనుట తటస్థించినది. కన్నులకు కట్టినట్లున్న వర్ణన అంటే ఇదియే.





**తాత్పర్యము :**

ఇది రాఘవేంద్రుడైన శ్రీరామచంద్రుని సముఖము. అవధరించి అందరూ హెచ్చరికతోనుండండి. వారివో (అదిగో వారే) దేవతలు. చిత్తావధానా (చిత్తగించండి)

శ్రీరామచంద్రుడు కొలువు దీరి యున్నాడు. సామంతరాజులారా ఆయనను కొలవండి. ఓ వామదేవా! సేవించుకొనుము. ఓ వసిష్ఠా! నీవు ఆయనని చూచి ఆశీర్వదించు. మహత్తరమైన గజసేన అదిగో. వారే జవనాశ్వములను నడపునది (మంచి యౌవనమున నున్న అశ్వసేన నడుపువారు). మీమీ పౌజులతో (సేనలతో) సభకిరువైపులా నిలిచి సిద్ధంగా వుండండి.

ఓ భరతుడా నీవు రాజారామునకు గొడుగుపట్టి నిలువుము. ఓ శత్రుఘ్నా! బాగాలిమ్ము (వక్కపొడి అందించుము). ప్రక్కనే నిలబడిన లక్ష్మణా! నీవు వింజామరతో రాజారామునికి విసరుము. సుగ్రీవాంగదులారా! సొరిది నిలుచుండుడు. (ఒక క్రమములో నిలువుడు). అంత పెద్దదానవ రాజ్యాన్ని పాలించగలనా అని భీతిల్లు విభీషణా! నీవు విన్నవించేదేమన్నా వుంటే చేసికొనుము.

ఓ వానరులారా! అంతా మ్రొక్కండి. మారుతీ! నీకిష్టమైన రాముని పాదములను ఒత్తుము. వివిధ దేశాధిపతులారా! మీరు తెచ్చిన కానుకల నందించండి. సిద్ధమై వేంకటాద్రిపై వెలసి సీతాసమేతుడవై శ్రీనిధియై (శ్రీ వేంకటేశ్వరుడై) అనేక వరముల ననుగ్రహించి చేకొనరో (అనుగ్రహించి రక్షించండి).

సంపుటి :12 కీర్తన : పురాణ పురుషుడు భువినవతరించేను
సంఖ్య : 383 పుట : 219 - రాగం : ప్రతాపనాట

24. పురాణ పురుషుడు భువి నవతరించెను
సిరుల జయంతి నేడు సేయరో పండుగలూ ॥పురాణ॥

శ్రావణ బహుళాష్టమిఁ జందురుఁ డుదయించెను
ఆవేళ రోహిణిని అర్ధమరాతిరికాడ
దేవకి కృష్ణునిఁ గాంచె దేవతలు నుతియించ
చేవ దేరెఁబనులెల్లా సేయరో పండుగలూ ॥పురాణ॥

నందుని మందకు నేఁగినాఁడే వసుదేవుఁడు
కందువఁగృష్ణునెశోదకడఁ బెట్టి మాయఁ దెచ్చి
యిందమని కంసుచేతి కిచ్చితే మాయాదేవి
చెంది విడిపించుకొనె సేయరో పండుగలూ ॥పురాణ॥

చిన్నకృష్ణుడై పెరిగి చేరి కంసుఁ బొరిగొని
యెన్న శ్రీవేంకటేశుఁడౌ ఇందరిఁగాచీ నిటె
వున్నది యలమేల్మంగ వురమున నితనికి
చెన్నుమీఱి దాసులెల్ల సేయరో పండగలు. ॥పురాణ॥

**ఉపోద్ఘాతము :**

ఒకానొక శ్రీకృష్ణ జయంతి సందర్భంగా అన్నమయ్య వినిపించిన అద్భుతమైన కీర్తన ఇది. శిశువైన పరమాత్మను వసుదేవుడు రేపల్లె చేర్చటం. యశోద పక్కలోని శిశువును (మాయాదేవి) మధురచేర్చటం, కీర్తన ఇతివృత్తం. అన్నమయ్యముద్ర ఏమంటే శ్రావణ బహుళాష్టమినాడు నడిరేయి పుట్టిన ఆ శిశువు నేడు శ్రీ వేంకటేశుడౌ ఇంతమందినీ కాపాడుతున్నాడట. ఇక అలమేల్మంగ ఆయన వురముపైనెక్కి చెన్నుమీరి కూర్చుందట. హరిదాసుల్లారా! పండుగ చేసికొనుడు అంటున్నారు.





**తాత్పర్యము :**

ఆదికినాదియైన పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు. ఆయనే స్వయంగా పుడమినవతరించిన, సిరుల జయంతి (వైభవోపేతమైన జన్మదినము) నేడే. ఓ ప్రజలారా! మీరు పండుగ చేసికోండి.

ఈరోజు శ్రావణ బహుళ అష్టమి. చంద్రోదయం అవుతున్నది. ఆవేళ రోహిణీ నక్షత్రయుక్త 'అర్ధమరాతిరి' (నడిరేయిలో) దేవకీదేవి కృష్ణుని ప్రసవించింది. దేవతలందరు ఆయనను సన్నుతించారు. ఈరోజు చేవదీర (సంబరముతో... అని చెప్పుకోవాలి) ఇక్కడ బనులెల్లా సేయరో పండుగలు. (పండుగ పనులన్నీ చేయుడు).

అప్పుడు వసుదేవుడు, నందగోపుడుండే మందకు (రేపల్లెకు) వెళ్ళినాడు. చాకచక్యంతో చిన్నారికృష్ణుని యశోద చెంతనుంచాడు. ఆమెకు పుట్టిన మాయాదేవి నెత్తుకొనివచ్చి, యిందమని (ఇదిగో తీసికో అని) కంసునికి ఇచ్చాడు. అప్పుడా మాయాదేవి వాడి పట్టునుంచి విడిపించుకొని ఆకాశంలో మెరిసింది. ఓ జనులారా! పండుగలు చేసికోండి.

ఆపైన ఆ బాలుడు చిన్నారి కృష్ణయ్యయై పెరిగి పెద్దవాడై కంసుని పొరిగొని (సంహరించి)... యెన్న (అతిశయించి), నేడు శ్రీ వేంకటేశ్వరుడై ఇదే, ఇంతమందినీ రక్షించుచున్నాడు. అలమేల్మంగకూడా విడువక ఆయన వురము నధిష్ఠించి చెన్నుమీర (శోభాయమానంగా) నున్నది. దాసులెల్లా వీరిదాసులైనవారందరూ పండుగలు చేసికొనండయ్యా!

సంపుటి :12 కీర్తన : యెటువంటియాగడీడే యీ కృష్ణుడు
సంఖ్య : 384 పుట : 220 - రాగం : బౌళి

**25.** యెటువంటి యాగడీఁడే యీ కృష్ణుఁడు
జొటజొటఁగారఁగానే జుట్టీ మీఁగడలు ॥పల్లవి॥

కొట్టెఁగృష్ణుడు వాఁడె కోల లెత్తి వుట్లపై
దట్టముగ గొల్లెతలు దాఁచినపాలు
చుట్టిన చక్కిలములు చొక్కపు నురుగులునుఁ
బెట్టిన కాఁగులతోనే పెంచులుగఁజేసీనే ॥యెటు॥

దొంతులు దించి దించి దొరకొనీ కృష్ణుడు
బంతిఁ జక్కెర వెట్టీ గోపాలుల కెల్ల
మంతనాన వద్దని మానుపఁబోతేఁ దాను
కొంత వారినోరఁ బెరుగులు చమరీనే ॥యెటు॥

వీదు లెల్లఁ దానె శ్రీ వేంకటాద్రి కృష్ణుఁడు
ఆదిగొని మెసగీని యడుకు లెల్ల
కాదని పెనఁగితేను కౌఁగిలించీ గొల్లెతల
సోదించి కుచములంటి సొంపుగాఁ గూడీనే. ॥యెటు॥

**ఉపోద్ఘాతము :**

నేటికాలంలో 'ఆగడీడు', 'చమరీనీ' లాంటి పదముల వాడుక లేనందు వల్ల ఈ కీర్తనకి తాత్పర్య వివరణ కావలసి వచ్చింది కానీ, లేకపోతే సరళమైన తెలుగు కీర్తన ఇది. ఆ కొంటెకృష్ణుడు 'జొటజొట' మీగడలు కారిపోతుంటే వాటిని జుఱ్ఱుకొన్నాడట. ఇది చదువుతుంటే ఆనందం కలుగదా? ఆ చిలిపి కుఱ్ఱవాడు యౌవనం తొంగిచూడగానే గొల్లెతలని యెలా అలరించాడో వినండి.





**తాత్పర్యము :**

(ఓ యశోదమ్మా!) ఈ కృష్ణుడు యెటువంటి "యాగడీడే? (అల్లరివాడే)!? వీడు మీగడలు జొట జొట కారిపోతుంటే వాటిని అమాంతం జుఱ్ఱుకొంటాడు.

ఈ కృష్ణయ్య తన చేతికఱ్ఱనెత్తి రేపల్లె గొల్లభామలు దట్టముగా (ధైర్యంగా) దాచికొనిన పాలు కారిపోయేట్లు కొడతాడు. వాళ్ళు కాగుల్లో (వెడల్పుమూతిగల బిందెలలో) పెట్టుకొనిన చుట్టిన చక్కిలాలును (చక్కిలములు), చొక్కపు (చక్కటి) నురుగులును పెంచులుగా (చిన్న చిన్న ముక్కలయ్యేట్లు) నుగ్గు నుగ్గు చేస్తాడు. (తినడానికి వీలుకాకుండా చేస్తాడు.)

దొంతులుగా పేర్చిపెట్టుకొనిన కుండలను బాగుగా దించి ఈ కృష్ణుడు గోపాలురనందరిని బంతిలో నిలబెట్టి మేము దాచికొనిన చక్కెరనంతా తినబెడతాడు. మేము మంచిగా వాడిని కూర్చోబెట్టి వద్దు నాయనా! అని బ్రతిమాలి మానిపించబోతే, కొంత పెరుగును మా నోటికి చమరీనే (రాసేస్తాడు). వాని ఆగడాలను యేమని చెప్పమంటావమ్మా!

ఇప్పుడు మీ పిల్లవాడు పెరిగి శ్రీవేంకటాద్రి కృష్ణుడైనాడు. ఈయన ఘనకార్యమేమిటో తెలుసునా? ప్రతి వీధిలోనూ తానేయై గొల్లవారి ఇళ్ళల్లో అటుకులపై ఆదిగొని (కన్నువేసి) వాటిని మెసగీని (మెక్కుతాడు). వాళ్ళు కాదని పెనుగులాడితే ఆ గోపికలను చటుక్కున కౌగలించుకొని, సోదించి (బలవంతాన) కుచములనంటి బహు సొంపుగా రమిస్తాడు. ఇంకా యేమి చెప్పమంటావు తల్లీ!

సంపుటి :12 కీర్తన : ఇందుకంటె నున్నదదే యెంచగ మూలధనము
సంఖ్య : 511 పుట : 293 - రాగం : రామక్రియ

**26.** **యిందుకంటె నున్న దదే యెంచఁగ మూలధనము**
**కందువ తలపోఁతలే కడుమూలధనము ॥పల్లవి॥**

**వనితకుఁ బతిమీఁదివలపే మూలధనము**
**మునుకొన్న తమకమే మూలధనము**
**కనుఁగొనే నెమ్మోముకళలే మూలధనము**
**వినయపుఁజేతలే వెసమూలధనము ॥యిందు॥**

**నేసవెట్టి పెండ్లాడినసిగ్గులే మూలధనము**
**మోసులైన పులకలే మూలధనము**
**ఆసపడి చూచే చూపే అన్నిటా మూలధనము**
**రాసికెక్క చిఱునవ్వే రతిమూలధనము ॥యిందు॥**

**కప్పుకొన్న వేడుకల కౌఁగిలే మూలధనము**
**ముప్పిరి మోవితేనెలే మూలధనము**
**యిప్పుడే శ్రీ వేంకటేశుఁ డింతలోనే, చెలిఁ గూడె**
**చెప్పరాని భోగములే జిగిమూలధనము. ॥యిందు॥**

**ఉపోద్ఘాతము :**

పురాతన కాలంలో ధనాన్ని ఒకమూల త్రవ్వి దాచివుంచేవారు. తమకు మాత్రమే తెలిసేటట్లు ఏదో గుర్తుకూడా పెట్టుకొనేవారు. పెద్దమొత్తం అయితే ఒక బిందెలో దాచివుంచేవారు. ఒకవేళ ఒకటికంటే యెక్కువ బిందెలుంటే, వాటికి 'లంకె' (కలిపికట్టు) ఒకటి కట్టి, విడిపోకుండా చూసేవారు. వాటినే లంకెబిందెలంటారు. ఆ మూలధనం వల్ల ఉపయోగమేమంటే, యెప్పుడు కావాలంటే అప్పుడు దాన్నిత్రవ్వి తీసికొని వాడుకోవచ్చు. అన్నమయ్య లౌకికులకు ఏవేవి, మూలధనమో వివరిస్తున్నారు.





**తాత్పర్యము :**

(ఓ నెచ్చెలీ!) యెంచగా (ఆలోచిస్తే...) యిందుకంటె నున్నది (ఇదిగాక ఇంకొకటుంటే...) అదే మూలధనము. వలచినవారికి కందువ తలపోతలే (ఏకాంతములో ప్రియుల గూర్చిన) ఆలోచనలే అంతులేని మూలధనము.

స్త్రీకి తన భర్తపై నున్న వలపే (ప్రేమయే) గొప్ప మూలధనము. మునుకొన్న (అన్నిటికంటె ముందున్న) పారవశ్యమే, ఆ వలపునకు మూలధనము. ఆ పారవశ్యానికి మూలధనమేమంటే, ఆమె నెమ్మోము కళలే (పరిపూర్ణ చంద్రునివంటి మొగము కళలే). దానికంటే మూలధనమేమిటో తెలియునా? వెస మూలధనము. ఆమె వినయపు జేతలే (నమ్రతతో చేసే పనులే) నేస (సేస... అయివుంటుంది)

నేసవెట్టి పెండ్లాడిన సిగ్గే (పెండ్లినాటి సిగ్గులే, ఆ జంటకు) మూలధనము. మోసులైన (మొలకలెత్తిన) పులకరింతలు ఆ సిగ్గులకు మూలధనము. ఆ పులకరింతలకు మూలధనమేమిటో తెలియునా? ఆశతో తన ప్రియుడెప్పుడొస్తాడోనని ఆమె అన్నివైపుల చూస్తున్నది. ఆ చూపులే... ఆ పులకలకు మూలధనము. రతిరాసికెక్కిన (మనోహరమైన) ఆయన చిరునవ్వే వాటన్నిటికీ మూలధనము.

పైజెప్పిన వాటన్నింటికీ మూలధనమేమంటే అతిశయించిన వేడుకతో కౌగిలించి ఆయన ఇచ్చిన మధురాధరమే. ఇంతలోనే ఈ శ్రీవేంకటేశుడు ఇప్పుడే ఆ చెలియను గూడినాడు... చెప్పుటకు సాధ్యముకాని వారి భోగములే దేదీప్యమానమైన మూలధనము.

సంపుటి :12 కీర్తన : గోవిందుడీ బాలుడు గోపాలుడు

సంఖ్య : 137 పుట : 79 - రాగం : సాళంగనాట

27. గోవిందుఁడీ బాలుఁడు గోపాలుడు
కావింప రేపల్లెలోని కాంతాలోలుఁడు ॥పల్లవి॥

జనియించెఁ గృష్ణుఁడు సర్వలోకజిష్ణుఁడు
పనివడి సజ్జనుల పాలికి వర్ధిషుఁడు
సనకాదులమతుల సంచరిష్ణుఁడు ॥గోవిందుఁ॥

పెరిగెఁ గంసజైత్రుఁడు భీషణ తేజమిత్రుఁడు
వరవసు దేవదేవకీ పుత్రుఁడు
సరస భావించి చూడ సర్వజీవగాత్రుఁడు
సరగ రుక్మిణీసత్యభామా కళత్రుఁడు ॥గోవిందుఁ॥

వెలసె భూధరుఁడు విశ్వలోక గురుఁడు
సులలిత బలభద్ర సోదరుఁడు
కలితనిశ్చల శ్రీవేంకటగిరి సంచారుఁడు
కలసిన యలమేల్మంగా మనోహరుఁడు. ॥గోవిందుఁ॥

**ఉపోద్ఘాతము :**

అన్నమయ్య వాడిన విశిష్ట పదము సంచరిష్ణుడు. సనకాది ఋషుల మనములలో సంచరిష్టుడట. అంటే సంచరించువాడని భావము. కళత్రము అంటే పెండ్లాము అని అర్థము. కళత్రుడు అని నిఘంటువులో కానరాదు. కానీ రుక్మిణీ సత్యభామా కళత్రుడు అనే పదము వాడారు అన్నమయ్య. కావింప రేపల్లెలోని కాంతా లోలుడట ఈ గోవిందుడు. కావింప అంటే కాజేయటం అని అర్థం. రేపల్లెలో





కాంతలను (పడుచుల మనస్సులను) దొంగిలించే స్త్రీలోలుడట. ఔరా! ఎంతమాట అన్నారు!! సర్వజీవగాత్రుడు, విశ్వలోకగురుడు, నేడు శ్రీ వేంకటేశ్వరుడు కూడా ఈ శ్రీమన్నారాయణుడే.

**తాత్పర్యము :**

(ఓ చెలియలారా!) ఈ బాలుడు యెవ్వరనుకొన్నారు? ఇతడే గోవిందుడు. గోపాలుడైన కృష్ణయ్య కూడా ఇతడే. వీడు రేపల్లెలో కాంతలను (స్త్రీలను) కావింప (కాజేయటంలో) లోలుడు (మిక్కిలి కోరిక గలవాడు).

పుడమినవతరించిన ఈ కృష్ణుడు. సర్వలోక జిష్ణుడు (లోకముల నన్నింటినీ గెలిచినవాడు). ఈతడే రాక్షసాంతకుడైన శ్రీ మహావిష్ణువు. సజ్జనులను కాపాడుటకు అవతరించిన వర్ధిష్ణుడు (వృద్ధిబొందు త్రివిక్రముడు). ఈతడే సనక, సనందనాది ఋషుల మానసాకాశంలో సంచరించు సంచరిష్ణుడు.

ఈతడే కంస జైత్రుడు (కంసుని జయించువాడగుటకై) పెరిగినాడు. గొప్పతేజముగల లోకమిత్రుడు. వసుదేవునికి దేవకీదేవికి వరముగా జన్మించిన కుమారుడు. సరుస (సరస... అంటే చేరువయై అని అర్థం) భావించి చూచినచో 'సర్వజీవగాత్రుడు' (జీవాత్మయై సర్వజీవులలో యేదో ఒక శరీరం ధరించివున్నవాడు కూడా ఈ దేవదేవుడే). పెద్దవాడయ్యాక ద్వారకలో రుక్మిణీ సత్యభామలకు కళత్రుడు(పెనిమిటి) ఈయనే.

ఈ భూకాంతుడే, విశ్వలోకగురుడు (సృష్టిలోని లోకములన్నింటికీ గురుడు (తండ్రి). బలభద్రుడు అని పేరుగాంచిన బలరామునికి సులలిత సోదరుడు (చక్కని సౌకుమార్యం గల తమ్ముడు). నేడు ఈయనే నిశ్చలమైన శ్రీవేంకటగిరియందు సంచరించు వానిగా కలితుడు (ఎఱుగ బడినవాడు). పుడమికి వచ్చి అలమేలు మంగయై కలిసిన శ్రీతరుణి మనోహరుడు కూడా ఈ నల్లనయ్యయే.

సంపుటి :18 కీర్తన : వినోదకాడైనాడు విట్ఠలేశుడ

సంఖ్య : 301 పుట : 202 - రాగం : మాళవి

**28.** వినోదకాఁడై నాఁడు విట్ఠలేశుఁడు
అనాదిదేవుఁడనేయాతఁ డీతఁడా ॥పల్లవి॥

మాయరోలఁ గట్టువడి మద్దులు విరిచివేసి
ఆయతమైయున్న యట్టియాతఁ డీతఁడా
పేయలఁ గాచినాఁడు పెరుగువంటకములు
ఆయెడ నారగించినయాతఁడీతఁడా ॥వినో॥

తల్లిబిడ్డలైన గొల్ల తరుణుల నెల్లాఁ గూడి
అల్లుకొనఁజేసె వావు లాతఁ డీతఁడా
తొల్లి గోవర్ధనమెత్తి దొరతనాలెల్లాఁజేసి
అల్లవాఁడె నిలుచున్నాఁ డాతఁ డీతఁడా ॥వినో॥

చందముగ రుకుమిణి సత్యభామాదిసతుల
నందంద పెండ్లాడిన ఆతఁడీతఁడా
ఇందిరయుఁ దానుఁగూడి ఇదె శ్రీ వేంకటాద్రిపై
నందరికి వరాలిచ్చీ నాతఁడీతఁడా ॥వినో॥

**ఉపోద్ఘాతము :**

విట్ఠల దేవుడిపై అన్నమయ్య చెప్పిన చక్కటి కీర్తన ఇది. ఈ విట్ఠల దేవుడు రేపల్లె వినోదకాడు. మరి జగద్గురువని అనాది దేవుడని కీర్తించబడిన దెవరు? ఆతడే ఈతడా? అని ప్రశ్నిస్తున్నారు. ఆరూపంలో రుక్మిణీ సత్యభామల్ని పెళ్ళాడినదీ నేడు శ్రీ వేంకటేశ్వరుడై ఇందిరన గూడినదీ ఒక్కరేనా? ఆతడీతడేనా... అంటున్నారు.





**తాత్పర్యము :**

ఈ విట్ఠలేశుడు గొప్ప వినోదకాడు (విలాసపురుషుడు). అనాది దేవుడనే ఆతడే (ఆదిదేవుడు ఆది లేని దేవుడు అయిన ఆ శ్రీమన్నారాయణుడు, ఇతడేనా?

ఆనాడు రేపల్లెలో మాయామానుష బాలుడై తల్లి యశోద చేత రోటికి బంధించబడి అంతపెద్ద రోటితో రెండు మద్ది వృక్షములను గూల్చి, ఆయత్తమై యున్నట్టి (కనబడినటువంటి) ఆతడే (నందనందనుడే) ఇతడు (ఈ విట్ఠల దేవుడు). ఆనాడు నంద వ్రజమున పేయలను (దూడలను) కాచి వాళ్ళమ్మ చేసిన పెరుగుపచ్చడి వంటి వంటకములను తినిన ఆతడే (గోపాలకృష్ణయ్యే) మన యెదురుగానున్న ఈ విట్ఠలుడా?

వావివరుసలు, సాధ్యాసాధ్యాలు మానవమాత్రులకేగాని పరమాత్మకుండవని నిరూపించుటకా! యన్నట్లు తల్లికూతుళ్ళైన గోపికలను కూడి అల్లుకొన్న ఆతడే (ఆ గోపీకృష్ణుడే) ఈ విట్ఠలేశుడా? తొల్లి ఇంద్రుని రాళ్ళ వర్షంనుండి గోకులమును రక్షించుటకు గోవర్ధన పర్వతమును తన చిటికెన వ్రేలిపై యెత్తి దానిక్రింద గోవులను గోపాలురను రక్షించిన ఆ గిరిధరుడే ఈ విట్ఠలుడా?

ఆనాడు ద్వారకలో శోభాయమానంగా రుక్మిణీ, సత్యభామలను అందందు (అక్కడక్కడే) పెండ్లాడిన ఆ శ్రీకృష్ణుడే ఈ విట్ఠలుడా? ఇదే (ఈ సమయంలోనే) ఇందిరయైన అలమేల్మంగతోకూడి శ్రీ వేంకటాద్రిపై తన ఆశ్రితులకు వరములిచ్చే ఆతడే (శ్రీ వేంకటేశ్వరుడే) ఈతడా ఈ విట్ఠలేశుడా?

సంపుటి :18 కీర్తన : ఎందరి బెండ్లాడినా నీకే మాయను
సంఖ్య : 24 పుట : 17 - రాగం : గౌళ

**29.** ఎందరి బెండ్లాడినా నీకేమాయను
అందుకుఁగా నే నిన్ను నొఁగాదనేనా ॥పల్లవి॥

వలచి వచ్చితినని వనిత వేఁడుకొనఁగా
చెలిమి సేయక యేల సిగ్గువడేవు
సొలపుఁజూపుల నిన్నుఁజూచిచూచి కొసరఁగా
తలవంచుకొని యేల తప్పించుకొనేవు ॥ఎంద॥

కాఁపురము సేయవచ్చి కాచుకొని యాపె వుండఁగా
యేపున నీవు సెలవి నేల నవ్వేవు
పైపై నీతమ్ములానకు భామ చేయిచాఁచఁగాను
రాఁపుజాణతనా లేల రచ్చలో నాడేవు ॥ఎంద॥

వేడుకతో నాపె నీకు వెసఁ బాదాలొ త్తరాఁగా
కూడుదువు గాక యేల గుట్టుచూపేవు
యీడనె శ్రీవేంకటేశ యిటు నన్నుఁగూడితిఇ
వీడెమిచ్చేసతి నేల వింతసేసేవు ॥ఎంద॥

**ఉపోద్ఘాతము :**

"నీవు జగన్నాధుడవు, శృంగారరాయడవు యెంతమందిని పెండ్లాడినా యేమవుతుంది? పాపం అందుకోసమే నిన్ను ఔగాదనలేకున్నాను. (అడ్డు చెప్పలేకపోతున్నవి,) పైగా ఆమె పట్ల నీ ప్రవర్తనకూడా అదొకలాగ వున్నది అంటున్నారు) అన్నమయ్య. వనిత తనంత తా వలచి వచ్చిన చుల్కనగాదె?





**తాత్పర్యము :**

ఓ ప్రభూ! నీవు జగన్నాథుడవు. ఎంతమందిని పెండ్లాడినా నీకేమి? నిన్ను కాదనువారెవరు? ఆమాత్రం దానికే నేను నిన్ను ఔగాదు (నిరాకరించుట) అనగలనా!

నీవు షోడశకళానిధివి. నేను ఆడుదానను. స్త్రీ తనంత తాను వలచి వచ్చి వేడుకొంటే ఆమెను మన్నించి చెలిమి చేయక సిగ్గుపడుతున్నావు. ఇది భావ్యమా? పరవశించి నిన్ను చూచి చూచి నావంటి తరుణి కొసరగా (తన కోరిక తెలుపగా) నీవు తలవంచుకొని నన్నెందుకు తప్పించుకొని తిరిగేవు? నేనంత కాని దాననయ్యానా?

నీ పక్కనే వున్న ఆ అందాల రాసిని చూశావా? ఆమె నీతో కాపురము చేద్దామని వచ్చి కాచుకొని నిరీక్షిస్తున్నది. నీవేమో యేపున (విజృంభించి) సెలవి నవ్వులు (చిరునవ్వులు) చిందిస్తున్నావు. నీ తమ్ములానకు భామ (పద్మావతీదేవి) పైపై చేయిజాచగాను (అనురాగబద్ధయై నిన్ను వేడుకొంటే) "రచ్చలో రాఁపు జాణతనాలు యేల ఆడేవు?" (పదిమంది ముందు నీ నయగారితనము యేల చూపించెదవు?)

ఆమె నీకు వేడుకతో పాదాలొత్తగా, కూడుదువుగాక! అంతమాత్రాన గుట్టురట్టు చేయవలెనా? అదటుంచి ఇప్పుడిక్కక నన్నుకూడా కూడితివి. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇదేమిటయ్యా! వీడె మిచ్చే సతిని యేల వింతసేసేవు? రోజూ నీకు తాంబూలమిచ్చే సతిని... నీ భార్యతో వింతగా ప్రవర్తిస్తున్నావు.) ఇదేమిటి ప్రభూ!

సంపుటి :18 కీర్తన : కన్నుల మొక్కేము నీకు గడపరాయ
సంఖ్య : 472 పుట : 316 - రాగం : సామంతం

**30.** కన్నుల మొక్కేము నీకుఁ గడపరాయ నన్నుఁ
గన్నెనాఁడె యేలితివి కడపరాయ ॥పల్లవి॥

కందర్ప గురుఁడ వోకడపరాయా మాకు
గంద మీయఁగదవోయి కడపరాయా
కందము నీగుణములు కడపరాయా తొంటి
కందువకు రాఁగవోయి కడపరాయా ॥కన్ను॥

కలువపూవుల వేసి కడపరాయా నేఁ
గలికి నంటా మెచ్చేవు కడపరాయా
కలకాలముఁ బాయకు కడపరాయా నీ
కలపుకో లెరుఁగుదుఁ గడపరాయా ॥కన్ను॥

గరిమ శ్రీ వేంకటాద్రి కడపరాయా నన్నుఁ
గరుణించి కూడితివి కడపరాయా
గరిమెలు నేరుతువు కడపరాయా నా
గరువ మీదేర్చితివి కడపరాయా ॥కన్ను॥

**ఉపోద్ఘాతము :**

నేటి కడపను అన్నమయ్య కాలంలో దేవుని గడప అనేవారు. అక్కడ వెలసిన శ్రీ వేంకటేశుని కడపరాయుడంటారు. ఈ కీర్తనలో అన్నమయ్య ఒక దాసియై తనను స్వామి కన్నె ప్రాయంనుండే ఏలినాడంటున్నారు. తనను విడచి కలకాలము వుండవద్దు స్వామీ! అని వేడుకుంటున్నారు.





**తాత్పర్యము :**

ఓ కడపరాయా! నా కన్నులతోటే నీకు మ్రొక్కెదను. నీకు నాకు అనుబంధమీనాటిది కాదు. నీవు నా కన్నె ప్రాయము నుండియే నాకు యేలికవైనావు.

ఒ కడపరాయా! నీవు కందర్ప గురుడవు (వలపుల ఱేడు అయినట్టి మన్మథుని కన్నతండ్రివి.) (నీ అందమే వానికి వచ్చింది). మాకు (నాకు) గంధము నిచ్చినా వలపు నంగీకరించుము ప్రభూ! నీ గుణములు, కందము (మబ్బువలె నిలకడలేనివి. అంటే నీకు యెప్పుడు యెవరిపై అనురాగం కలుగుతుందోచెప్పలేం). తొంటి కందువకు రాగదవో (తొలిసారి నన్ను కరుణించిన, ఏకాంత ప్రదేశానికి రా స్వామీ! (నీకోసం నాకళ్ళు కాయలు కాచునట్లు నిరీక్షిస్తుంటాను).

ఓ కడపరాయా! ఆనాడు నాపై కలువపూవులు వేసి నా అందాన్ని మెచ్చుకొని, నేను కలికిని (మనోహరమైనదానను) అని అన్నావు. నన్ను మెచ్చుకొన్నావు. మరి అందువల్ల నన్ను యేనాడూ బాయకు( విడువవద్దు ప్రభూ!) నీ కలుపుకోలుతనం నేనెరుగుదునులే స్వామీ! నీవు యెప్పుడు, యెక్కడ, యెవరి, నెందుకు, యెలా అనుగ్రహిస్తావో యెవడు చెప్పగలడు?

గరిమ (మహిమాన్వితోపేతమైన) శ్రీ వేంకటాద్రిపై వెలసిన కడపరాయా! నన్ను కనికరించి కూడితివి (చేరువయైతివి). నీవు గరిమెలు నేరుతువు (మాయలు నేర్చిన వాడవు). నా గరువమీదేర్చితివి (నా స్వాభిమానాన్ని నిలబెట్టావు). నీకు సదా కృతజ్ఞురాలను, దేవదేవా!

సంపుటి :18 కీర్తన : అంబుజాక్ష నమోప్రహ్లాదవరద

సంఖ్య : 300 పుట : 201 - రాగం : సాళంగనాట

**31.** అంబుజాక్ష నమో ప్రహ్లాద వరద పీ
తాంబరధర ప్రహ్లాద వరద ॥పల్లవి॥

హరివేషావతార ప్రహ్లాద వరద
హరి(ర?) విరించినుత ప్రహ్లాదవరద
పరమపురుష నమో ప్రహ్లాద వరద ॥అంబు॥

అమిత గుణాకర ప్రహ్లాదవరద
అమరవందిత ప్రహ్లాద వరద
అమృతమయరూప ప్రహ్లాద వరద
ప్రమదాంక నమో ప్రహ్లాద వరద ॥అంబు॥

అహిరాజ శయన ప్రహ్లాదవరద
అహోబలేశ ప్రహ్లాద వరద
సహజ శ్రీవేంకటాచల నివాస నిత్య
బహురవితేజ నమో ప్రహ్లాద వరద

**ఉపోద్ఘాతము :**

అహోబలేశ్వరుడైన నారసింహుని, ప్రహ్లాద వరదా అని కీర్తిస్తున్నారు అన్నమయ్య. అంబుజాక్షుడు, పీతాంబరధరుడైన ఆ దేవదేవునికి నమస్కరిస్తున్నారు. ఆయన హర, విరించి నుతుడంటే బ్రహ్మ మహేశ్వరులు కొలుచునట్టి ప్రహ్లాద వరదుడట. నిత్యమూ వేంకటాచలంపై నివాసముంటాడట.





**తాత్పర్యము :**

ప్రహ్లాదుని అనుగ్రహించిన ఓ నరసింహా! పద్మదళ నేత్రుడవైన నీకు నమస్కరించుచున్నాను. పీతాంబరధరుడవు (పసుపుపచ్చని పట్టు వస్త్రమును) ధరించిన నీకు ఇవే, నా వందనములు.

హరి వేషావతార (సింహము యొక్క రూపమున అవతరించిన) నీవు ప్రహ్లాదుని రక్షించితివి. ప్రభూ! నీవు హర విరించి నుతుడవు. (శంకరుని చేతను, చతుర్ముఖ బ్రహ్మ చేతను కీర్తింపబడు మహానుభావుడవు.) శత్రువులైన దానవులను అంతమొందించిన వాడవు. పరమ పురుషుడవు. అట్టి ఓ ప్రహ్లాద వరదా! నీకు నమస్కరించుచున్నాను.

ఓ ప్రహ్లాద వరదా! నీవు అమిత గుణాకరుడవు. భీభత్సముగా హిరణ్యకశిపుని తుదముట్టించి, భయంకరంగా వాని అనుచరులను పరిమార్చి, కరుణతో ప్రహ్లాదుని రక్షించి, శాంతముతో దేవతలకు వరములిచ్చి, శృంగారముతో శ్రీలక్ష్మిని అలరించిన అమిత గుణాకరుడు. ఆయన రూపము అమృతమయము. ఆయన ప్రమదను (భార్యయైన లక్ష్మీదేవిని) అంకమున (తొడపై) కూర్చుండబెట్టుకొనినాడు. అట్టి స్వామికి నమస్కరింతును.

ఓ ప్రహ్లాద వరదా! నీవు అహిరాజ శయుడవు(సర్పముల రాజైన ఆదిశేషునిపై పవళింతువు.) అహోబలమునకు అధినాధుండవు. సహజముగా (అనాదిగా) నిత్యము శ్రీవేంకటాచలము నివాసముగానున్న శ్రీ వేంకటేశుడు కూడ నీవే. అనేక సూర్యుల దివ్య తేజస్సు గలవాడవు. అట్టి నీకు అనేక నమస్కారములు. ఓ దేవదేవా! మమ్ము అనుగ్రహింపుము, తండ్రీ!

సంపుటి :18 — కీర్తన : మగవాడు మెత్తనైతే మరి

సంఖ్య : 502 — పుట : 336 - రాగం : బౌళి

32. మగవాఁడు మెత్తనైతే మరి యపకీర్తి గాదా
తగవు నెరపకుంటే తరుణులు మెత్తురా ॥పల్లవి॥

నీ పదాలు వాడి ఇంతి నిన్నుఁ గాఁగిలించెనంటా
కోపగించి నీదేవులు కొంగు వట్టెను
చూపెట్టుక వున్నాఁడవు చొక్కి విడిపించవద్దా
యీపాటివాఁడవైతే యెవ్వరు నమ్మేరు ॥మగ॥

సేవ సేసేఆఁటది చేరి పాదా లొత్తెనంటా
వోవరిలోఁ దనవద్దనుంచుకొన్నది
నీవద్దికి నంపుమని నేఁ డాపెకుఁ జెప్పకుంటే
యీవలావలిపొందు లెట్టు జరగీని ॥మగ॥

నాటక్క(క?) సాలమగువ నవ్వి నిన్ను ఁ గూడెనంటా
మేటియలమేల్మంగ మీరనియ్యదు
నీటున శ్రీ వేంకటేశ నీవె తెచ్చుకొనవలె
మాటపట్టు లెటువలె మచ్చిక రేఁచీని ॥మగ॥

**ఉపోద్ఘాతము :**

మగవాడు ధైర్యంగా దిట్టతనంతో ఉండాలి గాని మెతకవాడైతే అప్రతిష్ఠ పాలవుతాడు అంటున్నారు అన్నమయ్య. సహజంగానే స్త్రీలు కలహిస్తుంటారు. మగవాడు వారి తగవు దీర్చి సమాధానపరచాలి. అట్లు చేయకుంటే తరుణులు మెచ్చుకోరట. ఆ గోల వినండి కాకపోతే ఇది నా పరిమిత మతికందినంతవరకే సుమండీ!





**తాత్పర్యము :**

ఓ ప్రభూ! పురుషుడు మెతకవాడయితే (భోళాతనము కలిగివుంటే) చెడ్డపేరు రాదా? అతడు ఇద్దరు స్త్రీల మధ్య వచ్చిన తగవును నేరుపుతో తీర్చే మొనగాడై వుండాలి. లేకుంటే వానిని స్త్రీలు మెచ్చెదరా? మెచ్చరు.

నీ మాటల వలన ఒక ఇంతి నిన్ను కౌగలించినదని గ్రహించి నీ దేవులు (పట్టపుదేవియైన అలమేలుమంగ) కోపగించి కొంగువట్టెను (బలాత్కారముగా ఆమెను నిలదీసినది). నీవేమో చొక్కి (వినోదముతో పరవశించి) చూపెట్టకవున్నావు. (పట్టించుకోకుండా వున్నావు.) నీవు విడిపించి ఆమెనుండి ఈమెను రక్షించవద్దా? నువ్వు ఈపాటివాడవైతే (ఇట్లాంటి వాడవైతే) నిన్ను ఎవ్వరు నమ్ముతారయ్యా?

నీ దేవేరి ఒక సేవసేసే ఆడుదానిని తన పాదములను ఒత్తుతుందిలే అని తనవద్ద పెట్టుకొన్నది. అదీ తన వోవరిలో (పడకటింట్లో) ఆ చెలికత్తెను వుంచుకొన్నది. నేడు ఆపెకు (ఆమెను) నీ వద్దకు పంపమని చెప్పకపోతే ఇక్కడా అక్కడా పొందులు (మీ కలయికలు) యెట్లు జరుగుతాయి ప్రభూ!

నాట్యశాలలో ఒక చిన్నది చిరునవ్వుతో నిన్ను కూడినదిట. అది తెలిసిన జాణ అయిన దేవి అలమేలుమంగ నీవు హద్దుమీరనియ్యక జాగరూకతో గమనిస్తుంటుంది. నీటున (మురిపెముతో) ఓ శ్రీ వేంకటేశ్వరా! నీవే ఆమెను (నీ దేవేరిని) నీ దారికి తెచ్చుకోవలెను. మాటపట్టింపులకు పోయి ఆమెతో బిగదీసుకొంటే మచ్చికలు (అనునయములు) యెట్లు రేచీని(అధికమవుతాయి)?

సంపుటి :18 కీర్తన : చక్కదనాలమించీ నిచ్చట గృష్ణుడు
సంఖ్య : 370 పుట : 248 - రాగం : మాళవి గౌళ

33. చక్కఁదనాల మించీ నిచ్చటఁ గృష్ణుడు
వెక్కసీఁడు గదవమ్మ వెన్నముద్ద కృష్ణుడు ॥పల్లవి॥

గొల్లెతలఁ గొంగువట్టీఁ గోరి కోరి కృష్ణుడు
వెల్లవిరిగా నవ్వీ వేడుకతోఁ గృష్ణుఁడు
వెల్లివలపులు చల్లీ వెన్నముద్దకృష్ణుడు ॥చక్క॥

మంతనములాడుతానే మరిగించీఁ గృష్ణుఁడు
బంతిమోవు లడిగీని బాలకృష్ణుఁడు
దొంతివెట్టి ముద్దులెల్ల దొరకొనీఁ గృష్ణుఁడు
వింతనేర్పులెల్లాఁ జూపీ వెన్నముద్ద కృష్ణుఁడు ॥చక్క॥

బలిమిఁ గాఁగిట నించీ పాయకిదే కృష్ణుఁడు
తిలకించి చూపు చూచీ దిట్టకృష్ణుఁడు
కలసి మన్నించె నిదే కైవసమై కృష్ణుఁడు
వెలసె శ్రీ వేంకటాద్రి వెన్నముద్దకృష్ణుఁడు ॥చక్క॥

**ఉపోద్ఘాతము :**

వెన్నముద్దలంటే వల్ల మాలిన ఇష్టం వున్న బాలకృష్ణుడు, కృష్ణమోహనుడయ్యాడు. గొల్లెతల కొంగులు వదలడు. దొంతివెట్టి ముద్దులు దొరకొంటాడట. బలంగా కౌగలించుకొంటాడట. ఈ చిలిపి కోడెగాడే నేడు శ్రీ వేంకటాద్రి మీద వెన్నముద్ద కృష్ణుడుగా వెలసినాడట. అన్నమయ్య వూహాకందని వాగ్గేయకారుడు.





**తాత్పర్యము :**

ఇచ్చటనున్న ఈ కృష్ణుడు సౌందర్యములో మించిపోయి మనోహరముగా నున్నాడు. వీడి అందము జూచి మోసపోవద్దమ్మా! ఎందుకంటే ఈ వెన్నముద్ద కృష్ణుడు వెక్కసీడు (దుస్సహమైనవాడు).

ఈ కృష్ణుడు గోపకన్నెల కొంగులు పట్టుకొని వేడుకతో వెల్లివిరిగా (విపరీతంగా) నవ్వుతున్నాడు. కోరరాని కోరికలు కోరుతున్నాడు. పల్లదపు మదమున పచ్చిదేరాడు. (యౌవన గర్వముతో ముదిరిపోయినాడీ కృష్ణుడు). నేడు గోపికలపై వెల్లి వలపు (వెల్లివిరిసిన ప్రేమ) వెదజల్లుతున్నాడు ఈ కృష్ణుడు.

ఈ కృష్ణమూర్తి మంతనములాడుతూనే గోపికలను మరిగించీను (మచ్చిక చేసికొంటాడు). ఇతడు బాలకృష్ణుడనుకోకండి బంతిమోవులడిగీని (వరుసలో నిలబెట్టి మరీ అదరములనందుకొంటాడు). గుంపులో నున్నాకూడా ముద్దు పెట్టుకోకుండా వదలడు. ఈ వెన్నముద్ద కృష్ణుడు వింతగొలిపే నేర్పులన్నీ ప్రదర్శిస్తాడు.

ఈ కృష్ణుడు పాయక (వదలక) బలిష్టమైన తన బిగి కౌగిట బంధిస్తాడు. పైగా యేమాత్రమూ సిగ్గు లేకుండా అదే పనిగా కళ్ళల్లో కళ్ళుపెట్టి ఎలావుంది అన్నట్లు చూస్తాడు. నేడు మన సుకృతము వలన మనకు కైవసమై (స్వాధీనమై) మన్నించి ఇదే మనని కూడినాడు. వెన్నముద్దలు తినే ఆ కృష్ణుడే నేడు శ్రీవేంకటాద్రిపై వెలసి యెల్లరను అనుగ్రహించుచున్నాడు.

సంపుటి :18 కీర్తన : చేవదేరె వలపులు చే

సంఖ్య : 371 పుట : 248 - రాగం : మాళవి గౌళ

34. చేవదేరె వలపులు చేతిలోని వీడెము
తేవోయి భూపతిచెర్వుతిరువెంగళప్పఁడా ॥చేవ॥

బీరములాడఁగ నీతోఁ బెనఁగులాడేమా
చేరి నీవు నవ్వఁగానే చెనకేఁ గాక
రారాదా ఇంకనైన రంతులేల మాయింటికి
ధీరుఁడ విన్నిటా నీవు తిరువెంగళప్పఁడా ॥చేవ॥

గుట్టుతోడ నుండఁగాను కొంగువట్టి తీసేమా
జట్టిగొని పెండ్లాడఁగా జరసేఁ గాక
పొట్టఁ బొరుగబ్బె నీకు పొత్తునఁ గూచుండవోయి
దిట్టవౌదు వన్నిటాను తిరువెంగళప్పఁడా ॥చేవ॥

చలపట్టితే నీతో సారె బలిమి సేసేమా
అలరి కాఁగిలించఁగా నలమేఁ గాక
సులభమాయఁగదోయి చొక్కపునాతోడిరతి
తెలిసి(సె?) శ్రీ వేంకటాద్రి తిరువెంగళప్పఁడా ॥చేవ॥

**ఉపోద్ఘాతము :**

భూపతి చెర్వు అనే ప్రదేశమున వెలసిన తిరువేంగళప్ప (శ్రీవేంకటేశ్వరుని)పై శృంగార కీర్తన చెబుతున్నారన్నమయ్య. ఆస్వామి చేతిలో వీడెము (తాంబూలము) పట్టుకొని ఏ ముద్దుగుమ్మకిద్దామా అని యెదురు చూస్తూ వున్నాడు. ఎవరికా భాగ్యం దక్కుతుందో.. మరి.





**తాత్పర్యము :**

భూపతి చెఱువు అనే వూరిలో నెలకొన్న తిరువేంగళప్పా! (శ్రీవేంకటేశ్వరా!) నీ వలపులు చేవదీరినవి (పాకానపడ్డాయి). ఇక వీడెముతేవోయీ (తాంబూలము ఇయ్యవయ్యా!) నీ ప్రవర్తనకు విసిగిపోయాము.

మేము, బీరములాడగ (బింకముతో) నీతో పెనగులాడితే నీవు నవ్వుతావు. వెంటనే మేము చెనకేము (పరవశించి సోలి పోతాము). ఓ తిరువేంగళప్పా! ఇకనైనా నీవు మా వద్దకు రారాదా? నీకు రంతులేల (ఈ విధముగా ఆటపట్టించుట దేనికి?) నేనంటే పిటికిని. నీవు అన్ని విధములా ధీరుడవు. మరి నన్ను కనికరించరాదా? స్వామీ!

యేదో గుట్టుగా మా దారిన మేముంటే, వూరక వుండవు. మా కొంగుబట్టి లాగి. జట్టిగొని (కన్యాశుల్కం చెల్లించి) పెండ్లాడెదనని, జరసేవు (ఉరకలెత్తుతావు). నీకు పొట్ట బొరుగు అబ్బెనయ్యా! (నీకు చేరువగుట జరిగింది.) ఇకనేం, మాతో కలిసిపోయి మాతోబాటు కూర్చొనుమయ్యా! ఓ తిరువేంగళప్పా! నీవు అన్ని విధములా దిట్టయైన వాడివేనయ్యా!

ఓ ప్రభూ! ప్రతిసారీ, నీవు చలపట్టితే (అలిగితే) మేము బలిమిసేసేమా (బలవంతం చేయుదమా?) మేము సంతోషంతో నిన్ను కౌగిలించగానే... అలమే గాక! (అల్లుకుపోవాలి... అంతేగాని బెట్టు పనికిరాదు). నీవు బెట్టు మానేస్తే, నాతో చక్కటి రతిసౌఖ్యం సులభమై, నిన్ను అలరిస్తుంది. శ్రీవేంకటాద్రిపైనున్న తిరువేంగళప్పా! అప్పుడు అందులోని ఆనందం నీకు తెలుస్తుంది.

సంపుటి :18 కీర్తన : సగము మానిసిరూపు సగము మెగము

సంఖ్య : 209 పుట : 140 - రాగం : నాట

**35.** సగము మానిసిరూపు సగము మెగము రూపు
అగణిత ప్రతాపుఁ డహోబలేశుఁడు ॥పల్లవి॥

గద్దెమీఁదఁ గూచున్నాఁడు కంబములోఁ బుట్టినాఁడు
కొద్దిమీరఁ గడునవ్వుకొంటా నున్నాఁడు
వొద్దనె శ్రీ సతిచన్ను లొరయుచు నున్నవాఁడు
అద్దివో చూడరమ్మ అహోబలేశుఁడు ॥సగ॥

పెనుమీసాలవాఁడు పెదపెదగోళ్ళవాఁడు
ఘనునిఁగాఁ బ్రహ్లాదునిఁ గాచుకున్నాఁడు
మనసిచ్చినసురలతో మాటలాడుచున్నవాఁడు
అనుపమతేజుఁడమ్మ అహోబలేశుఁడు ॥సగ॥

వేవేలు చేతులవాఁడు వెన్నెల చాయలవాఁడు
భావించి కొల్చినవారి పాలిటివాఁడు
శ్రీ వేంకటగిరిమీఁదఁ జేరి భవనాశిదండ
నావల నీవల మించె నహోబలేశుఁడు ॥సగ॥

**ఉపోద్ఘాతము :**

అహోబల నృసింహుని కీర్తిస్తున్నారు అన్నమయ్య. మనసిచ్చిన సురలతో అంటే మనస్పూర్తిగా నమ్మిన దేవతలతో మాట్లాడుతున్నాడట. వెన్నెల చాయల వాడంటే తెల్లని శరీరం కలవాడని భావము. ఆవల నీవల మించె... అంటే అక్కడ వేంకటగిరి మీద ఇక్కడ అహోబలగిరిమీద కూడ అధికుడై వున్నాడట ఆ దేవదేవుడు.





**తాత్పర్యము :**

అగణిత ప్రతాపశాలి (లెక్కించుటకు సాధ్యముకానంత ప్రతాపముగల) ఈ అహోబల నృసింహుడు, సగము మనుష్యరూపము సగము మృగము (సింహము) రూపము కలవాడు.

ఈ స్వామి గద్దెపై (సింహాసనముపై) కూర్చొనియున్నాడు. ఈయన స్తంభము నందుండి పుట్టినాడు. అంతులేకుండా పెదవుల అంచులనుండి నవ్వులను కురిపిస్తున్నాడు. తన సమీపముననే యున్న శ్రీదేవి స్తనయుగ్మమును రాపిడికి గురిజేయుచున్నాడు. ఓ సతులారా! అల్లదిగో ఈ అహోబల నృసింహుని వీక్షింపుడమ్మా!

ఈ స్వామి బాగా పెంచిన మీసములు కలిగియున్నాడు. పెద్ద పెద్ద గోళ్ళను కలిగియున్నాడు. తన భక్తుడైన ప్రహ్లాదుని ఘనమైన నరసింగముగా రక్షించినాడు. మనస్పూర్తిగా తనను నమ్మిన దేవతలతో మాటలాడుచున్నవాడీ స్వామి. ఓ అమ్మలారా! ఈ అహోబలేశ్వరుడు సాటిలేని తేజోమూర్తి.

ఈ స్వామికి అనేకములైన చేతులున్నవి. ఈయన వెన్నెల చాయలవాడు. (వెన్నెలవలె తెల్లని దేహఛాయ గలవాడు). తనను భావించి (ధ్యానించి) కొలిచిన వారి పాలిటివాడు (స్వంతమైనవాడు). ఆవల (అక్కడ) శ్రీవేంకటగిరిమీద, ఈవల (ఇక్కడ) భవనాశి దండ (భవనాశి నదీతీరమున) యున్న అహోబలమున ఈ స్వామియే మించె (మిన్నయై యున్నాడు).

సంపుటి :18 కీర్తన : ఓరుపే నేరుపందురు వువిదలకు
సంఖ్య : 469 పుట : 314 - రాగం : నారాయణి

36. ఓరుపే నేరుపందురు వువిదలకు
తారుకాణించేఁ గాన తడవకురే ॥పల్లవి॥

మొగము చూచినాఁడు ముచ్చటాడక మానీనా
నగినవాఁ డిందురాక నాలిసేసీనా
మగువలాల మనమనసు చూచీ నతఁడు
వెగటుగా మీ రింక వెంగెములాడకురే ॥ఓరు॥

చేసన్న చేసినవాఁడు చెప్పకుండీనా ప్రియము
ఆసకొనినవాఁడు ఆదరించఁడా
యీసులేలే చెలులాల యేఁటికో వున్నాఁడతఁడు
రాసికెక్కించి మీరిఁక రాఁపులు సేయకురే ॥ఓరు॥

చేయిచాఁచినవాఁడు సేస చల్లక లోఁగీనా
కాయము ముట్టినవాఁడు కళరేచఁడా
యీయెడ శ్రీవేంకటేశుఁ డేలె నన్ను నింతలోనె
చాయల సన్నల నింక సాదించకురే ॥ఓరు॥

**ఉపోద్ఘాతము :**

తాను కూడా స్వామికోసం తపించే ఒక విరహిణియై తనతోటి తరుణులతో హితవు చెబుతున్నారు అన్నమయ్య. నిఘంటువులను అవపోసనపట్టినా కొన్ని అన్నమయ్య పదాలకు అర్థం సందర్భాన్ని బట్టి చెప్పుకోవలసివస్తుంది. చాయల సన్నల నింక సాధించకురే... అంటే రేయింబవళ్ళు నన్ను దెప్పిపొడవకండే, అని అర్థం.



ఏలుకో శృంగార రాయ

**తాత్పర్యము :**

ఓ భామలారా! ఓర్పులోనే నేర్పువున్నదనే సామెత మీరు వినలేదా? ఏనాడో పెద్దలీమాట తారుకాణించారు (నిరూపించారు). గాన మీరు తడవకురే (విచారించుట మానండి).

ఓ మగువలాలా! మన మనస్సునెరిగిన ఆ రమణుని గురించి, వెంగెములాడకురే (ఎకసెక్కెములాడకండి). ఓర్పు వహించండి.. ఆయన జగన్నాథుడు. ఆయన కోసం నిరీక్షిస్తూ విచారగ్రస్తమైన మన మొగము చూచినవాడు, ఎందుకిలా వున్నావని ముచ్చటలాడడా? అప్పుడు మనల్ని చూచి కాస్త నవ్వడా? నవ్వినవాడు మన దగ్గరకు రాకపోతాడా? నాలిసేసీనా? (వంచిస్తాడా?) ఆయనకు మనమనస్సు తెలీదా?

ఓ చెలులాలా! ఈసులేల? (అసూయ యెందుకే?) అదిగో చూచినారా యెలా చేసన్నలు (చేతితో సైగలు) చేస్తున్నాడో!! అట్లా సైగలు చేసేవాడు యేదోమాట చెప్పకుండా వుంటాడా? మనపై ప్రియము ఆసకొనినవాడు (ప్రేమతో ఆశపడ్డవాడు) ఆదరించకుండా వుంటాడా? ఏటికోవున్నాడు (ఎందుకో ఆమెవద్దవున్నాడు) మీరు ఇంకా ఆయనను రాసికెక్కించి (బయటపెట్టి) రావులు సేయకురే (రాద్ధాంతం చేయకండమ్మా!)

ఓ వనితలారా! చేయిచాచినవాడు (సిద్ధపడినవాడు) సేసచల్లకలోగీనా (అక్షింతలు చల్లకుండా వుంటాడా?) ఒక్కసారి ఒంటిమీద చేయివేసినవాడు, కళలు రేచడా (మన్మథావస్థలకు గురిచేయక వదిలిపెడతాడా? ఈ సారి అదృష్టం నన్ను వరించింది. ఆ శ్రీవేంకటేశుడు నన్ను యేలినాడు. ఇంతలోనే మీకెందుకే అసూయ? చాయల సన్నలనింక సాధించకురే (రేయింబవళ్ళు అస్తమానమూ నన్ను సాధించకండే...)

సంపుటి :18 కీర్తన : వీధుల నెల్లాతానే గోవిందరాజు
సంఖ్య : 331 పుట : 222 - రాగం :

37. వీదులనెల్లాఁ దానే గోవిందరాజు
ఆదిగొని సేసచల్లీ నదె గోవిందరాజు ॥పల్లవి॥

చెక్కుటద్దము లిద్దరు చెలులకుఁ జూపుతాను
వెక్కసమై మెరసీ గోవిందరాజు
చిక్కని వెన్ను తేట సెలవులఁ జిందుతాను
అక్కరతో మాఁటలాడీ నదె గోవిందరాజు ॥వీదు॥

కదిసి చను మొనలఁ గాయమొరసుకుంటాను
వెదచల్లీ వలపు గోవిందరాజు
వదనాంబుజము మోవివాసనలు చూపుతాను
అదిమీఁ దొడలు చేత నదె గోవిందరాజు ॥వీదు॥

పరిమళములు చూచి పడఁతుల తురుములు
విరుల వేసీని గోవిందరాజు
సురతమర్మములెల్లాఁ జూపి కాఁగిళ్ళనుఁ గూడీ-
నరుదై శ్రీ వేంకటాద్రి నదె గోవిందరాజు ॥వీదు॥

**ఉపోద్ఘాతము :**

తిరుపతిలో వూరేగింపుగా పోతున్న శ్రీ గోవిందరాజస్వామిపై అన్నమయ్య చెబుతున్న చక్కని కీర్తన. తన సతులైన శ్రీదేవి భూదేవిలకు తన కౌగిళ్ళలో సురతి మర్మములెల్ల నేర్పాడట ఈ శృంగార రాయడు. తన పడతుల కొప్పులలోని పూమాలల పరిమళమును ఆఘ్రాణిస్తున్నాడట ఈ గోవిందరాజు.





**తాత్పర్యము :**

తిరుపతిలోని ఈ తిరువీధులన్నింటిలోను తానే అయ్యాడు ఈ గోవిందరాజు. ఆదిగొని (కన్నువేసి) తన భామలపై ఆయన సేసచల్లీ (అక్షింతలు చల్లుచున్నాడు). అదిగో చూచి తరించండి.

తన ఇద్దరు సఖియలకు (భూదేవి శ్రీదేవి) ఆయన తన చెక్కుటద్దములను (అద్దముల వలె మెరయుచున్న చెక్కిళ్ళను) చూపుతూ, వెక్కసమై (అధికముగా) మెరిసిపోతున్నాడు. దట్టమైన వెన్నెల వంటి స్వచ్ఛమైన నవ్వులను చిందిస్తున్నాడీ గోవిందరాజు. అక్కరతో (అత్యవసరమైనట్లు) అదే తన సతులతో మాట్లాడుతున్నాడు.

కదిసి (చేరువయై) తన భామల కుచాగ్రములు గుచ్చుకొనునట్లు ఒరసుకొంటూ కూర్చొని వారిపై వలపులు వెదచల్లుచున్నాడు. పద్మము వంటి తన వదనము దగ్గరకు చేర్చి పరిమళ భరితమైన తన పెదవుల వాసన వారికి చూపుచూ తన తొడలతో వారిని అదుముచున్నాడు. అదిగో ఈ గోవిందరాజు ఎంతటి రసికుడో చూడండి.

ఈ గోవిందరాజు తన పడతుల (భార్యల) కొప్పులలోని విరుల పరిమళములనాఘ్రాణించి వారిపై కొన్ని పూవులను చల్లినాడు. తన కౌగిళ్ళలోవారికి సురతమర్మములను చూపి వారిని గవయుచున్నాడు. అరుదైన ఈ దేవదేవుడే శ్రీ వేంకటాద్రిపైననూ చేరి జగములనేలుచున్నాడు.

సంపుటి :18 కీర్తన : ఏమని చెప్పదునే వీడెమ్మెకాడు.

సంఖ్య : 105 పుట : 71 - రాగం : హిందోళ వసంతం

38. ఏమని చెప్పుదునే వీఁడెమ్మెఁకాఁడు
చేముట్టి వేఁడుకొనీనే చెలిమికాఁడు ॥పల్లవి॥

చలపాదిసరసాలజాజరకాఁడు
వలపులు చల్లీఁ బెక్కువలపుకాఁడు
తలఁపించీఁ దనపొందు దాయగాఁడు
వెలయించీ నన్ను నింత వేడుకకాఁడు ॥ఏమ॥

బచ్చనపరాకులపంతగాఁడు
కొచ్చి కొచ్చి చెనకీని కోడెకాఁడు
అచ్చుగా నాసరులంటీ నాసోదకాఁడు
యిచ్చటనే కాచుకునాఁ డెలయింపుకాఁడు ॥ఏమని॥

వద్దనుండే యెలయించీ వన్నెకాఁడు
అద్దుకొనీఁ గాఁగిట నందగాఁడు
వొద్దికై శ్రీవేంకటేశుఁ డుబ్బరికాఁడు
పెద్దరికపులాబాలబేరగాఁడు ॥ఏమ॥

**ఉపోద్ఘాతము :**

నాయిక తన చెలికత్తెతో చెబుతున్నది. ఏమని చెప్పమంటావే? వీడు యెమ్మెకాడు. ఈ చెలిమికాడు చేముట్టి వేడుకొనీనే. వీడు వలపుకాడు, దాయగాడు, వేడుక కాడు,పంతగాడు, కోడెగాడు, ఆసోదికాడు, యెలయింపుకాడు, వన్నెకాడు, అందగాడు, ఉబ్బరికాడు, పెద్దరికపు లాబాల బేరగాడు– అంటున్నారు అన్నమయ్య. ఎవరిని? శ్రీవేంకటేశ్వరుని. అంటే ఏమిటో తెలియాలంటే నిఘంటువులు వెతకవలసిందే.





**తాత్పర్యము :**

ఓ సఖీ! నన్నేమి చెప్పమంటావే. ఈ నా స్వామి ఉన్నాడే... ఆయన గొప్ప యెమ్మెకాడు (విలాసవంతుడు), నా చెలిమికాడు (సఖుడు) చేముట్టి (నాకు వినయంగా నమస్కరించి) వేడకొనీనే (బ్రతిమిలాడుకొంటాడే).

ఈయన గురించి యేమి చెప్పమంటావే? ఈయన, చలపాది సరసాల జాజరకాడు (అనేకములైన ప్రేమ వ్యవహారాలు నడుపుతున్నాడు). ఈ దాయగాడు (దుర్మార్గుడైన శత్రువు) విరామం లేకుండా తనతోనా మధురానుభావాలనే తలపింపజేయుచున్నాడు. ఈ వేడుకగాడు నన్ను ఇంత వెలయించీ (ఇంతగా ప్రసన్నురాలిని చేశాడు).

ఈయన, బచ్చన పరాకుల పంతగాడు (పైకొన్న ఆశతో పట్టుదల గలవాడు). ఈ కోడెగాడు (పురకలు వేసే వయస్సుగల యువకుడు) నన్ను కొచ్చికొచ్చి చెనకీని (గోళ్ళతో గిచ్చి గిచ్చి పెడతాడు). ఈయన అచ్చుగా నా సరులంటే ఆ సోదిగాడు (స్వతంత్రంగా నా కొప్పుపై చేయి వేయగల అసాధ్యుడు). ఈ యెలయింపుకాడు (సరసుడు) నా కోసం ఇక్కడే కాచుకొని యుంటాడు.

ఈ వన్నెకాడు (వగలమారివాడు). నన్ను సమీపించి మరీ చేరువయైనాడు. ఆ అందగాడు నన్ను హత్తుకొని కౌగిలించుకొనినాడు. ఈ శ్రీ వేంకటేశ్వరుడు ఉబ్బరికాడు (అతిశయించినవాడు). ఈయన ఒద్దికయై (అనుకూలుడై) యున్నాడు. ఈ బేరగాడు (చేసికొన్న వారికి చేసికొన్నంత ఫలమును మాత్రమే ప్రసాదించే ఆసామి) పెద్దరికపు లాబాలవాడు. అంటే సన్మార్గులకు మంచి, దుర్మార్గులకు చెడునిచ్చేవాడు. కాని ఎవరికేది, యెంత, యెందుకు, యెప్పుడిస్తాడో తెలియనివ్వని గొప్ప వ్యాపారవేత్త.

సంపుటి :18 కీర్తన : వెరగయ్యీ నీచేఁతకువిట్ఠలేశ్వరా
సంఖ్య : 216 పుట : 145 - రాగం : శంకరాభరణం

39. వెరగయ్యీ నీచేఁతకు విట్ఠలేశ్వరా
విరులు చల్లే వప్పటి విట్ఠలేశ్వరా ॥పల్లవి॥

వేడుక కాఁడవు నీవు విట్ఠలేశ్వరా మాకు
వీడె మియ్యఁగదవోయి విట్ఠలేశ్వరా
వీడవు మనపొందులు విట్ఠలేశ్వరా
వీడుదోడాడీ వలపు విట్ఠలేశ్వరా ॥వెర॥

వెన్న దిన్న నోరితోడి విట్ఠలేశ్వరా
వెన్నెల నవ్వు నవ్వేవు విట్ఠలేశ్వరా
వెన్నుఁడ నీకు మొక్కేము విట్ఠలేశ్వరా మా -
విన్నపము లాలించు విట్ఠలేశ్వరా ॥వెర॥

విచ్చేయు మా యింటికి విట్ఠలేశ్వరా యెంత
విచ్చి చెప్పేవు కతలు విట్ఠలేశ్వరా
కుచ్చి శ్రీ వేంకటాద్రిపైఁ గూడితివి నన్ను
విచ్చనవిడాయ నిఁక విట్ఠలేశ్వరా ॥వెర॥

**ఉపోద్ఘాతము :**

విట్ఠల దేవునిపై సరసశృంగార కీర్తన వినిపిస్తున్నారు అన్నమయ్య. నీవు చేసే చిలిపిపనులు భయం పుట్టిస్తున్నాయంటున్నారు. నేటి తెలుగు నుడికారానికి అన్నమయ్య కాలం నాటి తెలుగు నుడికారానికి గల బేధము వల్ల కొన్ని మాటలకి నిఘంటువులో కూడా అర్థము తెలియదు. ఉదాహరణకి ఈ కీర్తనలోని





"విచ్చనవిడాయ" అనే మాటకి అర్థం యొక్కడా దొరకదు. అది "విచ్చల విడి ఆయె" అని భావించగలిగితేనే సాధ్యం.

**తాత్పర్యము :**

ఓ విట్ఠలదేవా! నీ చేతకు (నీవు చేసే పనులకు) వెరగయ్యీ (భయము కలుగుతున్నది). నీవు అప్పటి (మరల మరల) విరులు చల్లేవు (పూవులను చల్లుతున్నావు).

ఓ విట్ఠలేశ్వరా! నీవు గొప్ప సరదా యున్న విలాస పురుషుడవు. నాకు వీడెము తాంబూలము ఈయవయ్యా! నీవు మా పొందును యేనాటికీ విడనాడవు. నీ వలపు "వీడుదో(జో) డాడీ" నయ్యా! (సరియైనది కాదయ్యా!) ఎందుకంటే నీవు ఎవరిని, ఎప్పుడు, ఎందుకు, ఎక్కడ, ఎలా అనుగ్రహిస్తావో తెలియదు.

ఓ విట్ఠలేశ్వరా! వెన్నదిన్న ఆనోటితోనే వెన్నెల వంటి నవ్వులు చిందిస్తావు. నీవు వెన్నుడవు, దేవదేవుడవు. నీకు వినమ్రులమై మ్రొక్కెదమయ్యా! ఓ విట్ఠలదేవా! మా విన్నపముల నాలకించుము స్వామీ!

ఓ విట్ఠల దేవా! మా ఇంటికి విచ్చేయవయ్యా! నీ శృంగారలీలలను అడిగినతోడనే పూసగుచ్చినట్లు విచ్చి చెప్పేవు (విప్పిచెబుతావు కదా!) ఈ శ్రీవేంకటాద్రిపై నన్ను కుచ్చి కూడితివి (బిగి కౌగిలించి నన్ను కూడితివి). ఇది నీ నెలవు. నిన్ను అడ్డువారెవరు? నీకు "విచ్చనవిడాయ" (విచ్చల విడి అయిపోయింది). నీవు ఆడింది ఆట పాడింది పాట అయింది స్వామీ!

సంపుటి :18 కీర్తన : బలవంతుడీతని బంట్లమై బ్రతుకుదుము
సంఖ్య : 302 పుట : 202 - రాగం : రామక్రియ

**40.** బలవంతుడీతని బంట్లమై బ్రతుకుదుము
కిల కిల నవ్వీ సుగ్రీవ నరసింహుడు ॥బల॥

దేవదేవుఁ డితఁడు తేజోరాశి యితఁడు
భావించ నలవిగాని బ్రహ్మ మీతఁడు
శ్రీవల్లభుఁ డితఁడు జీవరక్షకుఁ డితఁడు
కేవలమయినసుగ్రీవ నరసింహుఁడు ॥బల॥

పరమాత్ముఁ డితఁడు భయహరుఁ డితఁడు
నిరుపమగుణముల నిత్యుఁ డితఁడు
వరదుఁ డితఁడు సర్వవంద్యుఁడు నీతఁడు
గిరి గుహలోని సుగ్రీవ నరసింహుఁడు ॥బల॥

కాలరూపుఁ డితఁడు కరుణానిధి ఇతఁడు
మేలిమి జగత్తులకు మేఁటి యీతఁడు
మూలమై శ్రీ వేంకటశైల నిలయుఁడితఁడు
కీలక మిన్నిటికి సుగ్రీవ నరసింహుడు ॥బల॥

**ఉపోద్ఘాతము :**

సుగ్రీవ నరసింహుని స్తుతిస్తున్నారు అన్నమయ్య. చక్కటి మెడ (కంఠము) గల నృసింహుడీస్వామి. గొప్ప బలవంతుడు. అంత భయంకరంగా హిరణ్యకశిపుని చంపిన స్వామి కూడా శ్రీ దేవిని చూచి కిలకిలమని నవ్వుతున్నాడట. ఈ కీర్తనలో “లరూపుడితడు” అని ముద్రితమయ్యింది. బహుశా అది రాగి రేకుల వ్రాయసకాంద్ర





లోపము అయివుండవచ్చును. ప్రాసననుసరించి నా ఊహకి అది “కాలరూపుడు” అనిపించింది. ఏది ఏమయినా మనం ఈయన బంట్లమై (భృత్యులమై) బ్రతుకుదాం.

**తాత్పర్యము :**

ఈ నరసింహుడు, చక్కని కంఠముగల స్వామి. గొప్ప బలవంతుడైన ఈతని భృత్యులమై జీవించెదముగాక! తన తొడపై శ్రీదేవుండినందున కాబోలు ఈయన కిలకిల నవ్వుతున్నాడు.

ఈయన దేవదేవుడు. గొప్పతేజస్సు రాశీభూతమైనవాడు. ఊహించుటకు సాధ్యముకాని పరబ్రహ్మస్వరూపుడు. శ్రీపతియైన ఈయన సర్వజీవరక్షకుడు. ఈ సుగ్రీవనరసింహుడు కేవలమయిన వాడు (పరమాత్మ).

ఈ నృసింహుడు భయమును నివారించు పరమాత్మ స్వరూపుడు. సాటిలేని గుణ గణములు కలిగినవాడు. నిత్యుడు (సృష్టికి ఆదిలోనే గాక అంత్యము నందుకూడా వుండే జగద్రక్షకుడు. కోరుకున్న వరములననుగ్రహించువాడితడే. ఈయన సర్వవంద్యుడు (జీవులందరిచే కీర్తింపబడువాడు). ఈ సుగ్రీవ నరసింహుడు తన నివాసము కొండగుహలలో చేసికొనియున్నాడు.

ఈయన కాలస్వరూపుడు, కరుణాంతరంగుడు. మేలిమి జగత్తులకు (ఉత్కృష్టమైన లోకములకు) ఈయన మేటి (అధిపతి). ఈయనే మూలము అయిన శ్రీవేంకటాద్రినాథుడు. ఇన్నిటికీ (సృష్టి స్థితి లయలకు) కీలకము (కారణము). అంతేకాదు కీలకము అంటే పశువులను కట్టివేసే గుంజ (స్తంభం) అనికూడా అర్ధమున్నది. మనం పశువులమే కదా! ఈ స్వామికి కట్టబడినంతవరకు క్షేమమే. లేకపోతే... అంతే సంగతులు.

సంపుటి :18 కీర్తన : కోడెకాడు వీడుగదె గోవిందరాజు
సంఖ్య : 479 పుట : 320 - రాగం : సాళంగనాట

**41.** **కోడెకాఁడు వీఁడుగదె గోవిందరాజు**
**జోడైన సకులుఁదాను చొక్కుచున్నాఁడు**

**పరగఁగ మేలుకొని పవ్వళించి వున్నవాఁడు**
**తరుణుల రతులెల్లాఁదలపోయుచున్నాఁడు** ॥కోడె॥

**చెప్పరాని సిరులతో సింగారించుకున్నాఁడు**
**వుప్పతిల్లుఁదమకాన నుబ్బుచున్నాఁడు**
**కుప్పెఁడుజవ్వాది మేనఁగుప్పళించుకున్నవాఁడు**
**అప్పసము సరసములాడుచున్నాఁడు** ॥కోడె॥

**సారె సారె వలపులు చల్లుకొంటానున్నవాఁడు**
**వూరడించందరిఁగలయుచున్నాఁడు**
**యీరీతి శ్రీ వేంకటాద్రి నిరవై తిరుపతిలో**
**కూరిములు నెరుపుచు కొలువున్నాఁడు** ॥కోడె॥

**ఉపోద్ఘాతము :**

తిరుపతిలో నెలకొన్న గోవిందరాజ స్వామిపై సరస శృంగార కీర్తన చెబుతున్నారు అన్నమయ్య. కోడెగాడు అంటే విటుడు అని అర్థం. ఇక్కడ శృంగారరాయుడు అని చెప్పుకోవచ్చు. ఈ గోవిందరాజు కోడెకాడు అంటున్నారు. తన జంటయైన ఇద్దరు సకులతో (సఖియలైన శ్రీదేవి భూదేవులతో) పరవశముననున్నాడు అంటున్నారు.





**తాత్పర్యము :**

ఈ గోవిందరాజ స్వామి కోడెకాడు (విటుడు లేక శృంగారరాయడు) కదటే.. ఇటు చూడండి జోడైన సకులతో (ఇద్దరు జంటగావున్న సఖియలతో) తాను చొక్కుచున్నాడు. (పరవశముతోనున్నాడు).

ఈయన పవ్వళించియున్నా మేలుకొని జరిగేదంతా గమనిస్తూనే వున్నాడు. సొదిరి దేవుళ్ళకు వరుసగా తనను సేవించే దేవేరులకు) తన పాదముల చెంత చోటిచ్చినాడు. ఇప్పుడు ఆయన దేని కోసం యెదురు చూచుచున్నాడో తెలిసిందా, మోవి విందులకోసం (తన భార్యల అధరామృతం కోసం). మరి అంత పరవశమెందుకంటే... వారితో రతులను తలపోయుచున్నాడు కదా!

ఆయన సింగారించుకొన్న విధము వర్ణనాతీతము. ఆయన ఉప్పతిల్లు తమకాన (ఓర్వలేని మైమరపుతో) ఉబ్బుచున్నాడు (సంతోషముగా వున్నాడు). ఆయన కుప్పెడు జవ్వాదిని (గుప్పెళ్ళతో జవ్వాదిని) తన శరీరంపై గుప్పళించుకొన్నాడు. (కుమ్మరించుకొనినాడు). ఆయన అప్పసము (ఎప్పుడూ వారితో సరసములాడుతూనే వుంటాడు.

ఆయన మాటిమాటికీ వలపులు వెదచల్లుతూనే ఉంటాడు. అందరినీ (తనను కోరిన వారిని) వూరడించి దరిజేర్చుకొంటాడు. ఈ విధముగా తిరుపతి పట్టణములోని శ్రీ వేంకటాద్రిన్ ఇరవై (వేంకటగిరి స్థానమై) కూరిముల నెరపుచు (అనురాగము ప్రదర్శిస్తూ) కొలువుదీరియున్నాడు). ఈ మహానుభావుని సేవించి తరించండి.

సంపుటి :18 కీర్తన : ఇందాఁకా సరివచ్చె నింపులెల్లాలను
సంఖ్య : 478 పుట : 320 - రాగం : భవుళి

42. ఇందాఁకా సరివచ్చె నింపులెల్లాను
కందువు నీజాడ లిఁకఁ గనుఁగొనేఁగాని ॥పల్లవి॥

నెమ్మిఁ బెండ్లాడినదాఁకా నీచేయి మీఁదైన దాఁకా
నమ్మిక లిచ్చితి విట్టె నాకు నీవు
దొమ్మి సతులు గూడిరి దొరతనమెక్కె నేఁడు
యెమ్మెల నీతలపోఁత లీడ నెట్టోకాని ॥ఇందాఁ॥

చివ్వనఁ గరఁగుదాఁకా సిగ్గులు వీడినదాఁకా
నవ్వులు నవ్వితివిగా నాతో నీవు
జవ్వనము నాకు నిండె జాణఁడవైతి విపుడు
ఇవ్వల నీపొందులెట్లా నీడేరీనో కాని ॥ఇందాఁ॥

కళలు రేఁగినదాఁకా కైవసమైనదాఁకా
నలుగడఁ గూడితివి నన్ను నీవు
అలమేలుమంగను నీవదె శ్రీ వేంకటేశుఁడ
విల నీరతు లేరీతి హెచ్చీనో కాని ॥ఇందాఁ॥

**ఉపోద్ఘాతము :**

"ఓ శ్రీ వేంకటేశ్వరాఁ ఇప్పటిదాకా నీ ఇంపులు (ఇష్టము) సరివచ్చె (బాగానే వున్నది) కానీ ఇప్పుడు పెండ్లాన్నయిపోయాను. ఇప్పుడు నీ అసలు ప్రేమేమిటో తెలుస్తుంది." అని అమ్మవారు దెప్పి పొడుస్తున్నది. ఇప్పుడె చూడాలి నీరతు లేరీతి హెచ్చీనోకాని... అంటున్నది. అన్నమయ్య సాటి అన్నమయ్యే, ఇంకలేనేలేరు.





**తాత్పర్యము :**

ఓ ప్రభూ! ఇప్పటిదాకా నీ ఇంపులు (ప్రేమలు) సరివచ్చె బాగానే వున్నాయి. ఇప్పుడు నీ జాడలు నాకు ఆనాటివలె కానవచ్చుటలేదు. (నీవు మారిపోయావు)

నన్ను నెమ్మి (నెమ్మదిగా) పెండ్లాడినదాకా, నీచేయి పైచెయ్యి అయ్యేదాకా నాకు ఇట్టే (తేలికగా) నమ్మించితివి. మరి ఇప్పుడు చూడు. దొమ్మి సతులు గూడిరి (దురుసుగా ప్రవర్తించే సవతులను) నాకు అంటగట్టావు.నేడు నీకు దొరతనమెక్కె (జగన్నాథుడ వయ్యావు). నీ ఎమ్మెలతలపోతలు (నీగురించిన మధురమైన ఆలోచనలు) ఇక్కడ నన్ను ఎట్టెట్లో వేధిస్తున్నవి.

చివ్వ(వ్వు)న (తొందరగా) కరిగిపోయేలా చేస్తావు. నా అంతట నేనే సిగ్గులను విడనాడేదాకా చేస్తావు. నాతో నవ్వుతూ గడుపుతావు. నాకు యవ్వనం పరిమళించే సమయంలో ఇప్పుడు జాణడ (నేర్పరి) వైతివి. ఇకపై నీ చెలిమి యెట్లా ఈడేరుతుంది స్వామీ!

ఓ ప్రభూ! నాలో కళలన్నీ వికాసమైనదాకా అలరింతువు. నన్ను కైవసమొనర్చుకొని అన్ని వైపులనుంచి కూడితివి. నేను అలమేలుమంగను. ఓ శ్రీవేంకటేశ్వరా నీ రతి లీలలు ఏవిధముగా విజృంభించుచున్నవో కాని నేను విడమరచి చెప్పలేకున్నాను, ప్రభూ!

సంపుటి :18 కీర్తన : చిత్తగించి చూడవయ్య
సంఖ్య : 30 పుట : 21 - రాగం : రామక్రియ

**43.** చిత్తగించి చూడవయ్య సిగ్గువడ నీకేఁటికి
బత్తిసేసీ నాకె నీపై భావించవయ్యా ॥పల్లవి॥

సెలవుల నవ్వుతాను చేరి మాఁటలాడుతాను
పలువరుసలు చూపీఁ బడఁతి నీకు
నిలుగునివ్వెరగుతో నిండు సింగారములెల్లాఁ
బలుమారు నీ ముందరఁ బచరించీని ॥చిత్త॥

కొప్పు చక్కఁబెట్టుకొంటా కొలువులు సేసుకుంటా
నెప్పునఁ జన్నుల నొత్తీ నెలఁత నిన్ను
వుప్పతిల్లుఁగళలతో నుడివోనిజవ్వనాన
కుప్పళించి వలపులు గురిసీ నీయెదుట ॥చిత్త॥

సరులు దిద్దుకొనుచు చవులెల్లా మోవిఁ జూపి
మరిగించీ నలమేలుమంగ నిన్నును
ఇరవై శ్రీ వేంకటేశ యిటు నన్ను నేలితివి
వురముపై నుండి యాపె వుబ్బించీ నీమనసు ॥చిత్త॥

**ఉపోద్ఘాతము :**

స్వామి సిగ్గులొలకబోస్తున్నట్లు భావిస్తున్నారు అన్నమయ్య ఎందుకయ్యా సిగ్గుపడతావు? ఆమె(అలమేలుమంగ) భక్తితో నిన్ను తనభావనలలో నిలుపుకొన్నది. ఆమె వలపులను చిత్తగించవయ్యా! అంటున్నారు. సరసశృంగారం పెల్లుబికే కీర్తన అవటం చేత తాత్పర్యంలో గాని అన్నమయ్య నేర్పు తెలిసే అవకాశం లేదు. వలపులలో స్వామిని మరగిస్తుందట అమ్మవారు.





**తాత్పర్యము :**

ఓ ప్రభూ! అలమేల్మంగమ్మకు నీపై యెనలేని బత్తి (భక్తి). నీపై ఆకె (ఆమె) ఆ భక్తిచేత నిన్ను సేవిస్తున్నది. నిన్ను వలచినది. ఆమెను చిత్తగించి (మన్నించి) ఒకసారి చూడవయ్యా! నీవెందుకు సిగ్గుపడతావు? ఆమె భావజాలమును అర్థము చేసికొనవయ్యా!

ఆ పడతి చక్కటి మందహాసముతో తన పలువరుసలు (దంతములు) చూపించేవిధంగా మాట్లాడుతున్నది. నిన్ను ఒక్కసారిగా చూచి ఆమె నిలుగునివ్వెరగుతో (నిలువునా కలిగిన తత్తరపాటు)తో కనిపిస్తోంది. తన నిండు సింగారింపులు అనేకమార్లు నీ ముందర పచరించీని (ప్రదర్శించుచున్నది).

ఆమె చేయుచున్న శృంగారకళలను ఒకసారి చూడవయ్యా! తన కొప్పును చక్కబెట్టుకొంటున్నది. నీకు సేవలు చేసికొనే వేళ్ళ ఆ నెలత (దేవి) నెప్పున జన్నులనొత్తీ (నేర్పుతో కుచములను తాకించుచున్నది). ఉప్పతిల్లుకళలతో (ద్యోతకమగు కళలతో) ఉడివోని జవ్వనాన (తొలగని యౌవనము) నీ యెదుట కుప్పళించి వలపులు కురిసీ (అంతులేని వలపు చేష్టలను ప్రదర్శించుచున్నది).

ఆమె తన నగలను సవరించుకొంటున్నది. తేనెలూరు తన అదరమును చూపి నిన్ను మరిగించీని (ఆశపడునట్లు చేయుచున్నది). అట్టి అలమేల్మంగతో ఇరవై (నెలకొని) ఓ శ్రీ వేంకటేశ్వరా! ఇటునన్ను యేలితివి (అనుగ్రహించితివి). నీ వక్షస్థలమును నివాసము చేసి కొనిన ఆమె నీ మనస్సును వుబ్బించీ (ఆనందంతో వుప్పొంగునట్లు చేయుచున్నది).

సంపుటి :18　　　కీర్తన : సిగ్గుతోడ గొంకితేను చిక్కునా
సంఖ్య : 161　　　పుట : 108 - రాగం : సాళంగనాట

44. సిగ్గుతోడ గొంకితేను చిక్కునా మగవాఁడు
బిగ్గెఁ గాఁగిలించుకొని పెనఁగినఁగాక ॥పల్లవి॥

పెదవి పై మాటలఁ బ్రియములు వుట్టునా
వుదుటుగుబ్బలఁ బతి నూఁదినఁగాక
సదరపుఁజెనకుల చవులు వుట్టీనా
సదమదముగ రతి సలిపినఁగాక ॥సిగ్గు॥

సెలవుల నవ్వితేనే చిత్తము గరఁగునా
సొలయుచు మోవిచవి చూపినఁగాక
ములువాఁడి చూపుల మోహములు వుట్టునా
లలిఁ దమ్ములము పొత్తు గలసినఁగాక ॥సిగ్గు॥

సరసములాడితేనే సంగాతా లెనయునా
సరుసఁ దనువు లొక్కజ (జం?) టైనఁగాక
యిరవై శ్రీ వేంకటేశుఁ డింతలోనె నిన్నుఁ గూడె
పరపుపైనే చాలునా వురమెక్కినఁగాక ॥సిగ్గు॥

**ఉపోద్ఘాతము :**

సిగ్గు, బిడియము, జంకు స్త్రీకి సహజ స్వభావాలు. తొలిరోజుల్లో భర్తవద్ద సిగ్గుతో గొంకుట (సంకోచించుట) సతులకు స్వాభావికమే. కాని అలా వుంటే, మగవాడు చిక్కునా? అని అమ్మవారికి సలహా ఇస్తున్నారు అన్నమయ్య. మరి





ఎలావుంటే చిక్కునో ఈ కీర్తనలో చెబుతున్నారు. పరపుపైనే (పురుపుమీద మాత్రమే) ఆయన్ని లొంగదీసికొంటే చాలదమ్మా! ఆయన వురమెక్కినగాక (హృదయంపై తిష్టవేసికొంటే) గాని నీ లక్ష్యం నెరవేరదు అని చెబుతున్నారు.

**తాత్పర్యము :**

ఓ దేవీ! సిగ్గుతో గొంకితేను (సంకోచిస్తే) మగవాడు చిక్కునా (స్వాధీనమవుతాడా?) పెనగులాడాలి. అప్పుడు కాని ఆయన నీకు లొంగడు.

దేవీ! ఊరకనే పెదవులు కదల్చి ఆయనతో మాటలాడినంత మాత్రాన ప్రియములు పుట్టునా (ప్రేమ పుడుతుందటమ్మా!) పొంగిన ఉరోజములను, ఆయనకు ఊదిన (అదిమిన), చవులుపుట్టీనా (కోరిక కలుగుతాయా?) నలిగిపోవునట్లు రమించవలెగాక!

అమ్మా! పెదవుల చివరినుంచి నవ్వినంతమాత్రాన స్వామి మనసు కరగిపోతుందటమ్మా!? పరవశించిపోతూ మధురాధరము నందించవలెను. గుచ్చుకొనేవాడి చూపులతో ఆయన కేసి చూసినంతమాత్రాన నీకు ఒరిగేదేముంది? లలిన్ (ఉత్సాహముతో) తమ్ములము పొత్తు గలసినగాక! (ఒకరినోటిలోని తాంబూలమింకొకరు ఆస్వాదించాలి). అట్లుగాక వుత్తి కౌగిలింతలతో నీ పని సానుకూలపడదు.

ఓ అలివేణీ! చలోక్తులాడినంతమాత్రాన సంగాతములు (చెలిమి) యెనయునా? (పుడుతుందా?) దగ్గరజేరి తనువులొకేజంటగా అయిపోవాలి. ఇన్ని చేస్తే ఆ వేంకటేశుడు నిన్నుకూడి పరవశింపజేస్తాడు. పరపుపైనే చాలునా ప్రక్కమీద ఆయనను లొంగదీసికొనినంత మాత్రాన చాలదమ్మా!) ఆయన గుండెలపై నెక్కి తిష్టవేసికోవాలి. అప్పుడు కాని నీ లక్ష్యం నెరవేరదు తల్లీ!

సంపుటి :18　　　　　కీర్తన : ఏల ఆటదానికి యెమ్మెలింతేసి
సంఖ్య : 147　　　　　పుట : 98 - రాగం : ముఖారి

**45.** ఏలే ఆఁటదానికి యెమ్మెలింతేసి
వోలిఁ గడుగుట్టుతోడ నుండవలెఁగాక ॥పల్లవి॥

జవ్వాది యెంతపూసేవే చన్నులేల మూసేవే
చివ్వన నెన్ని చేఁతలు సేసేవే
నవ్వులేమి నవ్వేవే నలిఁ గొప్పేమిదువ్వేవే
రవ్వలాయ నీవలపు రమణునియెదుట ॥ఏలే॥

సిగ్గులేల విడిచేవే చెమటేల తుడిచేవే
మొగ్గవిరు లిన్నేల ముడిచేవే
వొగ్గి కాలేల తొక్కేవే వూరకేల మొక్కేవే
యొగ్గులుఁదప్పు లెవ్వరి నెంచనివాఁ డతఁడు ॥ఏలే॥

మఱి యెందాఁకాఁ బాడేవే మాటలెన్ని యాడేవే
గుఱిగాఁ గాఁగిట నెంత కూడేవే
యెఱుకతో శ్రీ వేంకటేశుఁడు నన్నిటు గూడె
మెఱసి యాతనికేల మేకులు సేసేవే ॥ఏలే॥

**ఉపోద్ఘాతము :**

అన్నమయ్య తానొక చెలికత్తెయై అమ్మ అలమేల్మంగను మందలిస్తున్నారు. ఆయన చెప్పిన ఇటువంటి కీర్తనలన్నీ దాదాపు ఒకేలా వున్నా దేనిమాధుర్యందానిదే. ఆడదానికి ఇంత ఎమ్మెలు (విలాసము) పనికిరాదు. స్త్రీకి గుట్టు ఉండాలి. సంబంధం వున్నా నలుగురూ చెప్పుకొనేట్టు ప్రవర్తించరాదు.





**తాత్పర్యము :**

ఓ దేవీ! అలమేల్మంగా! ఆడదానికి ఇంతలేసి యెమ్మెలు (వయ్యారపు విలాసములు) తగునా? ఇంకొకరితో సంబంధం పెట్టుకొనినవారు దాని విషయములో గుట్టు వుండద్దా? నలుగురిలో అప్రతిష్ట తెచ్చుకొంటారా?

నీవు ఎంత జవ్వాది (సుగంధ ద్రవ్యము) మెత్తుకొన్నావో గమనించావా? కచ బంధమును అంతగా బిగించావు యెందుకు? శీఘ్రముగా యెన్ని చేష్టలను సేయుచున్నావు! యేమి నవ్వులొలకబోయుచున్నావు? నీకొప్పును యెంత దువ్వి సింగారింతువు! నీ వలపులు నీ రమణుని ముందు నగుబాటైనవి.

ఓ దేవీ! నీ సిగ్గులనేల విడనాడెదవు? కురియుచున్న చెమటలనేల (ఎంతగా) తుడుచుకొందువు! నీ తలలో ఇన్ని విరులనేల ముడిచెదవు? ఊరకనే ఆయనెందుకు అన్నిసార్లు మొక్కుతావు? ఆయన యెవ్వరి దోసములనూ యెంచడు.

ఓ రమణీ! నీ రమణుని ప్రీతికోసం ఎందాకా పాడెదవు? ఎన్ని మాటలను చెబుతావు? అదే లక్ష్యమన్నట్లు ఎంత గాఢమైన కౌగిలిలో ఎంత రమించెదవు? శ్రీ వేంకటేశ్వరుడు అన్నీ తెలిసిన వాడైనందున నాపై కరుణతో నన్నునూ కూడినాడు. నీవెందుకు బయటపడి మేకులు సేసేవే (నీ పెద్దరికం చూపించుకుంటున్నావే?)

సంపుటి : 8 కీర్తన : ఇద్దరూ నిద్దరే మనమేమి చెప్పేదే
సంఖ్య : 140 పుట : 82 - రాగం : శంకరాభరణం

**46.** ఇద్దరూ నిద్దరే మనమేమి చెప్పేదే
బద్దుగా దాపెను మెచ్చెఁ బ్రహ్లాదవరదుఁడు ॥పల్లవి॥

చక్కని మొకముచూపి సారె సారె మాటలాడి
చిక్కించెనాపె తొలుత చేరియాతని
మిక్కిలి మేలుదియై మేను చెమరించఁగాను
పక్కన నాపెను నవ్వెఁబ్రహ్లాదవరదుఁడు ॥ఇద్ద॥

పీఁటమీఁదఁ గూచుండి ప్రియములు చెప్పి చెప్పి
దూఁటి చన్నుల నొత్తెను తొలుతాతని
పాటించి యాతని మోవిపండు చూచి నోరూరఁగా
బాటగానాపెను నవ్వెఁ బ్రహ్లాదవరదుఁడు ॥ఇద్ద॥

కాఁగిలించుక యిందిర కన్నులవలపు చల్లి
ఆఁగెను శ్రీ వేంకటేశు నౌభళానను
చే!గదేరఁ జొక్కియాపెఁజూచి ఆతఁడె తానై
పాఁగినరతుల నవ్వెఁ బ్రహ్లాదవరదుడు ॥ఇద్ద॥

**ఉపోద్ఘాతము :**

అహోబలంలోని నరసింహుడు ప్రహ్లాద వరదుడు. ఆయనపై అనేకానేక కీర్తనలు చెప్పారు అన్నమయ్య. ఒక చెలికత్తెగా తనని తాను భావించుకొని తోటి చెలికత్తెలతో చెబుతున్నారు. ఈ ప్రహ్లాద వరదుడు మరియు ఆయన అర్ధాంగి శ్రీలక్ష్మి, ఇద్దరికీ మనమేం చెప్పగలము అంటున్నారు.





**తాత్పర్యము :**

ఓ చెలియా! మనమేమి చెప్పగలవారమే? ఆ ఇద్దరూ (అహోబల నృసింహుడు, శ్రీలక్ష్మి) ఇద్దరే. వారికి వారే సాటి. ఆ ప్రహ్లాదవరదుడు ఆమెను బద్దుగా (వశుడై) దాపెను (దగ్గరయ్యెను).

ఆ దేవి చక్కని తన వదనమును జూపి, ఆయనతో మాటలు కలిపి, మాటిమాటికీ మాటలాడినది. ఆయనను మొదట్లోనే చేరికయై చిక్కించెను, (వశుడౌనట్లు చేసినది). మిక్కిలి వలచినదై తన తనువు పులకరించిచెమర్చగా ఆయన పక్కన (ఒకవైపు) చేరినది. ఆమెను జూచి ఆ ప్రహ్లాదవరదుడు ఆనందంతో నవ్వుతున్నాడు.

ఆ దేవి పీటమీద గూచుండి (ఆయనతోపాటు సింహాసనం అధిష్టించి) ప్రియవచనములు మళ్ళీ మళ్ళీ చెప్పి, దూటిచన్నుల నొత్తెను (నిశితకుచాగ్రముల నాయనకు ఒత్తి పులకరింపు నిచ్చినది). దొండపండువంటి తన అధరముజూపి నోరూరించినది. ఆమెను జూచి ఆ ప్రహ్లాదవరదుడు పాటగా (లీలగా) నవ్వినాడు.

ఆ ఇందిరాదేవి కన్నుల వలపు జల్లి (ఆమె కన్నులకు ఆయన సింహ వదనుడుగా కాక మదనమోహనుడైన శ్రీ వేంకటేశ్వరునిగా కనిపించుచున్నాడేమో!) కౌగిలించినాడు. ఔబళమునను (అహోబలమునందుకూడా) శ్రీ వేంకటేశ్వరుడే చేగదీర జొక్కి (ధైర్యముగా వశుడై) ఆమెను జూచి ఆతడే తానై (ఆ వేంకటేశ్వరుడే అహోబలేశ్వరుడై, పాగినరతుల (మధురమైన రతుల) దేలి ఈ ప్రహ్లాద వరదుడు నవ్వులొలక బోయుచున్నాడు.

సంపుటి : 8 కీర్తన : అలమేలుమంగయీకె అనుక వద్దనుండని
సంఖ్య : 90 పుట : 54 - రాగం : శుద్ధ వసంతం

**47.** **అలమేలుమంగ యీకె అనుక వద్దనుండది**
**చెలరేఁగి కందువలు చిత్తగించవయ్యా ॥పల్లవి॥**

**తరుణిదేహమే నీకు తగుదివ్యరథము**
**గరుడధ్వజంబాపె కప్పుపయ్యద**
**తురగములు రతులఁ దోలెడు కోరికెలు**
**సరినెక్కి వలపులు జయించవయ్యా ॥అల॥**

**దిండు కలపిఱుఁదులు తేరుబండికండ్లు**
**అండనే పువ్వులగుత్తులాపెచన్నులు**
**కొండవంటి శృంగారము కోపునఁగల సొబగు**
**నిండుకొని దిక్కులెల్లా నీవేగెలువవయ్యా ॥అల॥**

**వెలఁదికంఠము నీకు విజయశంఖమదిగో**
**నిలువెల్ల సాధనాలు నీకునాపె**
**యెలమి శ్రీ వేంకటేశ యిద్దరునుఁ గూడితిరి**
**పలుజయముల నిట్టే పరగవయ్యా ॥అల॥**

**ఉపోద్ఘాతము :**

అలమేల్మంగ సొబగులను వర్ణిస్తున్నారు అన్నమయ్య. ఈకె కందువలు చెలరేగీ, అనుకవద్దనుండది, చిత్తగించవయ్యా! అంటున్నారు. ఇది అన్నమయ్య కాలంనాటి తెలుగు. అంతతేలికకాదు. ఆమె అంగాంగముల శోభ స్వామికి విజయ సంకేతములే అంటున్నారు. ఆ వివరములను వినండి.



ఏలుకో శృంగార రాయ

**తాత్పర్యము :**

ఓ ప్రభూ! ఈకె (ఈమె) అలమేలుమంగ. నీకు ఈమె అనుకొని నీచెంతయున్నది. అది (అందుచేత) కందువలు (అనేక సంకేతములు) చెలరేగీ (చెలరేగినవి). వీటిని చిత్తగించవయ్యా! (గమనించవయ్యా!)

ఈ తరుణి దేహమే నీకు సమకూడిన దివ్య రథము. ఆమె ఆచ్ఛాదనముగా కప్పుకొనిన పైట చెంగు నీపాలిటి గరుడుధ్వజము. రతివైభవమున ఆమెలో దోలెడు కోరికలు (చెలరేగినవాంఛలే) తురగములు (ఆ దివ్య రథమున కమర్చిన గుఱ్ఱములు) ఓ దేవదేవా! సరినెక్కి (ఆ రథమునధిరోహించి) ఆమె వలపును జయించవయ్యా!

దిండ్లవంటి ఆమె పిఱుదులు ఆయన రథమునకమర్చిన బండికండ్లు (జంటకన్నులవలె లోనివారు బయటి దృశ్యము చూచుటకేర్పరచిన, గుండ్రటి కిటికీలు) వాటికి అండనే (అక్కడే) అమర్చిన పూల గుత్తులు ఆమె చనుగవ వలెనున్నవి. ఆమెచేసికొనిన అందమైన సింగారము రథపుకోపున (కమ్మీలకు అమర్చిన) సొబగు (అలంకరణము). ఈ విధముగా నిండుకొనిన ఓ దేవా! నీవు దిక్కులన్నీ గెలువుమయ్యా!

ఆమె కంఠధ్వని నీ విజయ శంఖారావము వలెనున్నది. నిలువెల్ల ఆమె నీకు పురుషార్థసాధనములే. మరి ఇక ఇటువంటి మీరిద్దరూ ఒకటైనారు. ఎలమి (సంతోషముతో) అనేక విజయములు నీకు కలుగకుండ ఎలా వుంటాయి? ఇట్టే (సులువుగా) పరగవయ్యా (వర్ధిల్లవయ్యా!)

సంపుటి : 8 కీర్తన : విన్నపములికనేల వేగినంతాను
సంఖ్య : 62 పుట : 38 - రాగం : దేసాళం

48. విన్నపము లిఁకనేల వేగినంతాను
మన్నించకిఁకనుంటే మఱియేది త్రాణ ॥పల్లవి॥

కాంతకు నీవు చూచిన కనుచూపులే త్రాణ
మంతనాన నీవాడిన మాటలే త్రాణ
పొంత నీపై తలపోఁత పొద్దువోకలే త్రాణ
యింతట నీవురాకున్న నిఁకనేది త్రాణ ॥విన్న॥

నలినాక్షికపుడు నీ నవ్విన నవ్వులే త్రాణ
పలుమారుఁ జేసినట్టి బాసలే త్రాణ
పొలసి నీవు వేసిన పువ్వులచెండే త్రాణ
పిలుపించకిఁకనుంటే పిక్కటిల్లుఁద్రాణ ॥విన్న॥

సతికి నీకూటమిలో చనవిచ్చుటలె త్రాణ
వ్రతముగా నీవింటికి వచ్చుటే త్రాణ
గతియై శ్రీ వేంకటేశ కాఁగిలించినదె త్రాణ
తతినిట్టె కూడకుంటే తగనేది త్రాణ ॥విన్న॥

**ఉపోద్ఘాతము :**

త్రాణ అంటే శక్తి. ఆహారం లేనివాడికి ఆహారం తినగానే కలిగేది త్రాణ. అలమేలుమంగమ్మకు త్రాణ ఆ శ్రీవేంకటేశ్వరుడే. ఆయన దయ కనుమరుగైతే ఇక త్రాణయేది అంటున్నారు అన్నమయ్య. నిజానికి ఆ దేవికేగాదు ఏ సృష్టిలో ఏ జీవికైనా





ఆయన మన్నింపులేకపోతే మరి త్రాణు యేది? చరాచర సృష్టికంతా త్రాణ ఆ చక్కనయ్యేకదా! ఒక్కొక్కప్పుడు అన్నమయ్య పల్లవి అసలు అర్థం కాదు.

**తాత్పర్యము :**

ఓ ప్రభూ! ఇంకా యెంతని విన్నపములను చేసికొనవలెను? ఆమె నీ విరహాగ్నిలో వేగినంతసేపు నీ మన్ననే ఆమెకు త్రాణ (జీవశక్తి). నీమన్ననలేకపోతే ఇక ఆమెకు త్రాణ యేది స్వామీ?

ఆ అలమేల్మంగకు నీవు ప్రేమతో జూచిన కనుచూపులే త్రాణ. మంతనాన (ఏకాంతములో) నీవామెకు చెప్పినమాటలే త్రాణ. నీపై పొంతతలపోతతో (పొందుచున్నట్లు ఆలోచనలతో) పొద్దుబుచ్చుటయే ఆ దేవికి త్రాణ? ఇంతట (ఇప్పుడు) నీవు రాకున్నచో ఆమెకు త్రాణయేది స్వామీ!

ఆ పద్మదళాయతాక్షి నీ సన్నిధిలో నీవు నవ్విన చిరునవ్వులే ఆమెకు త్రాణ. నీవు అనేక పర్యాయములు ఆమెకు చేసిన బాసలు వాగ్దానములు కూడ నీపై ఆమెకు నమ్మిక కలిగించు త్రాణ. పొలసి (ఆమెకు చేరువయై) నీవు ఆమెపై జల్లిన పుష్పములే ఆ దేవికి త్రాణ. ఇక (ఇంకా) ఆమెను నీ వద్దకు పిలిపించుకోకుంటే ఆమెకు త్రాణయేది తండ్రీ!

సతికి (నీ భార్యకు) నీ సమాగమములో నీవామెకిచ్చు చనువులే ఆమెకు త్రాణ. వ్రతముగా (దీక్షాబద్ధునిగా) నీవు ఆమె గృహమునకేతెంచుటే ఆమెకు త్రాణ. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవే ఆమెకు గతియై కౌగలించుటయే ఆమెకు త్రాణ. తలన్ (వ్యాపించి) ఇట్టే (త్వరగా) ఆమెను కూడకున్నచో అవసరమైన త్రాణ యేది ప్రభూ!

సంపుటి : 8 కీర్తన : గొల్లెతలైతేనె కొఱతా
సంఖ్య : 289 పుట : 168 - రాగం : శ్రీ రాగం

**49.** గొల్లెతలైతేనె కొఱతా
పల్లదపు నీచే పడిరిగాకా ॥పల్లవి॥

కంచుఁబదనుల కాంతల నేఁడిట్టె
వంచుకొన నీకువసమా
పంచబాణముల దారికి లోనై
ముంచి చేతులెత్తి మొక్కిరిగాకా ॥గొల్లె॥

కోడెవయసు కొమెరలేమల
వాడికెకుఁ దేనువసమా
కూడఁగూడఁ బిల్లఁగోవి రాగాలకు
వాడవారు వెంటవచ్చిరిగాకా ॥గొల్లె॥

కొలఁదిలేనట్టి గుబ్బెతలనెల్ల
వలపించుకొనవసమా
యెలమి శ్రీవేంకటేశ కూడఁగాను
సొలసి చనవుచూపిరిగాకా ॥గొల్లె॥

**ఉపోద్ఘాతము :**

శ్రీ వేంకటేశ్వరుని నందనందనునిగా భావించి అన్నమయ్య ఈ కీర్తన చెబుతున్నారు. గొల్లభామలైతే మాత్రం నీకేం కొరత? పల్లదపు అంటే దృష్ట స్వభావముగల నీ చేతులో పడ్డాక ఇంకా చేసేదేముంది? అని దెప్పిపొడుస్తున్నారు.





కంచు బదనులైన కాంతలు అంటే పెళుసు స్వభావంగల భామలని ఏ నిఘంటువు లోనూ నేరుగా లేదు కాని బాగా ఆలోచిస్తే తట్టింది.

**తాత్పర్యము :**

ఓ ప్రభూ! వీరు అన్నెం పున్నెం యెరుగని గొల్లభామలైతే నేమి, నీకేం కొఱత (నీకుపోయిందేముంది?) పల్లదపు (దుష్ట స్వభావంగల) నీచేతుల్లో బడినాక వారు చేయగలిగిందేముంది?

కంచుబదనులైన కాంతలు (పెళుసు ప్రవర్తన గల భామినులను) నేడు ఇట్టే లొంగతీసికొనుట నీకు వశమైనదే కదా! నీ వలపు చేతలవల్ల పంచబాణుని (మన్మథుని పీడకు లోనై, ముంచి (వశులై) చేతులెత్తి నీకు మొక్కి వేడుకొన్నారు గదా!

యౌవనంలోకి అడుగిడుచున్న ముద్దుగుమ్మలను వాడికెకుదేను (అలవాటు చేసికొనుట) వసమా (అంత తేలికగా సాధ్యమయ్యే పనియేనా?) కొడగూడ (ఆ గొల్లెతలంతా గుంపుగా చేరి) నీ పిల్లగోవి (వేణువు) రాగాలకు వశులై గొల్లవాడవారంతా నీ వెంటబడి వచ్చారు గదా?

కొలదిలేనట్టి (అశక్యమైన) పయోధర ములుగల గోపికలనందరినీ వలపించుకొనుట అంత తేలికా? ఎలమి (వికాసముగల) ఓ శ్రీ వేంకటేశ్వరా! నీ అంతటి వాడు, వారిని కూడిన పిదప సొలసి (పరవశులై) నీకు చనవు చూపిరి గాక! (నీకు పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చేశారు).

సంపుటి : 8 కీర్తన : నడుమ జెమట భవనోయేరు మీకునబ్బె
సంఖ్య : 141 పుట : 83 - రాగం : సాళంగనాట

**50.** నడుమఁ జెమట భవనాశియేరు మీకునబ్బె
ఆడియాలముగ లోలోనందెఁగా మీవలపు ॥పల్లవి॥

యెదురుఁ గొండపై నెక్కి యిందిర నీపై ఁగుచము
లెదురుచాఁచి వొత్తెనేడకు నేడ
కదిసి శ్రీ నరసింహ కాఁగలించితి వాపెను
అదన నిందుకు నందు నందెఁగా నీ వలపు ॥నడుమ॥

యీడనుండి తన పాదమింతి నీతొడపై జాఁచి
యీడుజోడుగాఁ గూచుండెనిచ్చ యెరిఁగి
వేడుక నీమోవినాపె విందుగా మోవంటితివి
ఆడానీడా దోఁటిగా నేఁడందెఁగా మీ వలపు ॥నడుమ॥

నీనీడ ఆపెపైఁబారి నీపై నాపెనీడవారి
తానకమై రెంటా మీరు తగిలితిరి
పూని యహోబలమునఁబొంచి శ్రీ వెంకటేశుఁడ
ఆనకమై రెంటాఁ బెంగ్లెయంటెఁగా మీవలపు. ॥నడుమ॥

**ఉపోద్ఘాతము :**

అహోబల నృసింహుడు ఆయన దేవేరి లక్ష్మీదేవిపై సరసశృంగార కీర్తన చెబుతున్నారు అన్నమయ్య. దీని పల్లవికూడా అడియాలముగానే వున్నది. అనగా గుర్తుగా వున్నది. భవనాశియేరు (నది) మీకు నడుమన్‌చెమటన్‌గాన్ అబ్బె (లభించింది). మీ ఇద్దరి వలపు లోలోన అడియాలముగ (దానికి గుర్తుగా) అన్నమయ్య మనోగతం ఈని ఆనకమై చెప్పలేము,ఢంకామోగించి చెప్పే శక్తి సామాన్యునికి శక్యమా?





**తాత్పర్యము :**

ఓ ప్రభూ! నీవు అహోబల నృసింహుడవై శ్రీదేవిని గూడితివి. గరుడాద్రిపై నీవు, దానియెదురుగా కొండపై శ్రీలక్ష్మి వెలసి ఒకరిపై నొకరు వలపులు వెదజల్లుకొనుచున్నారు. రెండు కొండల నడుమ 'భవనాశియేరు' (నది) ముప్పిరి గొన్న మీ చెమటల వలె ప్రవహించుచు మీకున్ అబ్బె (లభించినది). మీ వలపు, అడియాలముగ (మీ వలపు గుర్తుగా) లోలోనందెగా (లోపల లోపలనే వెల్లివిరిసినది).

గరుడాద్రి యెదుటికొండపైనెక్కి ఇందిర (శ్రీలక్ష్మి) నీపై కుచములు యెదురుచాచి వొత్తెన్, ఏడకునేడ (తనకుచాగ్రములచే నిన్నొత్తినది). కదిసి (చేరువయై) ఆపెను శ్రీ నరసింహా! నీవు కాగిలించితివి. మీ వలపు అక్కడికక్కడే పెల్లుబికినది.

ఈ కొండపైనుండి ఇంతి (లక్ష్మీదేవి) తన పాదమును నీతొడపై జాచి ఈడుజోడుగా ఇచ్చనెరిగి (ఒకరిపై ఇంకొకరికి గల కోర్కెనెఱిగి) కూర్చొనియున్నారు. సంతోషముతో ఆమె నీవు ఒండారుల అధరామృతాస్వాదనానంతరము ఆడానీడ (ఆ కొండపైన, ఈ కొండపైన) తోటిగానేడందెగా మీ వలపు, (ఒకేసారి మీ వలపులు ఉధృతములైనవి).

ఓ ప్రభూ! మీరిరువురూ కొండలపై నెదురెదురుగానుండుటచేత నీనీడ ఆమెపైనను, ఆమె నీడ నీపైనను పారి (పడి) రెంటా తానకమై (రెండు చోట్లా సుస్థిరమై) మీరు తగిలిరి, ఒకరినొకరు తగులుకొని యున్నారు). అందుచేత ఇక్కడ ఈ అహోబలమునన్ పొంచి శ్రీ వేంకటేశుడా, ఆనకమై (భేరీనినాదములు) రెండుచోట్లా చెలరేగగా మీ వలపు విరహము వలె పరణమించినది.

సంపుటి : 7 కీర్తన : చనిగంటె విడువడు సారె సాకె నే పనులు
సంఖ్య : 87 పుట : 54 - రాగం : దేసాక్ష

51\. చవి గంటి (టే?) విడువఁడు సారెసారె నే పనులు
యివల నీతనిపొందులెట్టు సేసేదే ॥పల్లవి॥

పాలమీఁద! బవ్వళించి పాలవారియింటఁబుట్టి
పాలుదొంగిలించినట్టి బాలుఁడీతఁడు
గాలికూటివాని మెట్టి గాలిరాకాసునిఁగొట్టి
గాలిబిడ్డ తమ్మునిసంగడినాడె నీతఁడు ॥చవి॥

వసుల యేలికనేలి పసులకు మారుదెచ్చి
పసులఁ గాచిన యట్టి బాలుఁడీతఁడు
వసుధభారము దించి వసుధకొడుకుఁ గొట్టి
వసుధ యేలినయట్టివాఁడుగదె వీఁడు ॥చవి॥

బండిబోయుఁడైవచ్చి బండిగాలికత్తి వట్టి
బండి విఱిచినయట్టి బాలుఁడీతఁడు
కొండయెత్తి కొండదచ్చి గురుతై శ్రీవేంకటాద్రి
కొండపై నలమేల్ మంగఁ గూడినాఁడితడు ॥చవి॥

**ఉపోద్ఘాతము :**

పురాణాలమీద ఇతిహాసములమీద గొప్ప పట్టువుంటే కాని అర్థం కాని కీర్తన చెబుతున్నారు అన్నమయ్య. బండిబోయుడనేమాట ఏ నిఘంటువును వెదకినా అర్థం దొరకదు. బండిగాలికత్తివట్టి అంటే ఏమిటో తెలిసిన వానికి పురాణ బ్రహ్మ అనే బిరుదు ఇవ్వవచ్చేమో! ఇటువంటి కీర్తన వివరించిన నా జన్మకూడా తరించింది.





**తాత్పర్యము :**

ఇతడు (శ్రీవేంకటేశ్వరుడు), చవిగంటే విడువడు (నీయందు అనురక్తుడైతే వదిలిపెట్టడు). సారెసారెన్ (మాటిమాటికీ) ఏ పనులును ఇవలన్ ఈతని పొందులు (ఏపని చేసినా ఇతను కరుణిస్తేనే జరుగుతాయి). ఎట్టు సేసేదే? (ఎట్లా చెప్పేదమ్మా!)

పాలమీద బవ్వళించి (పాలసముద్రంపై పరుండి), పాలవారి ఇంటబుట్టి (గొల్లవారింట్లో జన్మించి), పాలు దొంగిలించిన పిల్లవాడు ఈ దేవదేవుడు. గాలికూటివాని మెట్టి (పాముల శ్రేష్ఠుడైన ఆదిశేషునిపై నెక్కి,) గాలిరాకాసిని గొట్టి (సుడిగాలిలా వచ్చి ఎత్తుకు పోబోయిన తృణావర్తుని సంహరించి) ఇతడు గాలిబిడ్డ తమ్ముని సంగడినాడె (వాయుదేవుని పుత్రుడై భీముని తమ్ముడైన అర్జునునితో పాటు ఆడుకొన్నాడు.)

పసులయేలికన్ (భూతనాథుడైన శంకరుని) ఏలి సంరక్షించి (భస్మాసురుని బారినుండి రక్షించాడు), పసులకు మారుదెచ్చి (బృందావనంలో గోవులను గోపాలురను బ్రహ్మదేవుడు అంతర్ధానం చేస్తే తానే వారై బ్రహ్మ గర్వమును ఖర్వముజేసినాడు), పసుల గాచినయట్టి గోవిందుడీబాలుడు. వసుధ భారము దించి (భూభారమును తగ్గించి), వసుధ కొడుకుని గొట్టి (నరకాసురుని చంపి, భూరమణుడైన విష్ణువు ఈ బాలుడు.

బండిబోయుడైవచ్చి (రథసారధిగా అర్జునునితోపాటు వచ్చి), బండిగాలి కత్తికట్టి (కాలిబొటనవ్రేలితో రథాన్ని క్రుంగించి కర్ణుని శక్తి అనే అస్త్రం నుంచి కిరీటిని రక్షించి), బండివిరిచినయట్టి (శకటాసురుని చంపిన) చిన్నారి బాలుడీస్వామి. కొండయెత్తి (గోవర్ధన పర్వతమునెత్తి), కొండదచ్చి (కూర్మరూపుడై క్షీరసాగరమథనం, మందరగిరితో చేయించి), ప్రసిద్ధి జెందిన శ్రీవేంకటగిరిపై అలమేలుమంగతో కూడియున్న జగన్నాథుడు ఇతడే.

సంపుటి : 7 కీర్తన : ఏలనీవు సిగ్గుపడే వింతలోనను

సంఖ్య : 197 పుట : 120 - రాగం : పాడి

**52.** ఏల నీవు సిగ్గువడే వింతలోనను
మేలిమియిల్లాల నీకు మించి నేనేకాదా ॥పల్లవి॥

ఎక్కడఁ దిరిగినా మా యింటికే వత్తువు నీవు
తొక్కుమెట్టాడి నిన్ను దూరనేఁటికి
పుక్కట తుమ్మిదకును పువ్వులెన్ని కలిగినా
తక్కినచుట్టపు పొందు తామరే కాదా ॥ఏల॥

తలఁపు నీకేడనున్న తనువు నాపై వేతువు
చెలరేఁగి నిన్ను రట్టు సేయనేఁటికి
సొలసి చల్లగాలికి చోట్లెన్ని గలిగినా
మలయఁ బేరై నచోటు మలయాద్రిగాదా ॥ఏల॥

నింద నీకెంత మోచినా నీవె నన్నుఁ గూడితివి
కందువ నీ గుణాల పొగడనేఁటికి
యెందరు శ్రీ వేంకటేశ యింతులు గలిగినాను
యిందిరను నీ యిల్లు నా యెదలోనె కాదా ॥ఏల॥

**ఉపోద్ఘాతము :**

ఇందిరాదేవి సాధికారంగా స్వామితో చెబుతున్నది, “నీవెందుకు సిగ్గు పడెదవు స్వామీ! నిన్ను వలచినవారు, వలపించుకొన్నవారూ యెంతమందివుంటే నాకేమయ్యా! నీకు బంగారం వంటి పెండ్లాము నేనే కదా! ఆ తల్లి అభిజాత్యం చూడండి.





“నా ఇల్లు నీ హృదయమే ప్రభూ!” అంటున్నది. అన్నమయ్యకు సాటి రారు, లేరు. ఇటువంటి సేవ ఆ తల్లికి చేయడానికి నేను చేసిన సుకృతమేమో తెలియదు.

**తాత్పర్యము :**

ప్రభూ! నిన్ను వలచిన వారెందరో! వలపించుకొన్నవారు లేక పోలేదు. ఇంతలోనే నీవు యేల సిగ్గు పడేవు (సిగ్గు పడెదవు)? మించి (అతిశయించి), నీకు మేలిమి బంగారం వంటిమేలైన ఇల్లాలను నేనేకాదా? మరి ఇకనేమి?

నీవు ఎక్కడ యెవ్వరితో తిరిగినా నీవు చివరకు వచ్చేది మా ఇంటికే కదా! తొక్కుమెట్టాడి (కష్టపెట్టి) నిన్ను నిందించుటవల్ల ప్రయోజనమేమిటి?తుమ్మెదకు యధాలాపంగా వాలడానికి తోటలో తక్కిన పూలు యెన్నివున్నా, చుట్టపు పొందు (ఆత్మీయతగల అనుబంధం) తామరపూవుతోనే కదా!

తలపు నీకేడ నున్నా తనువు నాపైనేతువు (నీ మనస్సులో ఆర్తజనులు అసంఖ్యాకులు, కానీ నీ శారీరక అనుబంధం నాతోనేకదా!) ఈ మాత్రం దానికి చెలరేగి నిన్ను బయటపెట్టి యాగీ చేసినందువలన లాభమేమిటి? చల్లగాలికి జగతిలో యెంత స్థానం వున్నప్పటికీ మలయ మారుతమునకు పుట్టిల్లు మలయపర్వతమేకదా!

నిన్ను యెందరు యెన్ని విధములుగా మోచినా (వాంఛించినప్పటికినీ) నీవు కూడునది నన్ను మాత్రమే. కందువ (ఏకాంతమున) నీ గుణములను నేను పొగడవలసినపని యేమున్నది? ఓ శ్రీవేంకటేశ్వరా! నీవెందరు సుందరీమణులను పొందినా నీ డెందము ఇందిరకు (లక్ష్మీదేవికి) చెందినదే. ఇందులో సందేహం వుందా? నీఇల్లు నాయెదలోనే కాదా!

(అదండీ... ఆ తల్లికి తనమీద తనకున్న నమ్మకం. సెబాసో... సెబాసు).

సంపుటి : 7 కీర్తన : పూవుబోణుల కొలువే పుష్పయాగము
సంఖ్య : 60 పుట : 38 - రాగం : గౌళి

**53.** **పూవుఁబోణుల కొలువే పుష్పయాగము**
**పూవక పూచె నీకిట్టి పుష్పయాగము ॥పల్లవి॥**

**కలువ రేకులవంటి ఘనమైన కన్నుల**
**పొలఁతుల చూపులె నీ పుష్పయాగము**
**తలఁచి తలఁచి నిన్నుఁ దమమేనులఁ బొడమే**
**పులక జొంపములె నీ పుష్పయాగము ॥పూవు॥**

**కరకమలములను కందువగోపికలెల్లా**
**పొరసి నినుఁ జూపుటే పుష్పయాగము**
**సరసపుమాటలే సారెనాడి తమనవ్వు**
**పొరి నీపైఁ జల్లుటే పుష్పయాగము ॥పూవు॥**

**గాఁటపుఁ గొలనిదండఁ గాంతలు సిగ్గున నిన్ను**
**బూటకానకుఁ దిట్టుటే పుష్పయాగము**
**యీటున శ్రీ వేంకటేశ యిట్టె యలమేలుమంగ**
**పూఁటవూటరతులివి పుష్పయాగము. ॥పూవు॥**

**ఉపోద్ఘాతము :**

పూవుబోడి – అంటే పుష్పమువలె మృదువైన శరీరముగల స్త్రీ అని అర్థము. ఓ ప్రభూ! నీవు పూవక పూచేవాడివి. అంటే.. మొగ్గ తొడిగి అది పుష్పం అవటం. ఇదంతా వుండదు. నీకరుణ ఒకేసారి ఆవిర్భవిస్తుంది. అంతదాకా నీవు





మా మొరవింటున్నావో లేదో కూడా మాకు తెలియదు. రకరకాల పూలతో నీకు చేసే పూజయే పుష్పయాగం. ఆ వివరాలనందిస్తున్నారు అన్నమయ్య.

**తాత్పర్యము :**

ఓ శృంగారరాయా! అనేకమంది పూబోడులు (స్త్రీలు) చేసిన కొలువే (సేవయే) నీకు పుష్పయాగమైనది. పూయుచున్నట్లు తెలియకుండానే ఒకేసారి పూచిన పుష్పం వంటి కరుణగల దయాసింధువు నీవు. అట్టి నీకు ఇవన్నీ పుష్పయాగములే.

కలువరేకులవంటి కళ్ళున్న పొలతుల (స్త్రీల) గొప్పకనుచూపులే, నీకు పుష్పయాగము. నీ ఆలోచనలవల్ల ఆ తరుణులలో కలిగిన పులకల మొలకలే నీకు ఒక పుష్పయాగము.

ఆనాడు రేపల్లెలో గోపికలంతా కమలములవంటి ఎఱ్ఱని తమ చేతులు, నిను పొరసి జూపుటే (నిన్నుపొంది నీకు తమ చేతులు) చూపించుటయే ఒక పుష్పయాగము. అనేక సరసోక్తులనాడుచూవారు ఆనాడు మాటిమాటికీ తమ నవ్వుల పువ్వులను నీపై విరజిమ్మేరు. అంతకంటే గొప్ప పుష్పయాగం నీకేముంది నందనందనా!

ఓ చిలిపికృష్ణా! గాటపు గొలనిదండనే (పెద్దకోనేటి ఒడ్డున) కాంతలు, నీవు వాళ్ళ వస్త్రములనపహరించినావని బూటకానకు దిట్టేరు (లోపల నీ చిలిపి తనమునకు సంతోషించినా పైకి నటిస్తూ తిట్టినారు).

ఆ తిట్లే నీకు ఒక గొప్ప పుష్పయాగము. ఈటెన (ఇటుపైన) ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు నిత్య పెళ్ళికొడుకువై మా అమ్మ అలమేల్మంగమ్మను పూటపూటకు రతుల నోలలాడించుచున్నావు. ఆరతులేమా ఆరతులై నీకు ఒక గొప్ప పుష్పయాగం అయింది తండ్రీ!

సంపుటి : 7 కీర్తన : తనకే తెలుసునమ్మ తమకపు వేడుకలు
సంఖ్య : 195 పుట : 119 - రాగం : శ్రీరాగం

**54.** **తనకే తెలుసునమ్మ తమకపు వేడుకలు**
**కొనచూపుల నవ్వీని గోవిందరాజు ॥పల్లవి॥**

**పడఁతులిద్దరు తనపాదములొత్తఁగాను**
**నడుమఁ గొడుకుఁగనె నగుతాఁ దాను**
**పొడమి కాంతలకుఁగా పురుషుఁడు బిడ్డఁగన్న**
**కొడిమెలు గట్టుకొనె గోవిందరాజు ॥తనకే॥**

**సేదదేరి యీ చెలుల చేతి చెమటలఁ దోఁగి**
**పాదాలఁ గూఁతురుఁగనెఁ బై పైఁ దాను**
**ఆదిగొని మగవాఁడు ఆఁడువారికి వేఁకటై**
**సాదుఁదనము మోచెనిచ్చట గోవిందరాజు ॥తనకే॥**

**పెనఁగి లక్ష్మీభూముల ప్రేమపుటంగాలు సోఁకి**
**మనసున బిడ్డఁగనె మరిగి తాను**
**వనితలకు మగఁడు వరుసకానుపుగనె**
**కొనబు శ్రీ వేంకటాద్రి గోవిందరాజు ॥తనకే॥**

**ఉపోద్ఘాతము :**

తిరుపతిలో నెలకొన్న శ్రీ గోవిందరాజస్వామిపై సరసశృంగార కీర్తన వినిపిస్తున్నారు అన్నమయ్య. “పెనగి లక్ష్మీభూముల ప్రేమపుటంగాలు సోకి మనసున బిడ్డగనె మరిగితాను, వరుస కానుపులు గనె వనితలకు మగడు” అంటున్నారు. ఏదో అర్ధమవుతోంది అనిపించినా...యేమీ అర్థం కాని కీర్తన ఇది. తోటి చెలికత్తెలతో తానూ ఒకతెయై చెబుతున్నారు అన్నమయ్య.





**తాత్పర్యము :**

ఓ చెలియా! తమకము (శృంగార పారవశ్యము)న కలిగే వేడుకలు యెట్లాంటివో, తనకు మాత్రమే తెలుసునమ్మా! అందుకనే నర్మగర్భంగా ఈ గోవిందరాజస్వామి కొనచూపుల (క్రీగంట) నవ్వులొలికిస్తున్నాడు.

భూదేవి శ్రీదేవి అనే ఇద్దరు భార్యల ముద్దుల మగడు ఆ స్వామి. ఆ ఇద్దరూ ఆయన పాదాలు ఒత్తుతున్నారు. నడుమ (ఈ మధ్యలో) నవ్వుతూనే ఈయన ఒక బిడ్డను కన్నాడు.కాంతలకు బదులు పురుషుడు బిడ్డను కనటం యెక్కడైనా వున్నదా? ఈ గోవిందరాజు ఆ కొడిమెలు (అపఖ్యాతులను) కూడా పొందాడు. ఎవరికోసం? మనకోసం. ఆ బిడ్డే బ్రహ్మదేవుడు. ఆయన (బ్రహ్మ) వలననే సృష్టి జరుగుతోంది కదా!

శృంగారంలో అలసిన ఈ వనితల చేతి చెమటలలో మునిగిన ఈస్వామి పాదాలనుండి ఆ చెమట వరదలా పారింది. అదే సురగంగకి (ఆకాశగంగానదికి ఆవిధంగా ఆయన తండ్రి అయ్యాడు.) పైపై (తనమీదనుంచే) తాను ఆడువారికి వేకటై (గర్భము ధరించి) ఇచ్చగ ఈగోవిందరాజు సాదుతనము మోచె (మంచి భర్త అయ్యాడు).

ఇదేమిటయ్యా! మేమూ బిడ్డల తల్లులమవుతామంటే మంచికి, చెడుకి, ఆయనే కారణం కాబట్టి, పెనగి (ఉద్యుక్తుడై) లక్ష్మీదేవికి, భూదేవికీ ప్రేమపు, అంగములను స్పృశించి తన మనోశక్తితో తాను మరిగి బిడ్డను గనె (వారలకు బిడ్డలను ప్రసాదించాడు). అదీ వరుస కానుపులలో భూదేవికి నరకాసురుని, శ్రీదేవికి మన్మథుని ప్రసాదించాడు. మరి ఈ గోవిందరాజు నిజానికి యెవరు? శ్రీ వేంకటాద్రి కొనబు(పు) వాడు (శిఖరమువాడు). ధన్యోస్మి...

సంపుటి : 7 కీర్తన : కొమ్మలాల యిదె మంచి కొలువువేళ
సంఖ్య : 449 పుట : 276 - రాగం : గౌళ

55. కొమ్మలాల యిదె మంచి కొలువు వేళ
చిమ్ముచు విన్నపాలెల్లఁ జేయరే యిపుడు ॥పల్లవి॥

భామఁ దొడపైనిడుక ప్రహ్లాద వరదుఁడు
ఆముకొని సరసములాడుచున్నాఁడు
దోమటి వలపులను తొప్పఁదోఁగి చెమటల
ఆమని వేడుకలనోలలాడుచున్నాఁడు ॥కొమ్మ॥

చెలి విడెమియ్యఁగాను శ్రీ నారసింహుఁడు
నలువంకఁ బకపక నవ్వుచున్నాఁడు
పులకల జొంపముల పవ్వుదండలతోడ
చెలరేఁగి మచ్చికలు సేయుచున్నాడు ॥కొమ్మ॥

పొంది లకిమమ్మతోడ బొమ్మి రెడ్డిచెర్ల హరి
యిందరి శ్రీ వేంకటేశుఁ దేలుచున్నాఁడు
సందడిరతులఁ జొక్కి జవ్వనమదము మించి
మందె మేళాము సేసుక మన్నింపుచున్నాఁడు ॥కొమ్మ॥

**ఉపోద్ఘాతము :**

బొమ్మిరెడ్డి చెర్ల అను గ్రామమున నెలకొన్న నృసింహదేవునిపై సరసశృంగార కీర్తన చెబుతున్నారు అన్నమయ్య. లకిమమ్మ (లక్ష్మీదేవితో) కూడి ఈ శ్రీహరియే శ్రీవేంకటేశుడై "మందెమేళము సేసుక మన్నింపుచున్నాడు" అంటున్నారు. అంటే యేమిటి అని అడుగనేల? తాత్పర్యం చదివితే సరిపోదా? జవ్వన మదమున సందడి రతుల జొక్కియున్నాడట ఆ "సింగమలై".





**తాత్పర్యము :**

ఓ కొమ్మలాల (కోమలులారా!) ఇదిగో ఇదే మంచి సుముహూర్తము. శ్రీ నృసింహుడు కొలువుదీరియున్నాడు. చిమ్ముచు (ఉత్సాహముతో) మన విన్నపములను యెల్లా చేయుదము రారండు.

ఆ ప్రహ్లాద వరదుడు భామన్ (శ్రీలక్ష్మిని) తన తొడపై నిడుకొని (కూర్చుండ బెట్టుకొని) ఆముకొని (క్రమ్ముకొని) సరసముల నాడుచున్నాడు. దోమటి వలపులను (సమ్మోహనముచేయు వలపుల అలసటతో) చెమటల వెల్లువలో తడిసియున్నాడు. ఆమని వేడుకల (వసంతోత్సవముల వేడుకలో) ఓలలాడుచున్నాడు. ఈయనను సేవించి తరించండి.

శ్రీదేవి ఆయనను ఆహ్వానించి విడెమియ్యగా (తాంబూలమునిచ్చి షోడశోపచారముల జేయగానే) ఆనందముతో పకపకమని నవ్వుచున్నాడు. సంతోషంతో ఆయన తనువు పులకల జొంపముల (అధికముగా పూచిన పులకరింతల వెల్లువలో చెలరేగి (విజృంభించి) ఆమెతో మచ్చికలు సేయుచున్నాడు. (స్వాధీనము జేసికొనుచున్నాడు.)

ఈ బొమ్మిరెడ్డి చెర్ల అనే గ్రామమునకు చెందిన) హరి (నృసింహుడు) లకిమమ్మ (లక్ష్మీదేవితో) పొంది (కూడినవాడై), ఇందరినీ యేలుచున్నాడు. శ్రీ వేంకటేశ్వరుడూ తానేయై మించి (అధికుడై) యౌవన గర్వముతో. సందడి రతుల (అతిశయించిన శృంగారలీలతో) జొక్కియున్నాడు (అలసిపోయి వున్నాడు). మందెమేళము సేసుక (స్నేహభావన లెల్లా చూపించుచూ) తన భక్తులను మన్నింపుచున్నాడు. ఈ దేవదేవుని సేవించి తరించండి.

సంపుటి : 7 కీర్తన : ఎందాకా వేసరించేనిదివో నిన్ను
సంఖ్య : 492 పుట : 302 - రాగం : సాళంగనాట

**56.** ఎందాక వేసరించేనిదివో నిన్ను
పొందితే నీకాఁగిటిలో పొసఁగేదే కాకా ॥పల్లవి॥

చిగురుఁ గొమ్మకు నెంత చేగలెక్కినా మేలే
మగువనెంత వెంచినా మాకుమేలే
జగడాల కేమి వని సాదువలెనుండి నీవు
మొగము చూచినంతలో మొక్కేదే కాక ॥ఎందా॥

వలరాజునమ్ము కెంత వాఁడివెట్టినా మేలే
చెలిని నీవెంత సింగారించినా మేలే
చలపోర మరియేల చనవుకొలఁదినే
పలిచినప్పుడే నీతోఁ బెనఁగేదే కాక ॥ఎందా॥

బంగారు ప్రతిమ కెంత ప్రాణము వోసినా మేలే
అంగనకెంత లోనైనా మేలే
సంగతి శ్రీ వెంకటేశ సరి నన్నుఁ గూడితివి
పొంగి నీవు చెనకితే భోగించుటే కాక ॥ఎందా॥

**ఉపోద్ఘాతము :**

అన్నమయ్య శ్రీవేంకటేశ్వరునికి చక్కటి ఉపాయము చెబుతున్నారు. ఇదిగో ఓ స్వామీ! నిన్ను అడవి యెంతదాక సాధిస్తుంది? ఒక్కసారి నీ కౌగిటి సుఖం పొందితే నీకు పొసగదా! అందులోనూ ఆమె నివాసమే నీయెద. నీవు ఆమెనొక్కసారి తాకితే భోగించుటగాక ఇంకా ఇంకేముంటుంది!





**తాత్పర్యము :**

ఓ ప్రభూ! నేను (అలమేల్మంగ) నిన్ను యెందాక ఇట్లు వేసరించేను (కష్టపెడతాను? నిన్ను కలిసిన పిమ్మట యెలాగైనా నీ కౌగిటిలో కరిగిపోయేదేకదా!

చిగురుబోడియైన ఆడది యెంత చేగలెక్కినా (చేవ పొందినా?) మగువ, "నెంత మాకు వెంచినా" (యెంత మంకుతనము పెంచినా) నీకు మేలే. ఎందుకంటే ఎంత జగడాలమారియైనా నీ మొగము జూచినంతనే సాధువువలె నీకు మొక్కేదేకదా! మరి ఇంకా నీకు దిగులెందుకు స్వామీ!

ఆ వలరాజు (మన్మథుడు) తన అమ్ముకు (బాణమునకు) ఎంత పదును బెడితే నీకు అంతమేలే. నన్ను నీవెంత సింగారిస్తే నీకు అంతమేలు కలుగుతుంది. నేను చలపోర (మత్సరముతో యెంత పోట్లాడినా) నీవు చనువు జూపి పిలిచినప్పుడు నీతో పెనగేదే కాక (పెనగులాడేదే కదా!)

బంగారు బొమ్మకు యెంతప్రాణం పోస్తే నీకు అంత మంచిది కదా! మొగవాడు రతిలో ఆడదానికి యెంత లొంగినా మేలేకదా! ఓ శ్రీవేంకటేశ్వరా! సరి సంగతి (సమభోగములో) నన్ను కూడితివి. నీవు పొంగి (అతిశయించి) చెనకితే (తాకితే) భోగించుటేకాక! (ఇక శృంగారమున సుఖించుటే కదా!

సంపుటి : 7 కీర్తన : మదనుని తండ్రికి మజ్జనవేళ
సంఖ్య : 493 పుట : 302 - రాగం : శ్రీరాగం

**57. మదనుని తండ్రికి మజ్జన వేళ**
**పొదిగొనీ సింగారపు భోగములెల్లాను ॥పల్లవి॥**

**పడఁతుల నవ్వులెల్లా పైనంటుకొన్నట్టు**
**కదలేక పొగడొందెఁ గప్పురకాపు**
**నిడివిఁ గల్పవృక్షము నిండాఁ బూచినట్టు**
**కడుఁ దెల్లనై యమరెఁ గప్పురకాపు ॥మదను॥**

**సుదతుల చూపులు సొరిది పైఁగప్పినట్టు**
**పొదిగొని జొబ్బిలీని పుణుఁగుకాపు**
**అదన నల్లగలువలట్టె ముంచుకొన్నట్టు**
**పొదలెఁ దిరుమేనను పుణుఁగుకాపు ॥మదను॥**

**అలమేలుమంగ పురమందుండి యనురాగము**
**కులికినట్టు పన్నీరుఁగుంకుమకాపు**
**యెలమి శ్రీ వెంకటేశుఁడిన్ని సొమ్ములు నించుక**
**కొలువెల్లా నిండుకొని (నీఁగుం?) కుంకుమకాపు. ॥మదను॥**

**ఉపోద్ఘాతము :**

శ్రీ వేంకటేశ్వరునికి ఆయన దేవేరులకు మజ్జనానంతరం కర్పూరకాపువేసి, పుణుగుకాపువేసి, పన్నీరు కుంకుమ కాపువేసి సేవచేసేవారు అన్నమయ్య. అందాల మన్మథుని తండ్రిగారైన ఆ దేవదేవునకు సింగారము వైభోగంగా జరుగుతుంది.





అలమేల్మంగను ఉదరమున దాల్చిన స్వామికి యెన్నో సొమ్ములు(నగలు) ధరింపచేసి పరవశిస్తారు భక్తులు. మనమూ అదేపని చేద్దాం.

**తాత్పర్యము :**

సాక్షాత్తు మన్మథుని యంతటి అందగానికి జన్మనిచ్చిన తండ్రి శ్రీమన్నారాయణుడు. ఆయనకు మజ్జనవేళ (స్నానముచేయించు సమయమున), సింగారములు (అలంకరణలు) భోగములు (వస్త్రాలంకరణము, భూషణాలంకారము, నైవేద్యము మొదలైనవి) యెల్లా పొదిగీని (అన్నీ జరుగుతున్నాయి).

ఆయన దేవేరుల నవ్వులన్నీ ఆయన శరీరానికి అంటుకొన్నట్లున్న కప్పురకాపు (కర్పూరపు పూత) కదలేక (అంతులేక) పొగడొందె (కొనియాడబడినది). దివిలోని కల్పవృక్షము విస్తృతంగా పూలు పూచినట్లు యెంతయో తెల్లదనముతో ఆ కప్పురకాపు స్వామికి అమరియున్నది.

సుదతుల (శ్రీదేవి భూదేవి) చూపులే చక్కగా ఆయనపై గప్పినట్టి పుణుగుకాపు (పునుగు పిల్లినుంచి వచ్చిన సుగంధ ద్రవ్యముతో వేసిన పూత) వలెనున్నది. అది పొదిగొని జొబ్బిలీని (అధికమై స్రవించుచున్నది). అందుచేత ఆ దేవేరులు నల్ల కలువల వలె శోభిల్లుచున్నారు. పవిత్రమైన వారి శరీరాలపై ఆ పుణుగుకాపు అందములొలుకుచున్నది.

అలమేలు మంగమ్మ ఆయన పురముపై అనురాగముతో కులుకుచూ వున్నట్లు పన్నీటితో తడిసిన కుంకుమపూత స్వామికి వేసినారు. ఎలమి (సంతోషముతోనున్న) శ్రీ వేంకటేశ్వరుడు సొమ్ములు నించుక (నగలన్నీధరించి) కుంకుమ కాపుతో తన సభలో కొలువుదీరియున్నాడు. ఈ మహానుభావుని సేవించి తరించండి.

సంపుటి : 7 కీర్తన : తాను చేసినచేత తరుణి మేనను నిండె
సంఖ్య : 561 పుట : 343 - రాగం : శంకరాభరణం

**58.** **తాను చేసినచేఁత తరుణిమేనను నిండె**
**వీనులు చల్లఁగ నిట్టె విన్నవించరే** ॥పల్లవి॥

**జక్కవ గుబ్బలమీఁద చంద్రోదయములాయ**
**చుక్కలు మొలచెనిదె సొంపు మోవిని**
**అక్కజపుతురుమున నద్దమరేతిరి నిండె**
**వెక్కసపుపతికిది వేళ చెప్పరే** ॥తాను॥

**కనుచూపు తామెరల గక్కుననుఁ దెల్లవారె**
**యెనయని తలపోఁతనెండలు గాసె**
**పనివడి విరహాన పట్టపగలై తోఁచె**
**ననిచిన పతికి సన్నలు సేయరే** ॥తాను॥

**వడిగొన్న జవ్వనాన వసంతకాలము వచ్చె**
**పొడవైన కళలను పున్నమ గూడె**
**యెడమిచ్చి శ్రీ వేంకటేశుఁడింతలోఁ గూడె**
**బడివాయకుండఁ దన్ను బాసగొనరే.** ॥తాను॥

**ఉపోద్ఘాతము :**

శ్రీ వేంకటేశ్వరుడు చేసే చిలిపి చేష్టలతో తరుణి దేహం నొచ్చింది. మా చెవులు చల్లబడుతున్నట్లు ఆ సంగతులన్నీ చెప్పండే- అని చెప్పుకొంటున్నారు, అమ్మవారి చెలికత్తెలు. అన్నమయ్య కూడా ఒక చెలికత్తెయై యెంతరసవత్తరంగా చెబుతున్నారో వినండి.





**తాత్పర్యము :**

ఆ స్వామి, తాను చేసిన చేతలన్నీ (చిలిపి పనులన్నీ) ఆ తరుణి మేనను (శరీరంపై) నిండియున్నాయి. మా చెవులు చల్లబడునట్లు, ఇట్టే అవన్నీ వివరించండమ్మా!

జక్కువ పిట్టలవంటి పొంకమైన స్తనయుగ్మం మీద చంద్రోదయమైనది (అర్ధచంద్రాకారపు గాట్లు తేలినవి.) సొంపైన అధరముపై దంతక్షతములను చుక్కలు మొలచినవి. సంభ్రమము కలిగించు కేశపాశము అర్ధరాత్రి పెనుచీకటివలె వ్యాపించినది. వెక్కసపు పతికి (సర్వాధికుడైన ఆ వేంకటపతికి) వేళ అయిందని చెప్పండమ్మా!

గభీలుమని తెల్లవారింది. ఆయన గురించి అంతులేని ఆలోచనలను యెండలు విపరీతముగా కాసినవి. అదేపని అన్నట్లు విరహముతో పట్టపగగా యేమిటిది? అనిపించింది. మరి పట్టపగలు తామరపూలు విచ్చుకొనవా? ఆమె పద్మముల వంటి తన కన్నులను విచ్చినది. ఇక ననిచిన (అతిశయించిన) ఆ వేంకటపతికి సన్నలు సేయరే (సైగలు చేసి) రమ్మని చెప్పండమ్మా!

విజృంభించిన ఆమె యౌవనమున ఆమని వెలసినది. అంతులేని కళలతో పున్నమి పూచినది. ఇంతసేపు యెడబాటునిచ్చి ఆమెను వేపిన శ్రీ వేంకటేశ్వరుడు ఇంతలోనే ఆమెను కూడినాడు. ఆమెను బడివాయకుండా ఆయనవద్ద బాస తీసికోండమ్మా! (త్వరగా... మళ్ళీ చిక్కుతాడో లేదో..)

సంపుటి : 7 కీర్తన : చేకొనుమీ నల్లబల్లి చెన్నకేశవా
సంఖ్య : 534 పుట : 327 - రాగం : సాళంగ నాట

**59.** చేకొనుమీ నల్లఁబల్లి చెన్నకేశవా
యీకడ నీ కిన్నిటికినిదివో మొక్కేను ॥పల్లవి॥

పొంచినీవు విలిచితే బొమ్మల జంకించితిని
మంచముపై నుండితిని మన్ననలను
కంచముపొత్తుకుఁ దియ్యగా నీతోఁ బెనఁగితి
యెంచకు మీ యానేరాలిదివో మొక్కేను ॥చేకొను॥

సరసము నీవాడితే సారెసారెఁ దిట్టితిని
సిరులఁ జెనకితేనే చెలఁగితిని
శిరసు వంచుకొంటిని చెరఁగు నీవు వట్టితే
యెరవు సేయకు నన్నునిదివో మొక్కేను ॥చేకొను॥

సెలవి నీవు నవ్వితే సిగ్గులు పైఁజల్లితిని
సొలసి చెక్కు నొక్కితే చొక్కితి నేను
కలసితివిదె శ్రీ వెంకటగిరినుండి వచ్చి
యెలమిఁ దమకించకు యిదివో మొక్కేను. ॥చేకొ॥

**ఉపోద్ఘాతము :**

నేటి కడపజిల్లాలోని నల్లబల్లిలో నెలకొన్న చెన్నకేశవస్వామిపై సరస శృంగార కీర్తన చెబుతున్నారు అన్నమయ్య. మమ్మల్ని దరిజేర్చుకొని అనుగ్రహించవయ్యా! ఇదిగో వీటన్నిటికీ నీకు మొక్కేము అని అంటున్నారు. నీకు మొక్కుతాము కానీ మమ్మల్ని తమకించకయ్యా! అంటున్నారు అంటే ఏమిటి? మామూలుగానే అన్నమయ్య





కూడా స్వామిని వలచిన జవ్వనియే! పాపం ఆ యువతి ఈ చెన్నకేశవునితో వేగలేక యేమంటోందో వినండి.

**తాత్పర్యము :**

నల్లబల్లి గ్రామములో వెలసిన చెన్నకేశవా! నన్ను చేకొనుమీ (అనుగ్రహింపుము ప్రభూ!) నీకిన్నిటికిన్ (లీల లన్నిటికీ) ఇదివో ఈకడ (ఇదిగో ఇక) మొక్కుతున్నాము. మమ్ము కనికరింపుము స్వామీ!

ప్రభూ! నీవు చాటుగా నన్ను విలిచితే (పిలిస్తే) నేను బొమ్మల జంకించితిని (కనబొమ్మలతోనే నిన్ను బెదిరించాను.) నీతో మన్ననలను మంచముపై నుండితి (మంచి పక్కమీదకి కూడా చేరాను). కలిసి ఒకే కంచంలో తిన్నప్పుడు కలహించాను కూడా. ఇదిగో స్వామీ! ఇవన్నీ నేరాలుగా పరగణించకు. నీక మొక్కుతానయ్యా!

స్వామీ! బాహాటంగా నాతో సరసాలాడితే మాటిమాటికీ నిన్ను తిట్టాను. ఎక్కడెక్కడో స్పృశిస్తే చెలరేగిపోయాను. నన్ను చేరి పట్టుకోగానే సిగ్గుతో శిరసువంచుకొన్నాను. అందుకుగాను నన్ను ఎరవు సేయకు (విభేదించకు). ఇదిగో ఇక నీకు మొక్కెదను ప్రభూ!

ప్రభూ! నీవు నర్మగర్భముగా సెలవి నవ్వితే (చిరునవ్వు నవ్వితే) నా సిగ్గులన్నీ నీపై వెదజల్లాను. నా చెక్కిళ్ళు నొక్కితే సొక్కి పరవశించాను. శ్రీ వేంకటగిరినుండి ఈ నల్లబల్లి వచ్చి నన్ను, ఎలమి (సంతోషముతో) తమకించకు (తొందరపెట్టకు). నీకు ఒక నమస్కారం పెడతాను. నీతో నేను వేగలేనయ్యా చెన్నకేశవా!

సంపుటి : 7 కీర్తన : ఏల చెప్పేవు నీ సుద్దులు ఎందాకా మాతోను
సంఖ్య : 207 పుట : 126 - రాగం : బౌళి

60. ఏల చెప్పేవు నీ సుద్దులు యెందాఁకా మాతోను
పాలు మాలకింతలోనే బమ్మచారివైతివి ॥పల్లవి॥

ఎలమి గొల్లెతలను యెన్నాళ్ళు పొంది పొంది
తొలఁగి మధురలోన దొరవైతివి
కొలఁది ఆవులఁగాచి గొల్లవాఁడవై యుండి
వలవంత నేఁడు రాచవాఁడవైతివి ॥ఏల॥

వేడుకలకింటింట వెన్నదొంగిలి నేఁడు
ఆడ ద్వారకలో సోమయాజివైతివి
వోడక రుక్మిణీదేవినూరకే యెత్తుకవచ్చి
పాడితోనగ్రపూజకు పాత్రుఁడవైతవి ॥ఏల॥

రక్కసుల కాఁవురాలు రచ్చలకెక్కఁ జెరచి
పెక్కు ధర్మాలు నిలిపి పెద్దవైతివి
చిక్కువాసి నన్నుఁగూడి శ్రీ వేంకటాద్రిమీఁద
దిక్కుల నిందరిపాలి దేవరవునైతివి. ॥ఏల॥

**ఉపోద్ఘాతము :**

ఓ దేవదేవా! నీ కథలు యెన్నని యెంతని చెప్పెదనయ్యా! అని శ్రీ కృష్ణపరమాత్మ అయిన శ్రీ వేంకటేశ్వరునితో చెబుతున్నారు అన్నమయ్య! పరీక్షిత్తు మృతశిశువుగా జన్మించాడు. అస్ఖలిత బ్రహ్మచారి ఆ బిడ్డనెత్తుకుంటే తిరిగి జీవిస్తాడన్నాడు వ్యాసుడు. భీష్ముడు కూడా తనకా 'అర్హత' లేదన్నాడు. శ్రీ కృష్ణుడు ఎత్తుకొంటే కేరుకేరుమని





బిడ్డ ఏడ్చాడు. ఈయన బ్రహ్మచారా!! అని నాబోటివాళ్ళు నోరు వెళ్లబెట్టారు. అన్నమయ్య ఈ కీర్తనే అందుకున్నాడు. మరి ఈ వేంకట కృష్ణుని లీల వినండి.

**తాత్పర్యము :**

ఓ దేవదేవా! నీ సుద్దులు (కథలు) మాతోను యెందాక చెప్పేవు? ఇంతలోనే పాలుమాలకి (పొరబాటున) బ్రహ్మచారివైపోయినావు. (ఈ గొల్లెతలు-నీ అష్ట భార్యలు-పదియారు వేలమంది రాచకన్నెలు... వీరి సంగతేమిటి?)

ఎలమి (సంతోషముతో) నందవ్రజములోని గొల్లెతలందరిని యెన్నాళ్ళు రమించావు? అక్కడనుంచి తొలగిపోయి మధురకు ఏలికవైనావు. కొలది (కొన్ని) ఆవులను రేపల్లెలో కాచుకొనేవాడివి నేడు వలవంత (విరహము) నిచ్చే రాచబిడ్డవైనావు.

వేడుకలకు (అవసరం లేకపోయినా సరదాకి) ఇంటింటికీ పోయి వెన్నను దొంగిలించావు. ఆడ (అక్కడ) ద్వారకానగరంలో సోమయాజివైతివి (యజ్ఞములు నిర్వహించిన యజ్ఞనారాయణుడవైనావు). ఓడక (ఓటమినెరుగక) ఊరకనే రుక్మిణీ దేవిని యెత్తుకొని వచ్చినవాడివి, పాడితో (సగౌరవంగా) రాజసూయ యాగానంతరం అగ్రపూజకు అర్హుడవైనావు.

అనేకమంది రాక్షసుల కండకావరాన్ని బజారుకీడ్చి చెరిచావు. ఆర్షధర్మాన్ని నిలబెట్టి పెద్దవైతివి, (సర్వాధికుడవుయైనావు). నేడు చిక్కువాసి (సంకటములన్నీ తీరి) శ్రీ వేంకటగిరిపైన నన్ను కలిసి ఇంతమంది పాలిటి దిక్కువై, దేవుడవై అనుగ్రహించుచున్నావు. "అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ".

సంపుటి : 7 కీర్తన : తనకు నాకు నెప్పడు తగులేకదే
సంఖ్య : 562 పుట : 344 - రాగం : పాడి

61. తనకు నాకు నెప్పుడు తగులేకదే
మనసు మర్మమునకు మందిదే కదే ॥పల్లవి॥

మొక్కలాన నటు చను మొనలు నే మోపితేనే
వెక్కసీఁడు తనకిఁక వెరపేఁటికే
జక్కవపిట్టలు నావి జవ్వన వనమె తాను
యెక్కడపోవును వాని కిరవే కదే ॥తనకు॥

సంతోసపుఁ జూపులచక్కెర నేఁజల్లితేను
పంతగాఁడు తానేల భ్రమసీనే
కంతువిండ్లు నా బొమలు గవిశన తనమేను
పొంతనెంచి చూచుకొంటే పొందులే కదే ॥తనకు॥

బలిమి కాఁగిటఁ దనపైఁ జేతుల వేసితేను
యెలమి శ్రీ వెంటేశుఁడేల నవ్వీనే
జలజములివి నావి సరవిఁ బూజ తనది
నిలుకడలకు నివి నిజమే కదే ॥తనకు॥

**ఉపోద్ఘాతము :**

ఈ కీర్తనలో పదములను కూర్చుకొని అర్థం సమన్వయం చేసుకొనవలెను. లేకుంటే ఒక పట్టాన అర్థం కాదు. అలమేల్మంగ తన చెలికత్తెతో (అన్నమయ్యతో) తనకి (శ్రీవారికి) నాకు (దేవికి) ఎప్పుడూ పోట్లాటేకదుటే! అంటున్నది. నా మనసులోని





మర్మమునకు మంచిదేకదా! అంటున్నది. కవి హృదయం అంత తేలికగా అర్థంకావటం లేదు. బాగుగా అనుసంధానించాక నాకు తట్టిన భావము వివరిస్తున్నాను. ఆచార్యుల వారి ఆలోచన వేరయితే... అది నా మట్టిబుఱ్ఱకి తట్టలేదని నిట్టూర్చటం తప్ప నేను చేయగలిగిందేముంది?

**తాత్పర్యము :**

ఓ చెలీ! తనకూ నాకూ యెప్పుడూ తగులే (ఒకరితో ఇంకొకరికి పోటీ) కదుటే! నా మనసులోని మర్మము (దాగినమాట) నీకు చెప్పుకుంటాను. అది మంచిదే కదే!

నేను మొక్కలాన (కొంటెతనముతో) నా స్తనాగ్రములను ఆయనపై మోపుతాను. ఆయన వెక్కసీడు (ధీరుడు) కదా! తనకు వెరపేటికి (జంకెందుకు)? నావి (నా కుచములు) జక్కువ పిట్టలు, ఆయన యౌవనమే సాకారమైన వనము. మరి ఆ జక్కువ పిట్టలు ఆయన దగ్గరకు పోక యెక్కడికి పోతాయి? ఆయనే వాటికి ఇరవు (గమ్యస్థానము)

సరే! నేను ఆయనను చూచినాననే సంతోషంతో,నా చూపులు అను చక్కెర జల్లు కురిపించాను. అంతమాత్రాన అంత పట్టుదల గల ఆయన భ్రమపడుట యెందుకో, మరి? పోనీ.. నా కనుబొమ్మలు 'కంతువిండ్లు' (మన్మథుని విల్లులే) అను కొందాము. మరి నల్లని ఆయన మేను (శరీరము), గవిశన (విల్లంబులు దాచియుంచు చీకటి కొట్టు) వలె యున్నది కదా! పొంతన (పోలిక) చూచుకొంటే సరిపోయింది కదా!

తన గాఢ పరిష్వంగములో నేను వివశురాలనై ఆయన పై చేతులు వేస్తే ఈ శ్రీ వేంకటేశ్వరుదు కొంటెగా ఎందుకు నవ్వుతాడే? నావి (నా చేతులు) ఇవి... జలజములు (తామరపూలు) వాటి ఉపయోగమేమిటి? ఆయన పూజకి కాకపోతే అవెందుకు? నిలుకడలకున్ (వాటి ఉనికియే) ఆయనకదా! ఇది నిజమే కదా!

సంపుటి : 5 కీర్తన : చిన్ననాడు మద్దులు వంచిన వాడుతా
సంఖ్య : 156 పుట : 106 - రాగం : ముఖారి

62. చిన్ననాఁడు మద్దులు వంచినవాఁడు తా
నున్నవాఁడే యిపుడు నాయెదయఁడై నేఁడు ॥పల్లవి॥

గోవులఁ గాచినవాఁడు గొల్లెతల మేనిగబ్బుఁ
దావుల పెనుభ్రమలఁదగులువాఁడు
కోవిదుఁడెట్లనాయఁ గోమలులఁబదియారు
వేవురను వలపించే వెరవరెట్టాయెనే ॥చిన్న॥

వెన్నలారగించువాఁడు విడువక వెకలియై
కన్నచోనే తిరిగేటి గద్దరీఁడు
వన్నెకాఁడెట్టానాయపడి గోపవనితల
నెన్నరాని చేఁతలెల్ల నెట్టు సేసినాఁడే ॥చిన్న॥

కొండలెక్కి దాఁటువాఁడు కొండమోచునట్టివాఁడు
కొండలే నెలవుగాఁ గైకొన్నవాఁడు
కొండుక సాయపువాఁడు గుబ్బురైన తిరుమల
కొండమీఁద నెలకొన్న కోనేటివాఁడు. ॥చిన్న॥

**ఉపోద్ఘాతము :**

బాలకృష్ణునిపై మధురమైన కీర్తన చెబుతున్నారు అన్నమయ్య. బాలునిగా నున్నప్పుడే తనను కట్టేసిన ఱోటిని రెండు మద్దివృక్షాల మధ్యగుండా ఈడ్చుకొని వెళ్ళి ఆ మద్దులను గూల్చి మద్దుల వలెనున్న నలకూబరునికి మణికంధరుడికి (కుబేరుని కొడుకులు) శాపవిమోచనం కలిగించినవాడు ఆ దేవదేవుడు. అట్టున్నవాడు ఇప్పుడు నాయెదయడై వున్నాడంటున్నారు. కొండలెక్కి దాటినవాడు,





కొండమోచినవాడు కొందుకపాయపువాడు, తిరుమలకొండమీద కోనేటివాడట. అంటే యేమిటో తెలిసీ తెలియనట్లుగా వుంది కదా! ఇంతకీ ఒడయడు అంటే ప్రియుడని అర్థం. కొండలే నెలవైన వాడట, యెవరో తెలుసా? ఇటువంటి కీర్తనలను తక్కువ అంచనా వేయకూడదు.. మరి.

**తాత్పర్యము :**

చిన్ననాడే (పారాడే బాలునిగా వున్నప్పుడే) రెండు మద్దిచెట్లను వంచిన (మద్దిచెట్ల మధ్యలో ఱోలును లాగుటవలన అవి వంగి విరిగిపోయినవి అని భావము) వాడు, నేడు (యిపుడు) నా యెదయడై (నామగడై) తాను యెదుటనే వున్నాడు.

ఈ చిన్నవాడెటువంటివాడంటే.. రేపల్లెలో గోవులు కాచినవాడు. గొల్లభామల వంటిపై నుండి వచ్చే 'గొల్లకంపు'పై గొప్ప భ్రమతోనుండేవాడు. అట్టివాడు గొప్ప పండితుడెట్లయినాడే? పదియారువేలమంది కోమలులైన రాచకన్నెలను యెట్లు వలపించుకొని పెండ్లియాడినట్టి, వెరవరి (జీవనదాత) యెట్లాయెను? గొప్ప ఆశ్చర్యముగానున్నది.

దొంగతనంగా వెన్నలారగించిన ఈ అల్లరి పిల్లాడు నేడు వెకలియై (వ్యామోహితుడై) కన్నెలవెన్నంటి తిరిగే దగ్గరీడు (గడుగ్గాయి). నేడు మనం చూస్తుండగానే వన్నెకాడు (అందాలయువకుడు) ఎట్లయ్యాడు? గోపికలతో చెప్పరాని చిలిపి చేష్టలెట్లు చేయుచున్నాడే?

ఇంకా చెప్పాలంటే వీడు, కొండలరాయడు. (ఆంధ్రదేశంలో కొండలరావు పేరు ఈయనదే) ఈయనేం చేశాడో తెలుసునా? కొండలెక్కి దాటుకొంటూ గోవులను కాశాడు. కొండను యెత్తినవాడు (గోవర్ధనగిరిని చిటికెన వ్రేలిపై యెత్తినవాడు) కొండలే నెలవుగా (వాసముగా) గైకొన్నవాడు (నృసింహమూర్తి), కొండుక పాయమువాడు (కోడెవయసు చిన్నవాడు). నేడు గుబురైన (దట్టమైన) తిరుమలకొండపై ఆవాసమైయున్న కోనేటిరాయుడైన శ్రీవేంకటేశ్వరుడైయున్నాడు.

సంపుటి : 5 కీర్తన : వలపు నిలుపలేని వారమునేమటుగాన

సంఖ్య : 77 పుట : 53 - రాగం : ఆహిరి

**63.** **వలపు నిలుపలేని వారము నేమటుగాన**
**పలుమారుఁ బట్టుకొన్నఁ బయికొనవేలరా ॥పల్లవి॥**

**ఒత్తి నీవాడినమాటకోరువఁ జాలక నే-**
**ముత్తరమిత్తుము గాని ఊరకుండలేమురా**
**బత్తి గొట్టానఁ బెట్టఁగఁ బనిలేదు వోరి నీ-**
**చిత్తమింతేకాని యిఁకఁ జెప్పనేమున్నదిరా ॥వలపు॥**

**కాఁకలఁ బెరిగినట్టి కళవళమున నిన్నుఁ**
**దాఁకనాడుదుము గాని తడవుండలేమురా**
**యేఁకటఁ జెందినయట్టి యింతుల మాటకు నీవు**
**సోఁకోరువవలెఁ గాక చురుకనరాదురా ॥వలపు॥**

**సారెకు నీవెడసిన సైఁచలేము నీవు**
**చేరువనలిగి మమ్ముఁ జేకొనవేరా**
**ధీరుఁడవు కోనేటితిరువెంకటేశ నన్ను**
**గారవించి యిట్లానే కరుణించఁగదరా ॥వలపు॥**

**ఉపోద్ఘాతము :**

శృంగారరాయని వలచిన నేరానికి ఆయనని యెంతో బ్రతిమిలాడవలసి వస్తున్నది. అన్నమయ్య తానే నాయికయై ఆ తిరుమలేశుని యెంత బ్రతిమిలాడు తున్నారో చూడండి. మేము వలపు నిలుపలేని వారము. ఎన్నో పర్యాయములు పట్టుకొని నీపైకి లాగుకొంటే మేము చేయగలిగిందేముంది? అట్లు పైకొనవేలరా అని ప్రశ్నిస్తున్నారు.





ప్రణయ కోపంలో తాపమెక్కిన నాయిక 'రా' కొట్టినా తప్పు పట్టవలసిన పనిలేదు. అందరూ చేసేదదే. అంతా అయ్యాక.. ఆగ్రహం చల్లబడినాక తనను ఇట్టానే కరుణించగదరా! అంటున్నారు.

**తాత్పర్యము :**

ఓ రాయడా! మేము నిన్ను వలచిన వారమేగాక వలపు నిలువరించలేని వారముకూడా. అందుచేత మమ్మల్ని అనేకమార్లు పట్టుకొని పైకొనవేలరా (ఆక్రమించుకోవేమి?)

ప్రభూ! నిస్సంకోచంగా మరీ మరీ ఒత్తి నీవు అనిన మాటలకోర్వలేక ప్రత్యుత్తరము యిచ్చాము. నిజమే. ఊరకవుండిపోలేదు. అంతమాత్రాన మా బత్తి (భక్తిని) గొట్టానబెట్టగ బనిలేదు (న్యాయపరీక్షకు పెట్టవలసిన పనిలేదు). ఓరీ! నీ చిత్తము ఇంతేననుకొని యుందుము. ఇంకా చేప్పేది యేమున్నదిరా?

ప్రభూ! నీ ప్రవర్తనకు 'కాకలు పెరిగి' (మేము ఆగ్రహించి) కళవళమున (చికాకుజెంది) నిన్నున్ తాకన్ ఆడుదుము (నొప్పించెదము). ఊరకనే వుండలేము కదా! ఏకటజెందిన (నీరాకకోసం మొఖము వాచిన) ఆడది యేదో కోపం పట్టలేక నాలుగుమాటలంటే... నీవు సోకోరువవలె (కాసేపు ఓర్చుకోవాలి). అంతేకాని చురుకనరాదురా ( మళ్ళీ కోపంతోనే చురుక్కుమని నొప్పించరాదు). అన్నీ తెలిసిన నీకు చెప్పేదేముందిరా!

ప్రభూ! నీవు మాపై వెడసిన (ఆగ్రహించిన) సైచలేము (ఓర్వలేమయ్యా!) మాకు దగ్గరయై చేకొనవేమయ్యా! నీవు ధైర్యముగలవాడవు. తిరుమలలోని కోనేటిరాయడవు (శ్రీవేంకటేశ్వరుడవు). ఇట్లానే (ఇదే మాదిరిగా) నన్ను గారవించి (మన్నించి) కరుణించగదరా!

సంపుటి : 5 కీర్తన : పేగుల జంద్యాలు వేసి పెంచపునమలిపురి

సంఖ్య : 254 పుట : 173 - రాగం : కాంభోది

**64.** **పేగుల జంద్యాలు వేసి పెంచపునమలిపురి**
**పాగగాఁ జుట్టిన నాబాఁపనయ్య వీఁడివో** ॥పల్లవి॥

**బిత్తలై పరువులిడి పిన్నబోడితలతోడ**
**కొత్తబొమ్మచారియై గోచిగట్టెను**
**నెత్తురుదానమునేసి నిండిన జడలతోడ**
**బత్తుఁడైన చక్కని నాబాఁపనయ్య వీఁడివో** ॥పేగు॥

**కఱవిద్యబాఁపనిచేఁ గఱచె నేరుపులెల్ల**
**గుఱుతుబాఁపనిఁ గనెఁ గొడుకుఁగాను**
**తఱితోడ సందెపొద్దు దప్పనీక జలధిలోఁ**
**బఱపుగాఁ బండిన నాబాఁపనయ్య వీఁడివో** ॥పేగు॥

**పచ్చియిఱ్ఱి తోలుచొచ్చి బడలి చొరనిచోటు**
**చొచ్చి తెచ్చె వేదాలు చూడరమ్మా**
**మచ్చిక వేంకటగిరి మరిగి నాకౌఁగిట**
**పచ్చనిదోవతి నాబాపనయ్య వీఁడివో.**

### ఉపోద్ఘాతము :

అచ్చతెలుగులో నారాయణుని వైభవాన్ని వర్ణిస్తే మనబోటి తెలుగువారికి కొరుకుడు పడదని ఇట్లాంటికీర్తనలు చెప్పి అన్నమయ్య మరొక్కమారు నిరూపిస్తున్నారు. బాపనయ్య అంటే బ్రాహ్మణుడు అని అర్థం. అసలు పుట్టుకే లేని ఆది దేవుడికి కులమేమిటి? అందుకని 'ఆర్యుడు' అని భావించాలి. మరి ఈ బాపనయ్య వేదాలు చదివాడు, శస్త్రాస్త్ర విద్యలు నేర్చాడు, చేయిజాచి యాచించాడు, ధర్మరక్షకుడైనాడు, శత్రువుని చంపి వాడిపేగులు జంద్యాలుగా వేసుకొన్నాడు, నెమలి పింఛం





తలపాగావలె చుట్టి అలంకరించుకొన్నాడు. వీడివో నా బాపనయ్య పచ్చని దోవతివాడు అంటున్నారు.బాగుగా ఆలోచిస్తేనే అర్థమవుతుంది. ఇది దశావతారలీలలను వర్ణించే కీర్తన అని అర్థమయింది అప్పుడు.

### తాత్పర్యము :

ఓ భక్తులారా! నా బాపనయ్యను చూచినారా? వీడివో (ఇదిగోవీడే), పేగులను (హిరణ్యకశిపుని పేగులను) జంద్యాలుగా వేసికొనినాడు(నృసింహుడు). పెంచపు నమలిపురి(నెమలి పింఛమును) పాగగా (శిరసున అలంకారముగా) చుట్టుకొనినాడు.

“కొత్తబొమ్మచారియై గోచిగట్టెను” (నూతన వటుడై గోచీ పెట్టుకొని బలిచక్రవర్తిని యాచించాడు) గుండు వున్న ఈ చిన్న వాడి, “బత్తలై ” (నగ్నముగా) పరువువిడినాడు (బుద్ధుడు). నెత్తుటిలో తానముసేసిన (స్నానమాడిన) ఇతడు జటాజూటము ధరించి చక్కని బత్తుడై (ముని అయ్యాడు) (పరశురాముడు). అటువంటి బాపనయ్యవీడు.

ఇతడు కఱవిద్య బాపనిచే (శస్త్రాస్త్ర విద్యలు నేర్చిన విశ్వామిత్రుని వద్ద) సకల విద్యలను నేర్చిన వాడితడు (శ్రీరామచంద్రుడు). ఈ బాపనయ్య గురుతుబాపనిగనె కొడుకుగా (మన్మథుని అవతారమైన ప్రద్యుమ్నుని కన్న శ్రీ కృష్ణుడు). “తఱితోడ సందెపొద్దు దప్పనీక జలధిలో బఱపుగా బండిన బాపనయ్య” సృష్ట్యాదియైన పగటివేళ, సృష్ట్యంతమైన పెనుచీకటిలోనూ నీరధిలో బవ్వళించి యోగనిద్రనున్న శ్రీమన్నారాయణుడు ఈ బాపనయ్య.

(పచ్చి యిఱ్ఱి అంటే కిశోర ప్రాయంలో ఒంటిపై మచ్చలున్న లేడిపిల్ల అని అర్థం. కానీ అన్నమయ్య ఈ మాటకి ఒంటిపై పొలుసులున్న చేపగా భావించినట్లు నేను అనుకొంటున్నాను). పొలుసులు గల మత్స్యరూపియై చొరలేని చోటైన సముద్ర గర్భంలోకి చొచ్చి సోమకాసురుని జంపి వేదములను దెచ్చి జగతి నుద్ధరించిన ఈ దేవదేవుని చూడరమ్మా! ఇప్పుడు శ్రీ వేంకటగిరిపై నాకు (అలమేల్మంగకు, లేదా, అన్నమయ్యకు) మచ్చికయై నా కౌగిలిలో మరిగి (ఆశించి), ఈ బాపనయ్య పచ్చని దోవతి గట్టినవాడు (పీతాంబరధరుడు).

సంపుటి : 5 కీర్తన : లంజకాడవౌదువురా నీలాగులెల్లగానవచ్చే
సంఖ్య : 84 పుట : 58 - రాగం : ఆహిరి

**65.** లంజకాఁడవౌదువురా
లంజకాడవౌదువు నీలాగులెల్లఁ గానవచ్చె
ముంజేతఁ బెట్టిన సొమ్ములకద్దమేలరా ॥పల్లవి॥

కొంకక యెవ్వతో కాని కోరి నీ బుజము మీఁద
కంకణాల చేయి వేసి కౌఁగిలించఁ బోలును
వంకలైన వొత్తులెల్ల వడిఁగానవచ్చె నింక
బొంక నేమిటికిరా నీ బూమెలెల్లఁ గంటిమి ॥లంజ॥

ఒద్దిక నెవ్వతో గాని వోరి నీవురము మీఁద
నిద్దిరించఁ గంటమాల నీలములొత్తినది
తిద్దిన జాణవుగాన తిరిగి తిరిగి మాతో
బద్దనేఁటికిరా నేఁ బచ్చి సేయఁ జాలను ॥లంజ॥

వేడుక నెవ్వతో తిరువేంకటేశ్వర నిన్ను
కూడిన నీమేనితావి కొల్లవట్టుకొన్నది
తోడనె నా కౌఁగిటిలో దొరకొంటి విఁక నిన్ను
నాడ నేమిటికిరా నాయలపెల్లఁ దీరెను ॥లంజ॥

**ఉపోద్ఘాతము :**

'లంజ' అంటే వేశ్య అని అర్థం. లాగు అంటే ప్రేమ. వేశ్య చూపించే ప్రేమ నటనయేకాని నిజం కాదు. ఈ సత్యం ఎంత తేటతెల్లమంటే, మోచేతికి పెట్టుకొన్న ఆభరణాలు చూసి కొనుటకు ఎట్లు అద్దము అక్కరలేదో ఆ సత్యం తెలుసుకోవానికి పెద్ద తెలివి తేటలు అక్కరలేదు. "శ్రీ వేంకటేశ్వరా! నీ భుజాల మీదవున్న ఆమె





కంకణాల నొక్కుడు గుర్తులు, నీ వక్షస్థలం మీద ఇంకెవ్వతెవో కంఠహారం నొక్కుడుగుర్తులు కనబడుతూనే వున్నాయి". అన్ని విధాల దెప్పిపొడిచిన ఆ నాయిక చివరికి ఎలా సమాధానపడిందో తెలియాలంటే కీర్తన తాత్పర్యం చదవక తప్పదు. లేకపోతే మీతో నేనూ 'పచ్చి' అంతే...

**తాత్పర్యము :**

ఓ వేంకటేశ్వరా! నీవు లంజకాడవౌదువురా? (వేశ్యవలె వ్యవహరింతువా?) నీ ఈ దొంగ ప్రేమలు కానవచ్చె (పైకి తెలిసిపోతూనే వున్నాయి) ముంజేతికి (మణికట్టుకి మోచేతులకి) పెట్టుకొన్న ఆభరణాల అందం చూడాలంటే వేరే అద్దము కావాలా? (నీ వ్యవహారం గురించి వేరే ఇంకెవరో చెప్పవలెనా? నిన్ను చూస్తేనే తెలిసిపోతోంది).

జంకూగొంకూ లేకుండా యెవ్వతోకాని నీ భుజం చుట్టూ తన కంకణాల చేతులు వేసి బిగియార కౌగలించినట్టున్నది. వంకర టింకరగా నున్న ఆ నొక్కుళ్ళు పైకి కానవస్తూనే వున్నాయి కదా! బొంకనేమిటికిరా (అబద్ధాలు చెప్పటం దేనికిరా). నీ బూమెలెల్లా (వంచనలన్నీ) చూస్తూనే వున్నాము. ఇంకా మోసగించకు.

ఓరీ! యెవ్వతో గాని నీకు అతుక్కొని నీగుండెలమీద నిద్రించింది. అప్పుడు దాని కంఠహారంలోని నీలమణులు నీవురమును వొత్తినవి. నీవు తిద్దిన జాణవు (ఆరితేరిన నయగారివి). తిరిగి తిరిగి మాతో బద్దనేటికిరా (చీలిక లెందుకురా)? పోనీ నేను నీతో 'పచ్చి' సేయజాలను (నీతో నా అనుబంధం తెంచుకోలేను... యేం చేస్తాను?)

ఇదంతా ఒక యెత్తయితే, ఓ తిరువేంకటేశ్వరా! ఎవ్వతో ఇంకో అసాధ్యురాలు (ఇంకెవరు అమ్మ అలమేల్మంగ) ధైర్యంగా నీతో రమించినది. నీ అధరామృతం కొల్లగొట్టినది. ఇక నేను మాత్రం తక్కువా? నీవూ నన్ను నీ కౌగిటిలో ధరించితివి. ఇంక నిన్నునే ఆడనేమిటికి (మాటలనవలసిన పనేముంది?) నా అలపెల్లా తీరినది (నా అలసట తొలగిపోయినది. నేనెప్పటికీ నీదాననే...).

సంపుటి : 5 కీర్తన : ఏకాలమేది దనకెట్ల సుఖమైయుండు

సంఖ్య : 255 పుట : 174 - రాగం : సామంతం

**66.** ఏకాలమేది దనకెట్ల సుఖమైయుండు
నాకాలవశతఁ దానట్లుండవలసె ॥పల్లవి॥

బలువియోగాగ్ని దలఁపంగ నెట్టిదొకాని
చలిగాలి యెండనుచు జాలిఁ బడవలసె
వలరాజుకోపమెటువంటిదో పడఁతులకు
తలిరాకు చేఁదనుచుఁ దలపోయవలసె ॥ఏకా॥

భావంబు తలపోఁత బలిమెట్టిదోకాని
నోవి దోఁపనిచోట నొచ్చెననవలసె
ఈ విరహపరితాపమిఁకనెట్టిదో కాని
కోవిలల కూఁతలకుఁ గోపించవలసె ॥ఏకా॥

తిరువేంకటేశుకృప తియ్యమెట్టిదొ కాని
చిరునవ్వు మోవిపైఁ జెరలాడవలసె
సురత సౌభాగ్యముల సొంపులెట్టివొ కాని
మురిపెంపుఁ గనుచూపు ముయ్యఁగావలసె ॥ఏకా॥

**ఉపోద్ఘాతము :**

తన సంతోషమె స్వర్గము, తన దుఃఖమె సరకమంౡడు – అని పెద్దలన్నారు. సంతోషంతో వున్నవారికి యుగమొక క్షణంలాగాను, విరహతాపంలో వున్నవారికి క్షణం ఒక యుగంలాగాలను గడవటం సహజమే కదా! అదే చెబుతున్నారు





అన్నమయ్య. తనకు ఏ కాలమున ఎట్లు సుఖముంటుందో ఆ కాలానుగుణముగా అట్లే వుండవలసియున్నది. అంటే అప్పుడు చలిగాలి వేడిఅనిపించినా సహించి వూరడిల్లాలి. ఇదంతే అనుకోవాలి.

**తాత్పర్యము :**

ఓ వేంకటేశ్వరా! తనకు ఏ కాలమునకు ఎట్లు సుఖముంటుందో ఆ వ్యక్తి ఆ కాలానుగుణంగా (ఆ కాలానికి అనుకూలంగా) అట్లాగే వుండవలసియున్నది. కాలగమనం, మానసిక స్థితిని బట్టి మారుతుంటుంది.

తలపంగ (ఆలోచించిచూస్తే) బలమైన వియోగాగ్ని (నీ విరహ తాపము) యెట్టిదోకాని అదొక మాయ. దానితో తపించే వారు చల్లగాలిలో వున్నా మండే యెండలో వున్నట్లే. వారిపై జాలికలుగుతుంది. వలరాజు (మన్మథుని) ఆగ్రహమెటువంటిదంటే... తలిరాకు (లేత తమలపాకు) చేదుగా అనిపిస్తుంది.

భావంబు తలపోత (మనోవికారము కలిగినప్పుడు వేదించే ఆలోచన) బలమెట్టిదో చెప్పలేము. నోవి దోపని చోట (నొప్పి అనిపించనివే) నొచ్చుననవలసె (నొప్పిరాబాబూ! అని అనవలసి వస్తుంది). ఇక ఈ విరహ వేదన యెటువంటిదంటే... కోవిలల కూతలకు గోపించవలసె (కోకిల మధురంగా కూయని కూస్తుంటే వాటిపై విపరీతమైన కోపం వస్తుంది). అదే కాలమహిమ.

శ్రీ వేంకటేశ్వరుని కృపామృతము కలిగించే తియ్యము (తియ్యందనము) యెట్టిదంటే మనమోవిపై (పెదువులపై) చిరునవ్వు చెలరేగక తప్పదు. ఇక అనుభవేక వేద్యమైన విషయమేమంటే సురత సౌఖ్యము యొక్క సొంపులెట్టివోగాని, కనులను పారవశ్యమున మూయక తప్పదు... అదంతే...

సంపుటి : 5 కీర్తన : బండెదొక్కె బామునెక్కె బనులెల్లాదక్కె

సంఖ్య : 48 పుట : 33 - రాగం : లలిత

**67.** బండిదొక్కెఁ బాముసెక్కెఁ బనులెల్లాఁ దక్కె
ఆండఁ జిక్కె గోపికలకందరికి మొక్కె ॥పల్లవి॥

ఈతఁడు దొంగిలె వెన్న యీతఁడు నాకంటెఁ బిన్న
నేతఁ బాల నోలలాడె నిన్నమొన్న
పాతకపు రాకాసిపల్లెలు చూరలుగొన్న-
యేతరిపై నేరమి మాకేఁటికిఁక నెన్న ॥బండి॥

కూరిమినీతఁడు దొల్లి కొనగొనలనే తల్లి (?)
మారిపిళ్ళాడించెనే మారుదల్లి
ఆరుమూరు సేసి విద్యలందరికిఁ బారఁజల్లి
పారితెంచి వోలలాడెఁ బాలవెల్లి ॥బండి॥

ముచ్చువలె నిప్పుడుండె మూఁడులోకములు నిండె
రచ్చసేసెఁ జూడరే రాతిగుండె
తచ్చి తచ్చి వింటినారి దనుజులనెల్లాఁజెండె
పచ్చిదేర వేంకటాద్రి పానుపుగాఁ బండె ॥బండి॥

**ఉపోద్ఘాతము :**

శ్రీ కృష్ణలీలామృతాన్ని పునశ్చరణ జేస్తున్నారు అన్నమయ్య. ఈ కీర్తన నూరుసార్లు చదివినా నూటికి నూరుపాళ్ళు అన్నమయ్య మనోగతాన్ని విప్పి చెప్పటం సాధ్యమయ్యేపనికాదు.

నా వివరణే సరియైనది అనే దుస్సాహసం చేసే ధైర్యం నాకు లేదు. ఇది నాకు 'తట్టిన' భావము. ఆచార్యులవారి కొన్ని పదములకర్థం యే నిఘంటువులోనూ





దొరకదు. వాటిని తగినట్లు భావించాల్సిందే. "ముచ్చువలె నిప్పుడుండ..." అంటే... ఇప్పుడు దొంగవలె మూడు లోకాలలో నిండిపోయాడు అని అర్థం చెప్పుకొంటే... మనల్ని మనమే చెప్పుతో కొట్టుకోవాలి, అవునా... అందుకే యెప్పటికెయ్యది ప్రస్తుతమప్పటికామాటలాడి అన్నారు పెద్దలు.

**తాత్పర్యము :**

ఈ మహానుభావుడు చేసిన చేతలనేమని వర్ణింతును? బండిదొక్కె (శకటాసురుని సంహరించాడు), పామునెక్కె (కాళీయునిపై నెక్కి మర్ధించాడు), పనులెల్లా దక్కె (బృందావనంలో పనులన్నీ చక్కబడ్డాయి. గోపికలకు అండజిక్కె (ప్రియుడు దొరికాడు). ఆ తరువాత యెనిమిది పెళ్ళిళ్ళు చేసికొని పెద్దలందరికీ మొక్కి సంతోషపెట్టాడు.

ఇతడు వెన్నను దొంగిలించాడు, ఇతడు మా అందరికంటే చిన్నిపాపడు. కానీ నెయ్యిపాలు పారబోసి వాటిలో ఓలలాడినాడు. పాతకి పూతన పల్లెల్లో పాపాయిలను చంపివేస్తుంటే, ఆ ఏతరిపై (అన్యాయంచేసేదానిపై) చూరలు గొనినాడు. (పొడి పొడి చేసినాడు... అంటే.. పిప్పి చేశాడు.) ఇంకా వాడి నేరాల నెన్నడం యెంత తెలివి తక్కువపని? మాకేమిటికి?

కూరిమితో ఈ బాలుడు, తన కొనగొనలతో (లీల ప్రదర్శించి) తన మారుతల్లి (పెంచినతల్లియైన యశోదను) మారుపిళ్ళాడించె (కలయో వైష్ణవమాయో... అని అబ్బుర పడేట్లు చేసినాడు). విద్యలు (వేదములు) యెత్తుకెళ్ళిన, సోమకాసురుని ఆరుమూరుసేసి (నానా తిప్పలు పెట్టి) చంపి వాటిని దెచ్చి, మళ్ళీ పాల జలధిలో ఓలలాడినాడు.

ఇన్ని లీలలను చేసిన ఈ దేవదేవుడు, ఇప్పుడు ఈ వేంకటాద్రిపై ముచ్చువలె (దొంగవలె) ముల్లోకములలో ప్రసిద్ధుడై మా హృదయములను కొల్లగొట్టి, రాతిగ+ఉండె (విగ్రహం వలెనుండి) రచ్చసేసె (వడ్డీకాసులు గుంజుతున్నాడు), చూడరే (చూడండయ్యా), తన వింటినారిని మ్రోగిస్తూ వెదకి వెదకి దుష్ట శిక్షణ చేస్తున్నాడు. శ్రీ వేంకటాద్రిని పానుపుగా చేసికొని పచ్చిదేర (ప్రసిద్ధుడయ్యెను).

సంపుటి : 5 కీర్తన : చాలు జాలు నీతోడి సరసాలు

సంఖ్య : 364 పుట : 247 - రాగం : రామక్రియ

**68.** **చాలుఁ జాలు నీతోడి సరసాలు యిట్టె**
**పాలిండ్లకొంగుజారి బయటఁ బడితిమి ॥పల్లవి॥**

**సిగ్గువడితిమిర నీ చేసిన చేఁతలకు**
**నగ్గమైతిమిర మరునమ్ములకును**
**దగ్గరి నీకాఁకలఁ దగులఁబట్టి నేఁడు**
**బగ్గన నిందరిలోనఁ బలచనైతిమి ॥చాలు॥**

**నొగిలితిమిర నేము నోఁచిన నోములకు**
**పొగిలితిమిర నీ పొందులకును**
**తెగి నీవు నన్ను రతిఁదేలించి తేలించి నాకు**
**పగలు బిగువులెల్లఁ బచ్చిగాఁ జేసితివి ॥చాలు॥**

**దప్పిఁబడితిమిర నీతాలిములనే కడు**
**నొప్పిఁ బడితిమిర నీ నొక్కుఁజేతల**
**ఇప్పుడిట్టె తిరువేంకటేశుఁడ నీవు నా**
**కొప్పు సవరము దీసి కొల్లగొంటి మానము.**

**ఉపోద్ఘాతము :**

స్వామి ప్రవర్తనకు విసిగిపోయిన నాయిక, కసురుకుంటున్నది. అన్నమయ్య తానే నాయిక అయ్యారు. ఏదో పొరబాటున పాలిండ్లపై కొంగుజారిపోయి బయట పడ్డామే అనుకో, నీవు చిలిపి సేతలతో సరసములాడవలెనా? చాలు చాల్లేవయా నీ సరసాలు. "నీతాలిముల చేత కడు దప్పి బడితిమిరా" అని అంటున్నారు. నీ తెంపరితనము వలన మేము (నేను) యెంతో శ్రమపడ్డామయ్యా అని





విసుగుకొంటున్నారు. ఇవి అన్నమయ్య కాలంలో సర్వసాధారణ తెలుగుమాటలే అయినప్పటికీ నేటి నవీనకాలంలో నిఘంటువు అవసరమైన పరిస్థితి యేర్పడింది. ఆ సాహితీ సౌగంధిక వనంలో సౌరభాస్వాదన చేసి వీలయితే పదిమందిని చేయించి తరించాలనే నా ఆశ.

**తాత్పర్యము :**

ప్రభూ! నీతోడి సరసాలు చాల్చాలు లేవయ్యా! ఇలా మా పాలిండ్లపై కొంగు జారినందున బయటబడితిమి (అల్లరి పాలయ్యాము) అంతమాత్రాన నీవిట్లు చేయతగునా?

నీవు చేసిన చేతలకు (చిలిపి పనులకు) సిగ్గుపడ్డామయ్యా! మరునమ్మునకు (మన్మథుని బాణాల దెబ్బకు) అగ్గమైతిమిరా (లొంగిపోయాముర్రా). నేడు నీ చేరికచే కాకలము (తాపము) కలిగి, నలుగురిలో ఒక్కసారిగా పలుచనైపోయామయ్యా!

నీకోసం మేము యెన్ని నోములు నోచితిమి? యెంత నొగిలితిమి (బాధపడ్డాము)? నీ పొందులకు (చేరికకోసం) యెంత పొగిలితిమిరా? (పరితపించినాముర్రా?). తెగి (తెగించినవాడివై) నీవు నన్ను రతులలో దేలించి తేలించి నా బెట్టుసరిని సడలింపజేసినావు. నేనెట్లు నిన్ను నిరోధించగలను?

ఓ శ్రీ వేంకటేశ్వరా! నీ తాలిములచే (నీ తెంపరితనముచేత), కడు దప్పిబడితిమిరా (యెంతో శ్రమ పడ్డామయ్యా!) నీ నొక్కుజేత (నీవు అదుము కొనుటజేత) నొప్పిబడితిమిరా (నొప్పికూడా కలిగినది). ఇప్పుడు నీవు, ఇట్టే (అతి సులభముగా) నాకొప్పులోని సవరమును తీసివైచి నా మానమును కొల్లగొనినావు. (తరుణి కేశపాశమును సడలించి, సవరించగలిగినప్పుడు ఇక చేయనిది చేయలేనిది యేముందయ్యా శృంగార రాయా!)

సంపుటి : 12 కీర్తన : పెక్కుసతుల పెండ్లాడి బెరసిన వాడుతాను
సంఖ్య : 518 పుట : 297 - రాగం : రామక్రియ

**69.** పెక్కు సతులఁ బెండ్లాడి బెరసినవాఁడు తాను
వెక్కసము లెంతైనా వేసరకు మనవే ॥పల్లవి॥

మొలచిన తమకము మోసులువారకుండునా
కలసినవావులు కడ నుండునా
నలిరేఁగి సారె సారె నవ్వితిఁ దనతో నేను
వెలలేని వెన్నైనా వేసరకు మనవే ॥పెక్కు॥

చిగిరించిన వలపుచెట్టు కట్ట కుండునా
తగులైన పొందులు దాఁచవచ్చునా
అగపడి సరసము లాడితిఁ దనతో నేను
వెగటెంతైనా నాయ వేసరకు మనవే ॥పెక్కు॥

గుదిగొన్న ననుపులు కుప్పలు గాకుండునా
చెదర నీమోవితీపు చెప్పవచ్చునా
అదన శ్రీ వేంకటేశుఁడలమేల్మంగను నేను
వెదకివచ్చి నన్నేలె వేసరకు మనవే. ॥పెక్కు॥

**ఉపోద్ఘాతము :**

అలమేలుమంగమ్మ తన చెలికత్తెతో ఈ కీర్తన చెబుతున్నది. అన్నమయ్యే చెలికత్తె అవటంతో అది వినే భాగ్యం మనకి కలిగింది. లెక్కలేనంత మంది సతులను పెండ్లాడి పొందినవాడికి వెక్కసములెంతైనా వేసరకు మనవే అంటున్నదా తల్లి (యెంత గొప్పతనం వున్నా నన్ను అంత విసుగుకొనవద్దని చెప్పవే...). నేను అలమేల్మంగను. క్షీరసాగర కన్యకనైన నన్ను వెదకి మరీ నా స్వయంవరానికి వచ్చి నన్నేలినాడు. ఆయనకి క్షణం తీరికలేని మాటా నిజమే.. కాని వేసరకు మనవే అంటున్నదాతల్లి.





**తాత్పర్యము :**

పెక్కు సతులను (అసంఖ్యాకమైన కాంతలను) పెండ్లాడి ఆ శృంగారరాయుడు బెరసినాడు (విలసిల్లుచున్నాడు). తాను వెక్కసములెంతైనా (ఎంతజగన్నాథుడైనా)... వేసరకుమనవే (విసుగుకొనవద్దని చెప్పవే).

ఆ స్వామిని కూడా తప్పు పట్టుటకు వీల్లేదు లేవే... యెందుకంటే... ఒక్కసారి ఆయన యెవత్తెనన్నా ఇష్టపడితే.. తమకము (మైమరపు) వారికి కలుగుతుంది. అది మోసులు వారకుండునా (మొలక లెత్తదా?) ఒక్కసారి కలయిక జరిగాక అది కడనుండునా (ఒక చివర ఊరుకుంటుందా?) నేను కూడా అంతేకదా! మాటి మాటికి నలిరేగి (నలిగిపోయి) తనతో నవ్వితిని (పరాచికంగా మాట్లాడాను) అవన్నీ వెలలేనివి (అర్థం లేని చేతలు). ఆ మాత్రానికే వేసరకు మనవే (విసుక్కోవద్దని చెప్పవే)

అయినా నా పిచ్చిగానీ... వలపు చెట్టు (ప్రేమ అనే వృక్షము) ఒకసారి చిగురించాక 'మాను' అవకుండా వుంటుందా? ఒక్కసారి పొందులు మొదలయ్యాక ఆ వ్యవహారం దాగుతుందా? నేనూ అంతే కదా! తనతో నేనూ అగపడి సరసములాడితిని (కనబడేట్లు సరసమాడాను.) ఒకవేళ ఆయనకది వెగలాయెనేమో (రోతగా అనిపించిందేమో?) వేసరకుమనవే (చికాకు పడవద్దని చెప్పవే)

ఓ చెలియా! గుడిగొన్న ననుపులు (అతిశయించిన అనురాగము) కుప్పలుగాకుండునా (సమృద్ధిగాకుండా వుంటుందా?) అప్పుడు నీ అధరమెంత మధురమో మాటల్లో చెప్పవచ్చునా. కానీ.. నేను అలమేల్మంగను ఈ సమయంలో, ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు వెదకి వచ్చి క్షీరసాగరకన్యనైన నా స్వయంవరానికి వెదకివచ్చి... నన్ను చేపట్టి యేలుకొంటివి... నాకు యెదపై స్థానమిచ్చిన వానిని నేసరకుమనవే...

సంపుటి : 9 కీర్తన : కలదింతేమాట కంతునియాట

సంఖ్య : 16 పుట : 10 - రాగం : లలిత

70. కలదింతె మాఁట కంతుని యాఁట
తెలుసుకో నీలోనిదియె పూఁటపూఁట ॥పల్లవి॥

అలమేలుమంగా హరియంతరంగా
కలితనాట్యరంగ కరుణాపాంగ
చెలువుఁడు వీఁడె చేకొను నేఁడె
వలరాజుతూపులివి వాఁడిమీఁది (ద?) వాఁడి ॥కల॥

అలినీలవేణి యంబుజపాణి
వెలయంగ జగదేకవిభునిరాణి
కలయు నీ పతి వచ్చె గక్కన నిన్నిదె మెచ్చె
పలికీని చిలుకలు పచ్చి మీఁదఁబచ్చి ।కల॥

సితచంద్రవదనా సింగారసదనా
చతురదాడి మబీజచయరదనా
యితవైన శ్రీ వేంకటేశుఁడు నిన్నిదె కూడె
తతిఁ దలపోఁతలు తలకూడెఁ గూడె. ॥కల॥

**ఉపోద్ఘాతము :**

అమ్మవారి మీద మధురాతి మధురమైన కీర్తన వినిపిస్తున్నారు అన్నమయ్య. ఈ అలమేలుమంగ మరెవరో కాదు. శ్రీహరి అంతరంగమే జగదేక విభునికే రాణి అయిన ఆమె, పూట పూట ఇలా వేదనకు యెందుకు గురియవుతున్నది? తెలుసుకోవమ్మా! నీ మనస్సులోనిదే ఇదే ఆ మాటకలదు. ఇది అంతా ఆ కంతుని ఆట" (మన్మథుని మాయాజాలం). 'లలిత' రాగంలో తేనెలు జాలువారే ఈ కీర్తన





అర్థం చెప్పటం ఆషామాషీకాదంటే నన్ను నమ్మండి. "చతుర దాడిమ బీజ చయరదనా" అంటే యేమిటో తెలియాలంటే అంత తేలిక కాదు. తెలివితోపాటు గీర్వాణిలో మెలికలు తెలియాలి. లేకపోతే తాత్పర్యం చదవాలి. అది చదివి అన్నమయ్యని మెచ్చుకుంటూ.

**తాత్పర్యము :**

ఇంతే మాటకలదు. ఇది 'కంతునిఆట' (మన్మథలీల) తెలుసుకోతల్లీ! వాడు యెక్కడో లేడు. వాడు మనసిజుడు. నీ మనస్సులోనే వుంటాడు. పూట పూట నీ మనస్సును వేదనకు గురి చేస్తాడు.

ఓ అలమేలుమంగా! నీవు హరి అంతరంగవు. (ఆ శ్రీహరి హృదయంలోనే నివాసముగానున్నదానవు). నాట్యరంగంలో కలితవు (విఖ్యాతి చెందినదానవు). కరుణాపాంగవు (కరుణామూర్తివి). వీడే (ఈ వేంకటరమణుడే) నీ చెలువుడు (ప్రియుడు). ఆయన నేడే నిన్ను చేకొంటాడు. తప్పదమ్మా! యెందుకంటే.. వలరాజు తూపులివి మన్మథుని యొక్కు ఆ ఐదుబాణాలున్నాయే... అవి వాడిమీద వాడి (ఒకదానిని మించి ఇంకోటి పదునైనవి.

ఓ అలినీలవేణీ! (నల్లని తుమ్మెదలవంటి కేశపాశముకలదానా!) అంబుజపాణీ! (కమలహస్తా!) నీవు జగదేకవిభుడైన శ్రీ వేంకటేశ్వరుని రాణివి. నిన్ను కలియుటకై వచ్చిన నీపతి నిన్ను గక్కున మెచ్చె (వెంటనే బాగుబాగని మెచ్చుకొనినాడు). అప్పుడు నీ పెంపుడు చిలుకలకి కోపం వచ్చింది. అవి నీకు పచ్చిమీదపచ్చి చెప్పాయి (ఒకదాని తరువాత ఇంకొకటి నీ స్నేహం వుండమని 'పచ్చి' కొట్టాయి.

తల్లీ! నీవు సితచంద్రవదనవు (తెల్లని చంద్రునివంటి వదనము కలదానవు) సింగార సదనవు (శృంగారమునకు ఆవాసమైన దానవు), చతురదాడిమ బీజ చయరదనవు, చతురవు, దాడిమబీజ చయరదనవు (అనగా నేర్పరివి మరియు దానిమ్మ గింజలవంటి పలువరుసవున్నదానవు... అని అర్థం). ఇతవైన (హితుడైన) శ్రీ వేంకటేశ్వరుడు, ఇదే నిన్ను కూడినాడు. అతిశయించిన తలపోతలు (ఆయనమీద ఆలోచనలు) తలకూడెగూడె (కలిగినవి... కలిగినవి).

సంపుటి : 9 కీర్తన : కన్నులజూచేవు మాతో కందువమాటేడేవు

సంఖ్య : 174 పుట : 100 - రాగం : బౌళి

**71.** కన్ను లంc జూచేవు మాతో కందువ మాటలాడేవు
కొన్నదికోలు నీకిcక గోవిందరాజా ॥పల్లవి॥

పవ్వళించేయప్పుడూను పాదాలొత్తే వారిద్దరు
యివ్వల నే నీతో నవ్వ నేకతమేది
దవ్వుల నుండే మమ్ముc దడవేవు నీవొళ్ళ
కువ్వలాయ వలపులు గోవిందరాజా ॥కన్నుల॥

యిద్దిరి చే నిమ్మపండ(డ్ల?) వేమి సేయవచ్చు నిన్ను
అద్ది నీతో మాటలాడ ననువయ్యీనా
చద్దికి వేcడి కప్పటి జాణతనా లాడేవు
కొద్దిcబడవు పనులు గోవిందరాజా ॥కన్నుల॥

యిరుమొనసూదివి యెవ్వరివాcడ వందుము
దొరవై నన్ను c గూడితి తొల్లె నీవు
తరవాతి చేcతలెల్ల దక్కె నీకు నిందరిలో
గొరబై శ్రీ వెంకటాద్రి గోవిందరాజా. ॥కన్నుల॥

**ఉపోద్ఘాతము :**

గోవిందరాజస్వామి వారిపై అసంఖ్యాకమైన శృంగారకీర్తనలు చెప్పారు అన్నమయ్య. తిరుపతిలో ఆ స్వామి పవ్వళించి వుంటే శ్రీదేవి, భూదేవి ఆయన పాదాలు ఒత్తుతూ సపర్యలు చేస్తుంటారు. స్వామి, వారిద్దరి చేనిమ్మపండట) మొనసూదియట.. యేమి సేయవచ్చును అంటున్నారు. నేను అదే అంటున్నాను. ఏ నిఘంటువులోనూ వీటికి అర్థము దొరకదు. కొన్ని మాటలు లుప్తమైపోయాయి. కొన్ని రూపం మార్చుకొన్నాయి. "నీ వొళ్ళ కువ్వలాయ వలపులు" అంటే యెలా





చెప్పటం? అందుకనే... తింటేగాని రుచి, దిగితేకాని లోతు, అనుభవిస్తేగాని కష్టమూ తెలియదన్నారు పెద్దలు. అన్నమయ్య కూడా ఒక వలపు కత్తెయై ఈ కీర్తన పాడుతున్నారు. తెల్లవారుజామున నా భావనాకాశంలో తళుక్కుమని తటిల్లతల వలె అర్థాలు స్ఫురింపచేస్తాడు స్వామి. తరువాత వాటి అర్థం నాకూ తెలియదు. వేంకటరమణుడిపై ఆన.

**తాత్పర్యము :**

ఓ గోవిందరాజా! అరవిచ్చిన కన్నులతో మమ్ము చూచేవు. మాతో కందువ (చమత్కరిస్తూ) మాటలాడేవు. నీకిక 'కోలు'.. కొన్నది. (అంటే నీ కొలువు దీరినది అని అర్థం)

వారిద్దరూ శ్రీదేవి, భూదేవి) నీవు పవ్వళించేటప్పుడు నీ పాదాలు వొత్తేరు. ఇప్పుడు నీవు వారిద్దరినీ చూచి నీవు మర్మగర్భంగా నవ్వుతున్నావు. యేకతయేమి? (కారణమేమిటి)? దూరంనుంచే మమ్ము తడవేవు (స్పృశిస్తున్నావు) అందుచేత "నీవొళ్ళకువ్వలాయ వలపులు" (నీ ఒంట్లో ప్రేమ చెలరేగింది.) ఓ గోవిందరాజా! మాకూ అదే పరిస్థితి.

ఓ ప్రభూ! నీవు ఇద్దరికీ చేనిమ్మ పండువు. (నిమ్మకాయ అవసరం వుండని ఆడది వుంటుందా?) కాని నీవు చేతిలోనే వున్న నిమ్మ పండువు). ఏమిసేయవచ్చును (మేము చేయగలిగిందేముంది?) నీవు చద్దికి వేడికీ అప్పటి జాణతనాలాడేవు (రాత్రీ, పగలు అనే తేడాలేక... అప్పటికవసరమైన తెలివితేటలు ప్రదర్శిస్తావు). అది నీతో మాట్లాడ అనువయ్యీనా (చేతనవుతుందా?) ఓ గోవిందరాజా! పనులు కొద్దిబడవు (కుదరవు) నిన్ను సాధించలేమయ్యా!

ఓ స్వామీ! నీవు యిరుమొనసూదివి. (రెండు వైపులా 'మొన' వున్న సూదివి. ఎటువైపు నుంచైనా వుపమోగపడతావు. నన్ను (అన్నమయ్యను) నీవు తొల్లె (ఇదివరకే) దొరవై (నా యజమానివై) నన్ను చేబడితివి. ఇందరిలో నేడు గొరబై శ్రీ వేంకటాద్రి చేరితివి (కొలువై శ్రీ వేంకటగిరిపై కూడా చేరినావు). నీ తరవాతి చేతలెల్లా (అనుసరించేపనులన్నీ... అంటే... మావంటి దీనజనరక్షణ వంటి కార్యక్రమములు) నీకు దక్కెన్ (నీ బాధ్యతలయ్యాయి).

సంపుటి : 9 కీర్తన : ఎఱిగిన పనులకు నికనేటికి నీకు

సంఖ్య : 175 పుట : 101 - రాగం : హిజ్జిజి

**72.** ఎఱిఁగిన పనులకు నిఁకనేఁటికి నీకుఁ
దఱితో నవ్వేవారె తగు నింతేకాకా ॥పల్లవి॥

మగువలు వద్దనుంటె మఱతు వన్నిపనులు
తగిలి వెనకముందు తలపోసేవా
వెగటుగ నేము సేసే విన్నప మెందుకెక్కును
బగివాయకుండేవారి భాగ్య మింతేకాక ॥ఎరిగిన॥

కొంగువట్టి తీసితేనె గొబ్బున లోనౌదువు
పంగించిచెప్ప నీ కొక్కపాటి వున్నదా
పొంగి నీ బాసలు నేఁడు పొగడఁగ నేమున్నది
వుంగరపు వేలివారి వోపి కింతేకాక ॥ఎరిగిన॥

కాఁగలించి కూడితేనె కరఁగుదు వంతలోనె
దాఁగి పెనఁగఁగ నీకు తగవున్నదా
చేఁగదేరఁ గలసితి శ్రీ వేంకటేశ నన్ను
వీఁగక నిలుచువారి వెర వింతేకాకా. ॥ఎరిగిన॥

**ఉపోద్ఘాతము :**

వలచిన వనితలు తమ విభుని నిర్లక్ష్యాన్ని ఏమాత్రం సహించలేరు. ఈ కీర్తనలో స్వామిని వలచిన చిన్నదిగా మారిపోయిన అన్నమయ్య ఆయనను దెప్పిపొడుస్తున్నది. "నీవు చేసే పనులు యెవరికి తెలియదయ్యా? ఇంకా నీతో నాకేమిటి? నీకు పూసుకొని తిరుగుతూ నవ్వేవారుంటే చాలునీకు. ఇంతేకాక ఇంకేమిటి? అసలు నీకొక్కపాటి





యున్నదా?" అని ఉక్రోషం వెళ్ళగక్కుతున్నారు. స్వామికూడా ఈ కీర్తనలో నాయిక ఉడుకుమోతుతనానికి పకపక నవ్వి వుంటాడు. ఈ కీర్తన వివరించడం అనుకున్నంత తేలిక కాదని స్వామి కృపలేక సాధ్యమయ్యేపనికాదని నా పరిమితమతికి తట్టిన అభిప్రాయము.

**తాత్పర్యము :**

స్వామీ! నీవన్నీ మేమెరిగిన పనులే కదా! ఇక నేటికి (ఇంకెందుకు) నీకున్ తఱితో (అతుక్కుపోయి) నవ్వేవారు కాక నాబోటివారెందుకు నచ్చుతారు?

నీకు మగువలు దగ్గరుంటే చాలును. అన్నీ మరచిపోతావు. వెనుకా ముందూ చూసుకుంటావా? నేను వెగటున (విరసముతో) చేసే విన్నపముఎందుకు తలకెక్కుతుంది? నీబగివాయివారక (తోడు వదిలిపెట్టకుండా) వుండేవారిదే భాగ్యం. అంతగాక మరేమిటి?

నీవు కొంగుజారవేసే 'టక్కులాడికి' గొబ్బున లోనౌదువు (శీఘ్రముగా లొంగిపోతావు). నీకు పంగించి (భయపెట్టి) చెప్పేపాటి (దమ్ము) యెవ్వరికుంది? నీవు చెప్పే మాయ మాటలు, బాసలు నేడు పొగడటానికి యేమున్నది? ఉంగరపు వేలివారి (నీతో ఉంగరాలు తొడిగించుకొన్నవారి ఓపికకు జోహార్లు. మాకు అంత ఓపిక లేదు మహా ప్రభో! మమ్మల్ని మా గతికి వదిలేయవయ్యా!

ప్రభూ! నిన్ను కౌగలించి కలిసిన చాలును. అంతలోనే కఱగిపోతావు. నీకు అందక దాగికొని పెనగగ (నిరోధించగ) తగవున్నదా (తగినదేనా?) ఇక నిన్ను చేగదీర (చేవతో) కలిసినాను. ఓ శ్రీ వేంకటేశ్వరా! నేనంటే భయంలేని వారి, వెరవు (యుక్తి కుయుక్తి).. అంతే కదా! అంతకాక మరేమిటి స్వామీ!

సంపుటి : 9 కీర్తన : వినవమ్మ యశోద గోవింద కృష్ణుడు
సంఖ్య : 176 పుట : 100 - రాగం : దేసాక్షి

**73.** **వినవమ్మ యశోద గోవింద కృష్ణుఁడు**
**చెనకి యెన్ని పనులు చేసెనమ్మ కృష్ణుడు ॥పల్లవి॥**

**వుట్టులు దాఁ గొట్టఁగాను వువిదలు దిట్టఁగాను**
**అట్టాయ వీథులలో నుఱక కృష్ణుఁడు**
**పట్టినకోలల గొల్లపొఁజు లిరువంకరాఁగ**
**పట్టుకొన్న గొల్లెతల భ్రమయించీఁ గృష్ణుఁడు ॥వినవమ్మ॥**

**పాలు దనపైఁ గారఁగా పడఁతులు నవ్వఁగాను**
**గేలికి లోనాయను జంగిలి కృష్ణుఁడు**
**ఆలరి యెలుఁగులతో నడ్డమువచ్చినవారి**
**మేలపు చేఁతలు చేసి మెప్పించీఁ గృష్ణుఁడు ॥వినవమ్మ॥**

**యిండులు దాఁజొరఁగాను యింతులు పై కొనఁగాను**
**బండుకు లోనాయను గోపాలకృష్ణుఁడు**
**అండనె శ్రీవెంకటాద్రి నలమేలుమంగఁ గూడి**
**దుండగపుఁ జేఁతలనె దొరాయఁ గృష్ణుఁడు ॥వినవమ్మ॥**

**ఉపోద్ఘాతము :**

శ్రీ కృష్ణలీలామృతాన్ని ఆస్వాదింపచేస్తున్నారు అన్నమయ్య. గోపికలు యశోదకు శ్రీ కృష్ణుని అల్లరిని వినిపిస్తున్నారు. ఈ కీర్తనలో 'జంగిలి కృష్ణుడు" గేలికి లోనయ్యాడన్నారు. అంటే గోవులను కాచే కృష్ణయ్య నవ్వుల పాలయ్యాడట. బహుశా ఉట్టిపైన వున్నపాలు కాజేద్దామనుకొంటే... ఆ తొందరలోకుండపగిలి పాలతో తలతడిసిపోయి బిత్తరపోయాడేమో, అదిచూచి ఆడవాళ్ళంతా పకపక నవ్వారట.





పరమాత్మ యెందరిని యెన్ని విధాల నవ్విస్తాడో చూడండి. వేంకటాద్రి కృష్ణుడు మాత్రం తన దేవి అలమేల్మంగను కూడి తన దుండగంపు పనులు వదలి దొరాయె (లోకపాలకుడు అయ్యాడు) అంటున్నారు. ఇంకా చాలా మెలికలున్నాయి.

**తాత్పర్యము :**

ఓ యశోదమ్మా! మాగోడు వినవమ్మా! ఈ గోవిందకృష్ణుడు, చెనకి (యెవరిని పడితే వారిని యెదిరించి) యెన్ని పనులు చేసినాడమ్మా! ఆ వివరాలు వినవమ్మా!

మీవాడు తమ వుట్లు పగులగొడితే గోపికలందరూ వాణ్ణి తిట్టిపోశారు. వీధులలో అట్టాయె (నానా అల్లరి అయింది). మీ కృష్ణుడు వీధిలో వుఱకలు పెట్టి పారిపోయాడు. తనకిరు ప్రక్కలా గొల్లపిల్లల మూకను పెట్టుకొని చేతులలో కోలల (చిన్నచిన్న కఱ్ఱలను) పట్టుకొని, తనను పట్టుకొన్న గోపికలను భ్రమింపచేశాడు.పట్టుకొన్నా వాణ్ణి కొట్టబుద్ధికావటం లేదు.

ఒకచోట పాలు దొంగతనంగా త్రాగబోయాడు. ఆ గొడవలో పాలకుండ పగిలిందేమో.. పాలన్నీ మీ వాడి నెత్తిపై కారిపోయాయి. ఆడాళ్ళంతా గొల్లుమని నవ్వారు. వాళ్ళు మీ వాణ్ణి గేలి చేశారు. అట్లా గేలికి గురైనాడు. మీ జంగిలి కృష్ణుడు (గోవులను కాచుకొనే కృష్ణయ్య). ఆలరి యెలుగులతో (అల్లరి కేకలతో) యెవరు అడ్డం వస్తే వారిని మేలపు చేతల (పరాచికాలతో) తన మూకలను మెప్పించీ (మెచ్చుకొనునట్లు చేశాడు) మీ కృష్ణుడు. మీ వాడిని ఇంతులు (గోపికలు) పైకొనినారు (పైన బడి పట్టుకొన్నారు). గోపాలకృష్ణుడు బండుకు లోనాయెను (బండబూతు తిట్లకు లోనయ్యాడు). అక్కడనుంచి శ్రీ వేంకటాద్రి చేరుకొని అలమేల్మంగ కూటమిలో ఆ దుండగపు పనులు వదలివైచి వేంకటకృష్ణుడై లోకాలన్నింటికీ దొర(ఏలిక) అయినాడు.

సంపుటి : 9 కీర్తన : అంగనకు నీవె అఖిల సామ్రాజ్యము
సంఖ్య : 299 పుట : 172 - రాగం : గౌళ

**74.** అంగనకు నీవె అఖిల సామ్రాజ్యము
శ్రింగారరాయఁడ నీకు శ్రీసతినిధానము ॥పల్లవి॥

కమలాలపానుపు కాంతకు నీవురము
ప్రమదపు నీ మనసు పాలజలధి
అమరు నీభుజాంతర మట్టె తీగెపొదరిల్లు
రమణీయ (ప్ర)హారాలు రత్నాల మేడలు ॥అంగనకు॥

సతికి నీమెడ రతిసాము సేసేకంబము
ప్రతిలేని వయ్యాళి బయలు నీవు
మతించిన కౌస్తుభమణి నిలువుటద్దము
మితిలేని శ్రీవత్సము మించుబండారుముద్ర ॥అంగనకు॥

నెమ్మి నలమేల్ మంగ నీ కాఁగిలి పెండ్లిపీఁట
చిమ్ముల చందనచర్చ సేసపాలు
వుమ్మడి మెడనూళ్ళు వుయ్యాలసరపణులు
పమ్మి శ్రీ వెంకటేశ నీ భావమే భోగము. ॥అంగనకు॥

**ఉపోద్ఘాతము :**

నేడు మనం విస్తృతంగా వుపయోగించే కొన్ని మాటలు కొన్నాళ్ళు పోయాక వాడకంలో మరుగుపడి అర్థం తెలీని పదములవుతాయి. ఉదాహరణకు "పాళీ". మా చిన్నప్పుడు కలముతో వ్రాసేటప్పుడు "పాళీ" (Nib) విరిగేది. కలమును పారవేయకుండా 'పాళీ' ఒక్కటే మార్చుకొనేవాళ్ళం. ఇప్పుడా అగత్యంలేదు. నేటి పిల్లలకి 'పాళీ' అంటే యేమిటో తెలియదుకదా! అన్నమయ్య ఈ కీర్తనలో వాడిన





'బండారుముద్ర', 'వయ్యాళి', 'సేసపాలు', వుయ్యాలసరపణి... వంటి మాటలు కాల ప్రవాహంలో మరుగుపడిపోయాయి. కొంచెం శ్రమతీసుకుని అర్థం తెలిసికొంటే ఉపమాలంకార భూయిష్టమైన ఈ కీర్తన ఏడుకొండలవాడి 'All time favourite' కీర్తన అయివుంటుందన్న నా నమ్మకం వమ్ముకాదని మీకూ అనిపిస్తుంది.

**తాత్పర్యము :**

ఓ శృంగార రాయా! అంగనకు (అలమేల్మంగమ్మకు) నీవే సర్వంసహాసామ్రాజ్యము. ఆమే అప్రతిహత మహారాణి. ఇకపోతే ఆ శ్రీసతి నీకు నిధానము (పాతరలో దాచివుంచిన సంపద).

ఓ ప్రభూ! కాంతకు (ఆ శ్రీదేవికి) నీ వురము (ఎదురురొమ్ము) పద్మములు పేర్చిన పానుపు. ప్రమదపు నీ మనసు (సంతోషముతో నిండిన నీ మనస్సు) ఆమెకు పాలసముద్రమువంటిది. నీ భుజాంతరము (ఒడి), అదేవిధంగా లతలతో అల్లిన పొదరిల్లు. నీ మెడలోని ఎత్తైన హారములు ఆమెనివసించు రతనాల మేడలు. అందుకే నీవామెకు అఖి సామ్ర్యాజ్యమనుటలో అతిశయోక్తిలేదు.

ఓ శ్రీనివాసా! నీ సతికి నీ మెడయెటువంటిదో తెలియునా? రతిసాము (మన్మథ పెనగులాట) చేసే స్థంభము. ఇక నీవే ఆమెకు సాటిలేని వయ్యాళి బయలు (విహరించే మైదానము). మతించిన (అంచనా వేసినచో) నీ కౌస్తుభమణి ఆమెకు చక్కని నిలువుటద్దము. నీ వీపున నున్న మితిలేని (చెప్పనలవికాని) శ్రీ వత్సము అను పుట్టుమచ్చ ఆమెకు మించిన బండారుముద్ర (నేటి నవీన భాషలో చెప్పాలంటే (President's Stamp) అన్నమాట.)

ఓ శ్రీ వేంకటేశ్వరా! అలమేల్మంగమ్మకు నీ నెమ్మిన్ కౌగిలి (ప్రేమాస్పదమైన ఆలింగనము) ఒక పెండ్లిపీటవలె అలరారుచున్నది. నీమేనిపై నున్న చందన చర్చ (గంధపుపూత) చూచుటకు, చిమ్ముల సేసపాలు (దట్టముగా జల్లబడిన అక్షింతలకప్పు) వలెనున్నది. ఉమ్మడిగా ఇద్దరి మెడలో కట్టి మెడనూలు అను బంగారు తీగెల దండలు మీరిద్దరూ వూగుటక కట్టిన ఊయల సరపణులు (జంటతాళ్ళు) వలెనున్నవి. ఓ దేవదేవా! పమ్మిన (అతిశయించిన) నీ భావమే (స్వభావమే) ఒక గొప్ప వైభోగము.

సంపుటి : 9 కీర్తన : జలముల బాసిన జలజాప్తుని చే
సంఖ్య : 37 పుట : 22 - రాగం : హిజ్జిజి

**75.** జలములఁ బాసిన జలజాప్తునిచే
జలజము నొగిలిన 'చందంబాయ ॥పల్లవి॥

చక్కని యీపతి సతిఁ బెడఁబాసిన
వెక్కసపు మనసే వేఁడాయ
చెక్కు చేతితోఁ జింతించిన నది
అక్కట మదనుని యడిదంబాయ ॥జలములు॥

రమణి పతికడకు రాక నిలిచినా
తమి నిట్టూర్పులు దగులాయ
తమకంబున సతి దలపోయంగా
భ్రమసి చూచురెప్పలు నొప్పాయ ॥జలములు॥

యింతలో నిద్దరి కెడ మాటాడఁగ
అంతట వీనుల కాసాయ
యింతయు శ్రీ వెంకటేశ్వరుఁ గూడఁగ
యింతేసి యిందాఁక నేమేమోఆయ. ॥జలములు॥

**ఉపోద్ఘాతము :**

ఈ కీర్తన పల్లవిని చూడగానే "జలజములు నీటబాసిన.." అనే సుమతీశతక పద్యం గుర్తుకురాక మానదు. సూర్యుడు జలజములకు ప్రియుడే కాని ఒకసారి ఆ జలజము తన స్థావరమైన జలమును వదలగానే.. అతడే శత్రువై వాటిని (జలజములను) వాడిపోయేట్లు చేస్తాడు. అలాగే ఈ వేంకటరమణుడి కూటమి తనకి జీవరక్షయైనప్పటికీ ఈయన ఒకసారి తన యిల్లు వదలగానే ఆయనే (ఆయన ఆలోచనే) తపింపచేస్తున్నాడు... అని అంటున్నారు.





తన సతి వచ్చిందేమోననే భ్రమతో చూచీచూచీ పాపం స్వామి రెప్పలు నొప్పిపుట్టాయట. ఎంత అద్భుతం... గమిచంద్రనేత్రుడైన స్వామి గతే ఇట్లయితే మనబోటివారి గతి... యేమిటి?

**తాత్పర్యము :**

జలజాప్తునిచేత (సూర్యునిచేత) జలముల బాసిన జలజములు (నీటిని వదలిన పద్మాలు) ఒగిలిన (యెండిపోయిన) చందంబాయె (విధమునజరిగినది). ఆమెకు స్వామి యోచన ఇంతవరకు తన జీవనాధారమే, కాని అదే ఇప్పుడు తపింపజేస్తున్నది.

జగన్మోహనుడైన ఈ పతి, తనసతిని విడివడగానే... వెక్కసపు మనసే (దుస్సహమైన మనస్సుకూడా) వేడెక్కిపోయినది. తన చెక్కిలి పై చేయి జేర్చి ఆయననే చింతించుతున్నప్పటికీ.. అక్కటా! (అయ్యో!) అదే (ఆ చెయ్యే) మదనుని అడిదంబాయె (మన్మథుని కత్తివలె) తనని కోయుచున్నది. ఇక ఈవిడ పరిస్థితి ఇలావుంటే అక్కడ స్వామి యెలావున్నాడు? చూడండి మరి...

రమణి పతి కడకు రాక నిలిచినా... ఆమెపై అపేక్ష వలన నిట్టూర్పుల తగులాయె (తాకిడియెక్కువైనది). ఇక ఆయనకేమయిందో తెలుసా? తమకంబున (తన్మయత్వంతో) తనసతి గురించి తలపోయగానే... ఇదిగో వచ్చింది, అదిగో వచ్చిందని తన రెప్పలనెత్తి చూచీచూచీ పాపం... స్వామికి రెప్పలు నెప్పిపుడుతున్నాయి. భ్రమ స్వామినికూడా బాధిస్తున్నదికదా!

అమ్మయ్య! నిరీక్షణ అంతమైనది. ఇద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడుకొన్నారు. వారిచే వీనుల ఆకాంక్ష నెరవేరినది. ఆపైన చెప్పేదేమున్నది? ఒక్కసారి ఆమె శ్రీ వేంకటేశ్వరుని కూడగనే.. ఇందాకా, యింతేసి యేమేమో అయినది.

(అదేమిటో అరవిందాక్షునికే తెలియాలి, లేదా అన్నమయ్యకు తెలియాలి.... అమరవాదికి తెలియవు.)

సంపుటి : 9 కీర్తన : చేరి నీవు చెప్పినట్లు సేసితి నేనూ
సంఖ్య : 21 పుట : 13 - రాగం : మంగళకౌశిక

**76.** చేరి నీవు చెప్పినట్టు సేసితి నేనూ
వారివీరివలె మఱవకుమీ నన్నునూ ॥పల్లవి॥

జలధి దచ్చి లక్ష్మిని సంగడిఁ బెండ్లాడునాడు
అలరి రుక్మిణిఁ బెండ్లి ఆడెనాఁడు
సెలసువిల్లు విఱిచి సీతఁ బెండ్లియాడునాఁడు
పలికి బొంకనిమాఁటపట్టు నాకు నిమ్మీ ॥చేరి॥

సరుసఁ బదారువేలు సతులఁ బెండ్లాడునాఁడు
అరసి భూసతిఁ బెండ్లియాడు నాఁడు
పరగ రేపల్లె గోపభామలఁ బెండ్లాడునాఁడు
యిరవై యిచ్చినబాస యిమ్మీ నాకు ॥చేరి॥

అదె శ్రీ వెంకటపతి అలమేలుమంగ నిట్టె
అదన నీవు పెండ్లియాడునాడూ
యిదె నన్నుఁ గూడితివి యెక్కువగా మన్నించి
యెదుట నమ్మించినవి యెంచుమీ నాకు ॥చేరి॥

**ఉపోద్ఘాతము :**

"ఓ దేవదేవా! నీకు అనేకమంది భార్యలు, అనేకమంది ప్రియురాళ్ళు, నాలాగా నీకు బానిసవలె... చెప్పినట్లు చేసే పిచ్చి వలపుకత్తెలు కూడా అనేకులు వుండి వుండవచ్చును. నీవు వాళ్ళందరిని మరచిపోయావు. నన్ను కూడా అట్లాగే మరువకు ప్రభూ!" అని ఆ శ్రీవేంకటేశ్వరుని వేడుకొంటున్నది అన్నమయ్య భావనావనిలో పరిమళాలను వెదజల్లుతున్న నాయిక. "యెదుట నమ్మించినవి యెంచుమీ నాకు" అంటే యేమిటి? ఎక్కడో ఒకచోట మెలికపెట్టక వదలరు అన్నమయ్య.



ఏలుకో శృంగార రాయ

**తాత్పర్యము :**

ఓ తిరుమలేశా! నేను నీకు సర్వస్వం అర్పించిన వలపుకత్తెను. మనోవాక్ కర్మలా, నీవు చెప్పినట్లే చేశాను. తనంత తాను వలచి వచ్చిన దానిని మఱువని మగవాడుంటాడా? వారి సంగతినాకు యెందుకు? నీవు మాత్రం వారి, వీరివలె నన్ను మరువకుమీ.

స్వయంవరంలో ఆనాడు క్షీరసాగరమథనమున జనించిన లక్ష్మీదేవిని పెండ్లాడినావు. ద్వాపరయుగంలో రుక్మిణిని యెత్తుకొనిపోయి పెండ్లాడినావు. శివుని విల్లు విరిచి త్రేతాయుగంలో సీతాదేవిని వేదోక్తంగా పెండ్లాడినావు. నీవు పలికిబొంకని మాట పట్టులాడవు(సత్యవాక్పరిపాలనా దీక్షాదక్షుడవు). నాకును ఇమ్మీ... (నాకు కూడా మాట ఇయ్యవయ్యా!)

ఆనాడు నరకాసురుని చెఱనుంచి తప్పించిన పదారువేలమంది రాచకన్నెలను పెండ్లాడిన నాడు, అందరికీ సమానమైన సుఖమునిచ్చావు. నీవు కృతయుగంలో వరాహమూర్తివై భూదేవిని రక్షించి పెండ్లాడిన వాడవు. రేపల్లెలో గొల్లెతల నెల్లా పేరుపేరున పెండ్లాడి ప్రేమను నారి నారికీ ఒక హరివై పంచిననాడు యెన్ని "నాతిచరామి" బాసల చేసి వుంటావు? ఈనాడు నాకు కూడా ఒక్కటంటే ఒక్కబాస చేయరాదా?

కలియుగంలో నేడు శ్రీ వేంకటపతివై అలమేల్మంగను ఇట్లే పెండ్లాడుతూ కూడా... ఇదే నన్నునూ కూడినావు. ఇంతకంటే మన్నన (గౌరవం) ఏ ప్రాణి పొందగలదు స్వామీ! నేనే నీకు అందరికంటే యెక్కువని, యెదుట నమ్మించినావు (ప్రత్యక్షంగా నమ్మించినావు) మరి నన్నిక వదలక నాకు యెంచుమీ (నన్ను ఉన్నతురాలిగా భావించి ఆదరింపుము ప్రభూ!)

సంపుటి : 20　　　　కీర్తన : చెల్లునా నీకీ పనులు చెన్నకేశా
సంఖ్య : 50　　　　పుట: 34 - రాగం : ముఖారి

**77.** చెల్లునా నీ కీపనులు చెన్నకేశా

కొల్లకాఁడ వౌర గండిగోటచెన్న కేశా ॥పల్లవి॥

అంగవించి మగనాలి కాసపడే విందరిలోఁ
జెంగలింపుఁజూపులతోఁ జెన్నకేశ
రంగుమీర నిరువంక రమణు లిద్దరుండఁగా
అంగన లింకానా ఔరా చెన్నకేశా ॥చెల్లు॥

కమ్మటి మానవు మమ్ముఁ గరఁగించే వూరకైనా
చిమ్ముఁదేనెమాటలతోఁ జెన్నకేశ
దొమ్మిసేసి మగువల తొల్లె యాఱడిఁ బెట్టితి-
వమ్మరో నీకు వెరతుమౌర చెన్నకేశా ॥చెల్లు॥

వావి గద్దంటా నాతో వచ్చి వచ్చి నవ్వేవు
శ్రీ వేంకటాద్రిమీఁదఁ జేన్నకేశ
కావిమోవి గంటిసేసి కమ్మి నన్నుఁ గూడితివి
ఆవేళ నేమననైతి (నే మనసైతి?) చెన్నకేశా ॥చెల్లు॥

**ఉపోద్ఘాతము :**

గండికోట అనే గ్రామంలో వెలసిన చెన్నకేశవస్వామి పైన ఈ సరసశృంగార కీర్తన చెబుతున్నారు అన్నమయ్య. ఆయన కొల్లకాడట అంటే కొల్లగొట్టేవాడని అర్థం. ఓ చెన్నకేశవా! నీకీ పనులు చెల్లుతాయా అని అడుగుతున్నది నాయిక. నీకూ నాకూ





వావీవరుస (చుట్టరికము) వుందని నాకు దగ్గరై నవ్వుతావు నీవు శ్రీ వేంకటాద్రి చెన్నకేశుడవు. నీవు నన్ను కూడినప్పుదు నిన్ను ఆవేళ ఏమీ అననైతిని ఇప్పుడెన్ని అనుకొని లాభమేమిటి! బహుచక్కని శృంగార కీర్తన ఇది.

**తాత్పర్యము :**

ఓ చెన్నకేశవా! నీకు ఈ పనులు చెల్లునా (తగినవేనా)? ఔరా!! నీవు కొల్లకాడవు (కొల్లగొట్టేదొంగవు). నీవు గండికోటలో వెలసిన చెన్నకేశవుడవు.

ఇందరిలో (ఇంతమందిమి వుంటే) నువ్వు మగనాలికి (మగడున్న ఆడుదానికి) చెంగలింపు జూపులతో (ఆబగా చూస్తూ) అంగలించి (బాహాటంగా) ఆశపడుతున్నావు. చెన్నకేశవా! ఇదేమి న్యాయము? నీకు ఇరువైపులా రుక్మిణీ సత్యభామలున్నారు. రంగుమీరి (శోభస్కరంగా) ఆ ఇద్దరు గాక నీకు ఇంకా స్త్రీలు... అదీ పెళ్ళయినవాళ్ళు కావాలా? యెంత అన్యాయం. ఔరా! యెంత తెంపరివయ్యా చెన్నకేశవా?

స్వామీ! నువ్వు కమ్మటి (వుడికించటం) మానవు. మమ్మల్ని వూరకనే నీ తేనె చిమ్మే తీపి మాటలతో నన్ను కరగించివేస్తావు. ఔరా! చెన్నకేశవా! తొల్లె (ఆదిలోనే), నువ్వు మగువలను ఆరడిబెట్టి (అల్లరికి గురిచేసి) దొమ్మిసేసి (జులుము చేసి) ఏడిపిస్తావు. అమ్మరో!! (అమ్మో) నీవంటేమాకు భయం బాబూ!

శ్రీవేంకటాద్రిమీదనున్న చెన్నకేశవా! (శ్రీవేంకటేశ్వరా!) వావి కద్దంటూ (నీకు నాకు చుట్టరికం వున్నదని) నా దగ్గర చేరి మరీ మరీ నవ్వుతావు. కావి రంగు పెదవులనాక్రమించి గంటిసేసి (గాట్లు పెట్టి) నాతో రమిస్తావు. ఆ వేళ నీకు యెదురు చెప్పలేకపోయాను. ఓ చెన్నకేశవా! నేనేం చేయగలను? నేను నీ అధీనురాలను.

సంపుటి : 20 కీర్తన : అదె రాముడు సువేలాద్రిపై నిలిచె
సంఖ్య : 178 పుట : 119 - రాగం : సాళంగం

78. అదేరాముఁడు సువేలాద్రిపై నిలిచె
యెదిరితివి సీత యిఁక నేమమ్మా ॥పల్లవి॥

దనుజులు వారేరు తలఁకేరు లంకలో
వనజాప్తకులుఁడు వచ్చెనమ్మా
వినవచ్చెను కపివీరుల యార్పులు
వెనుకొని పవుఁజులు విడిసెనమ్మా ॥అదే॥

కదనములో కుంభకర్ణా (ర్ణ?)ది వీరులు
మదమున బయిపడి మడిసిరమ్మా
చిరుమఁగ రావణుచేతులుఁ దలలు
నిదులనెల్లా విన్ను నిండెనమ్మా ॥అదే॥

పతి విభీషణునిఁ బట్టముగట్టెనమ్మా
అతఁడు నిన్నుఁ బిలువనంపీనమ్మా
కతగా శ్రీవేంకటగిరిమీఁదను
యితవుగఁ గూడరొ యిపుదేమమ్మా ॥అదే॥

**ఉపోద్ఘాతము :**

విప్లవాత్మకమైన మార్పులను చేశారు అన్నమయ్య. అవి యెంత హృద్యమంగా వుంటాయంటే ఈ కీర్తనే ఒక మచ్చు వుదాహరణ. తల్లీ! సీతమ్మా! అదిగో చూశావా సువేలాద్రి పర్వతంపై నిలుచున్న రాముడు ఎలా పరికిస్తున్నాడో చూడవమ్మా! ఆయన వస్తాడని దుష్టరావణుని 'యెదిరితివి' (యెదిరి చూచావు). ఇకనేమమ్మా? అంటున్నారు. ఎవరు?





తనను తాను హనుమంతునిగా భావించుకొనుచున్న అన్నమయ్య. ఇంతవరకు ఇటువంటి కీర్తన యెవరన్న చెప్పారా? వూహించారా? నభూతో నభవిష్యతి. నిస్సందేహంగా.

**తాత్పర్యము :**

ఓ సీతమ్మతల్లీ! అదిగో ఆ సువేలాద్రి పర్వతం పైనెక్కి నిన్నా దుష్టరావణుడెక్కడ వుంచాడా అని పరికిస్తున్న ఆ త్రిజగన్మోహనుని చూడవమ్మా! ఆయన వస్తాడని ఇంతకాలం యెదిరితివి, (యెదురు చూచినావు). ఇకనేమమా?

తల్లీ! దనుజులు వారేరు (పారిపోవుచున్నారు). లంకలో తలకేరు (భయపడిపోతున్నారు). సూర్యవంశీయుడైన శ్రీరామచంద్రుడు వచ్చేశాడమ్మా! ఇంక భయంలేదు తల్లీ! అదిగో కపివీరుల యార్పులు (కేకలు) వినవచ్చుచున్నవి కదా! శ్రీరాముని వెనుకొని (అనుసరించి) వచ్చిన పవుజుల (సైన్యము) విడిసెనమ్మా! సాగరతీరమున యెట్లు విడిది చేశాయో నీవే చూడవమ్మా!

తల్లీ! ఆ రామరావణ యుద్ధంలో కుంభకర్ణుడు మొదలైన రాక్షసవీరుల బయిపడి (బయటపడి) మరణించినారమ్మా! శ్రీరాముడు రణరంగంలో రావణుని ఇరువది చేతులు, పదితలలు, వైభవములను చిరుమగ (ఛిన్నాభిన్నం చేయగా) విన్ను (ఆకాశము) నిండిపోయినదమ్మా! ఇక నీవు తృప్తి జెందుము తల్లీ!

నీ భర్త, విభీషణుని లంకారాజ్యమునకు పట్టము గట్టెనమ్మా! అతడు నిన్ను సర్వలాంఛనాలతో.. నీ భర్తవద్దకు పంపుటకు ఏర్పాట్లు చేస్తున్నాడమ్మా! ఇక ఈ కలియుగంలో... కతగా ఇది రామాయణగాథగా ప్రసిద్ధమవగా మీరు శ్రీ వేంకటాద్రిపై హితముగొలుపుచు కూడరో (కూడినారు కదా!) ఇపుదేమమ్మా! (ఇంక మాకు భయమెందుకు తల్లీ!)

సంపుటి : 20 — కీర్తన : వరుసకు రాకుంటే వావి దప్పీనా

సంఖ్య : 283 — పుట : 189 - రాగం : సౌరాష్ట్రం

**79.** వరుసకు రాకుంటే వావిదప్పీనా
వెర విందు కేది గోవిందరాజా ॥పల్లవి॥

చిందేటి తేనె మోవితో చెలి నీతో మాటలాడె-
నందుకంటె నేమి సేసు నది చాలదా
ముందే మొల్ల చూపులను ముంచి చల్లఁగాఁ జూచె
కందువైన దిందుకంటె కలదా ప్రియము ॥వరు॥

వెన్నెల సెలవితోడ వెలఁది నీతో నవ్వె
యిన్నిటా నీయాసోద మిఁక నెంతయ్యా
అన్ను వచంద్రునివంటి ఆననము నీకుఁజూపె
యిన్నేసిచేఁతలు సేసె నిఁక నేమి గడమ ॥వరు॥

చిగురుఁ దీగెలవంటి చేతులు నీపై వేసె
త గవులన్నియుఁ దేరె తారుకాణేలా
పగటు శ్రీవేంకటాద్రిపతి నిట్టె కూడితివి
జగడాలిన్నియుఁ బాసె చనవింత చాలదా ॥వరు॥

**ఉపోద్ఘాతము :**

అన్నమాచార్యులవారి కీర్తన అంతా ఒకయెత్తు, పల్లవి ఒక ఎత్తు. వారి పల్లవి ఒక్కొక్కప్పుడు బుఱ్ఱబద్దలుకొట్టుకున్నా ఇదమిత్థంగా అర్థం కాదు. ఈ పల్లవినే చూడండి "ఓ గోవిందరాజా! నీతో వరుస కలుపకుంటే (జతచేరకపోతే) వావిదప్పీనా మన బంధుత్వమే మరచెదవా? వెరవిందుకేది? (ఇదేమి పద్ధతి?) కాస్త నీకు సహకరించ కుంటే... మరీ ఇంత కోపమా?" అని నేను భావిస్తున్నాను. ఇంకొక విధముగా భావించినా, దానిని కూడా అన్వయించవచ్చును. ఇది యింతేనని చెప్పనేరము.





అన్నమయ్య పల్లవి వారి భావనా ఝరిలో ఉత్తుంగ తరంగం. అది యెంతయెత్తు కెగసిపడుతుందో యెవరికెరుక? గోవిందరాజస్వామికొక్కడికే అది సాధ్యం.

**తాత్పర్యము :**

ఓ గోవిందరాజా! ఇది యెంత అన్యాయం? నీతో ఆమె వరుసకు రాకుంటే (జతచేరకపోయినంతమాత్రాన) వావి దప్పీనా? (మీ మధ్య బంధుత్వం మాయమై పోతుందా?) వెరవిందుకేది (ఇదేమి పద్ధతి ప్రభూ!) కాస్త నీకు సహకరించకపోతే ఆమెపై ఇంతకోపమా? ఆమె వలపు ఇంతలో మఱతువా?

నీ చెలి తేనెలూరు పెదవులతో మధురముగా నీతో మాటలాడగలదు. అంతకంటే ఆ బేల యేమి చేయగలదు? అది చాలదా? ఆమె నీకంటే ముందే మొ(మె)ల్ల చూపులను చల్లగాచూచి (తిన్నని చూపులతో నిన్ను నేరుగాచూచి) నీకు దగ్గరైనది. ఇందుకంటే కలదా ప్రియము? (ఇంతకంటే తన ప్రేమను యెట్లు విప్పిచెప్పగలదు? భామినులంతకుమించి బరితెగింతురా?

ఆమె వెన్నెల జల్లు చిలకరించునట్లు తన లేత పెదవులతో నవ్వినది. నీ యాసోదము (నేటి కాలములో... నీ అసాధ్యం కూలా... అని మనం వ్యవహరిస్తున్నాం) ఇక నెంతయ్యా? (ఇంకా ఏమి అఘాయిత్యం చేలగలవు?) చంద్రుని వంటి తన మొగము నీకు అన్నువ చూపినది (కొద్దిగా చూపించినది). నీకోసం ఇన్ని చేతలు చేసినది. ఇంకానేమి కడమ? (మరి ఇంకేమి తక్కువైనదయ్యా!)

ఆమె లేత చిగురులవంటి కోమలమైన చేతులు నీపై వేసినది. అంతే అలుకలన్నీ తీరినవి. తగవులన్నీ తెగినవి. తారుకాణములన్నీ (నీ ప్రేమను నిదర్శనములతో ఆమెకు) చూపినావు కాబోలు. శ్రీ వేంకటాద్రిపతివై ఆమెనిట్టే (సునాయాసంగా) కూడితివి. పగటు వేంకటేశ్వరుడవు (లావణ్యమూర్తివైన తిరుమలేశ్వరుడవు). నీతో ఆమె కలహములన్నీ కరిగిపోయినవి. ఆమె నీపై జూపు చనవు చాలదా ప్రభూ! ఆమె ముగ్ధకదా!

సంపుటి : 20 కీర్తన : పూవుటమ్ములు మరుడు పూచినాడే మరుడు
సంఖ్య : 179 పుట : 120 - రాగం : మాళనిగౌళ

80. పూవుటమ్ములు మరుఁడు పూఁచినాఁ డేమరఁడు
రావే నామాఁట విని రవ్వపడనేఁటికే ॥పల్లవి॥

వద్దే నీచలము వలపించఁగలము । నీ-
కొద్ది దెలిసినదాఁకా గొంకే మింతే
అద్దో యిటువలె నలిగేవా నెంతలేదు
చద్దికి వేఁడికి నవి సాగ వింతేగాక ॥పూవు॥

యింతేలే నీ కోపము యిందుకెల్లా నోపము । నీ-
పంతము చూచినదాఁకా పాటించేనింతే
యెంతో బిగువుతోడ యెలయించే దెంతలేదు
సంతతము పతివద్ద జరగదుగాక ॥పూవు॥

మానవే నీ బిరుదు మాకు నివి యరుదు
నానఁబెట్టి కొంతవడి నవ్వితి నింతే
నేనే శ్రీ వేంకటగిరినిలయుఁడఁ గూడితిని
దానికేమి నీకు నాకుఁదగు లింతేకాక ॥పూవు॥

**ఉపోద్ఘాతము :**

శ్రీ వేంకటనాధుడు తనసతికొరకు ఈ విరహగీతం పాడుతున్నాడు. “పూలబాణాల వాడైన మరుడు ఏమరడు (మఱచిపోడు). నా మదిలో మరులు రేపుతున్నాడే. రావే నామాటవినవే. పోట్లాటయెందుకే... అని మదనతాపంతో వేడుకొంటున్నాడు. నీ బిరుదుమానవే. ఇట్లాంటివి (తనని కాదనటం) నాకు అరుదు. నేను శ్రీ వేంకటేశ్వరుడనే నిన్ను కూడుటకు యేతెంచితిని. దానికేమి (ఈ చిలిపి కజ్జాలకేమి) నీకు నాకు తగులు తప్పదుకదా!” అన్నమయ్య భావనా పరిధి అనంతం.





జగదేకపతికి విరహవేదన యేమిటి? చిరంతనునికి స్త్రీ వ్యామోహమేమిటి? తెలుగులో రవ్వ అనే మాటలేదు. అది అవ్వ అంటే నింద అని అర్థం.

**తాత్పర్యము :**

ఓ భామినీ! మరుదు (మన్మథుడు) పూలబాణములు ఏమరక (మఱువకుండా) పూచీనీ (వేయుచున్నాడే) నామాట వినిరావే. ఏటికి (ఎందుకు) రవ్వ పడను? (ఎందుకు తిట్లు తింటావు?) అంటే.. ప్రణయ కలహంలో పరస్పర నింద సహజమే కదా!

నీ చలము వద్దే, (ఇంత మత్సరము పనికిరాదే). నీచేత మేము వలపించుకోగలము. నీకేం తక్కువైనదో తెలుసుకొనేదాక కొద్దిగా గొంకేము (జంగుతున్నాము) అంతే. అద్దో (అదిగో) ఈ విధంగా అలిగితే చద్దికీవేడికీ (రేయింబవళ్ళు) ఆ అలుకలు చెల్లుతాయా? ఇంతకాక మరేమి? ఆసయెంతలేదు? (నీమీద నాకు ఎంత ఆశవున్నదో నీకు తెలియదా?) కాబట్టి చిట్టి పొట్టి అలుకలు మానవే.

నీ ఇంత కోపానికి మేము నోపము (తగము). నీ పంతము (పట్టుదల) యెంతటిదో చూచేదాకా నేనూ పాటించేను (భరించెదను) ఇంతే.. ఒకమాట చెబుతాను వినవే. ఎంతో బిగువుతోడ (బెట్టుసరితో) ఎలయించేది (వుసిగొలిపేది) ఎంతయూలేదు. పతివద్ద సంతతము జరుగదుగాక! (నీ మొగని వద్ద ఎప్పుడూ నీమాట చెల్లుతుందనుకొంటే ఎప్పుడో దెబ్బతింటావు).

(బిరుదు అంటే ప్రతిజ్ఞకాని ఇక్కడ బిగింపు అని అర్థం చెప్పుకోవాలి). ఓదేవీ! నీ బిగింపులు మానవే. మాకు ఇవి అరుదు (అలవాటులేదు). నిన్ను కొంతసేపు నానబెట్టి (వుడికించి) నవ్వితిని (నవ్వుకొన్నాను). అంతేకాని నీపై నేను కోపించగలనా? నేను శ్రీ వేంకటేశ్వరుడను. నిన్ను ఇట్లు ఉడికించి పొందితిని. దానికేమిలేవే... నీకూ నాకూ తగులు (పొసగినది). మొగుడూ పెళ్ళాలకు ఇదెప్పుడూ వుండేదే కదా! ఇంతకాక మరేమిటి?

సంపుటి : 20 కీర్తన : ఒక్కరీతినుండదోయీ ఓ విట్ఠలా
సంఖ్య : 68 పుట : 46 - రాగం : సామంతం

81. ఒక్కరీతినుండదోయి వో విట్ఠలా
వుక్కువంటి నీ చిత్తము వో విట్ఠలా ॥పల్లవి॥

పొద్దువోయి వచ్చేవు పూఁచి బాసలు సేసేవు
వొద్దన్నా మానవేల వో విట్ఠలా
కొద్దిమాలి తిరిగేవు కొంగువట్టేవు మమ్ము
వుద్దండా లేలోయి వో విట్ఠలా ॥ఒక్క॥

వెడనవ్వు నవ్వేవు వీదులెల్లా నేఁగేవు
వొడఁబాటు లింకానా వో విట్ఠలా
కడుఁబరాకయ్యేవు కదిసేవు కమ్మరాను
వొడలు మోపకు వోయి వో విట్ఠలా ॥ఒక్క॥

కప్పురాలు చల్లేవు కాఁగిటిలో భ్రమసేవు
వొప్పితి నీసుద్దులకే వో విట్ఠలా
యిప్పుడె శ్రీ వేంకటాద్రి ఎతవై కూడితి విదె
వుప్పటింపజాల నింక వో విట్ఠలా ॥ఒక్క॥

**ఉపోద్ఘాతము :**

విట్ఠలనాథునిపై అన్నమయ్య సరస శృంగార కీర్తన వినిపిస్తున్నారు. అన్నమయ్య వాడిన కొన్ని మాటలు మనం ఇంకొకరి కవిత్వంలో చూడముకూడా చూడము. ఓ విట్ఠలా? నీవు ఒక పద్ధతిలో నుండవు. నీ మనస్సు ఉక్కువలె కఠినమైనది. (మా దీనావస్థను చూచినా అది కరుగదు.) మళ్ళీ నీవే మా కొంగుపట్టి కవ్విస్తావు.





ఓ విట్ఠలా! వేంకటాద్రి ఎతవై కూడితివిదె.... వుప్పటింపజాలనింక అంటున్నారు. అంటే యేమిటో తెలిసీ తెలీనట్లుగానేవుంటుంది.

**తాత్పర్యము :**

ఓ విట్ఠలా! నీవు ఒక్క పద్ధతిలో నుండవు. ఒకసారి నీ శృంగారహేలలో మమ్ము వోలలాడించేవు. ఒకసారి కడు పరాకుఅయ్యేవు. నీ చిత్తము (మనస్సు) ఉక్కువలె కఠినమైనది ప్రభూ!

ఓ విట్ఠలా! నీవు మావద్దకు పొద్దుపోయివస్తావు. పూచి (ఆశలు చిగురించే) బాసలు చేసేసేవు (ఒట్లు పెట్టుకొంటావు). చాలు చాలు మమ్మల్ని మా దారిన వదిలేయి... అంటే వినవు. కొద్దిమాలి (అంతులేకుండా) మా వెంటబడి తిరుగుతావు. మాపైట కొంగులు పట్టి లాగుతావు. ఈ ఉద్దండాలేల... ఓయి విట్ఠలా! (నీవు మరీ యెక్కువ చేస్తున్నావు ఎందుకయ్యా!.. నేటి కాలంలో "టూ మచ్ చేస్తున్నావు".. అంటున్నాము).

ఓ విట్ఠలా! వీధులెల్లా నేగేవు (జులాయి లాగా వీధులలో తిరిగెదవు. వెడనవ్వు నవ్వేవు (వికటాట్టహాసం చేస్తుంటావు). నీతో ఒడబాటులింకానా? (ఇంకా నీతో ఒడంబడికలేమిటి?) ఓ విట్ఠలా! కడు పరాకయ్యేవు (మరీ ప్రమాదము కలిగించు, కుటిలుడు అయ్యేవు). కమ్మరాన కదిసేవు (బాగుగా మరగించి దగ్గరయ్యేవు).

ఓ విట్ఠలా! ఓ విట్ఠలా! నాపై కప్పురాలు (కర్పూర ధూళి) చల్లెదవు. బిగి కౌగిట భ్రమింపజేతువు. నీవు చెప్పే "కతల" నన్నిటినీ ఒప్పుకుంటూనే వున్నాను. మరి ఇప్పుడేమి చేస్తున్నావు? శ్రీ వేంకటాద్రిపై నుండే ఎతవై (ఎత్తైన వాడవై) నన్ను కూడితివి. ఓ విట్ఠలా! ఇక నేను ఉప్పటింపజాలను (ఓర్వలేను). నీ దాసాను దాసురాలైన నీ అధీనను.

సంపుటి : 20 కీర్తన : పోనీ పోనీ ఇకనేల పోయిన నీళ్లకు గట్ట
సంఖ్య : 282 పుట : 189 - రాగం : నాదరామక్రియ

**82.** పోనీ పోనీ ఇఁకనేల పోయిన నీళ్ళకుఁ గట్ట
నేనే యింతకుఁ జొచ్చితే నిన్నుఁ బారనిత్తునా ॥పల్లవి॥

పదవోయి నీమాఁటపట్టు నీకే వచ్చెను
వదల కెప్పుడును నీవారమే నేము
కదిసి నీ విందుకొరకా వలపించితివి
యిది నే నెఱిఁగితేను యింతా మెచ్చుసేయనా ॥పోనీ॥

చాలునోయి యిందాఁకా నీసరితలే చూచితిమి
యీలాగుల నీకు నే మీఁదె త్రితి మేను
తాలిమి నీచేసన్న లింతకు వచ్చెనా నేఁడు
నాలినీగుణము గంటే నాఁడే మెచ్చు సేయనా ॥పోనీ॥

తగునోయి నీకు-నాకుఁ దతివచ్చె మితివచ్చె
మొగి నిన్ను నేడఁగన్నా... మొక్కేము నేము
ఆగడు శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
నిగిడి నన్నుఁ గూడితి నీకే మెచ్చుసేయనా ॥పోనీ॥

**ఉపోద్ఘాతము :**

నాయిక ఈ కీర్తనలో తానే అలమేల్మంగను అని ప్రకటించుకొంటున్నది. నదిలో అడ్డుకట్ట కట్టుట దేనికి? నీరు వ్యర్థంగోపోకుండా. మరి పోయిన నీటికి ఇంకా అడ్డుకట్టటం యెందుకు? పోయిన నీళ్ళు యెలాగో పోయాయి. పోతేపోనీ, నాకే ఇంత 'చొరవ' వుంటే నిన్ను బారనిత్తునా అని దెప్పిపొడుస్తున్నది. అన్నమయ్య పదలాలిత్యం చెప్పనలవికాదు. నిగిడి నన్ను గూడితి నీకే మెచ్చుసేయనా.. అంటున్నది. నాయిక జాణతనం కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నది.





ఈ కీర్తనలో భావ సముదాయాన్ని ఒకదానితరువాత ఇంకొక దానిని ఒక క్రమంలో నేటి భాషలో చెప్పటం నాశక్తికి మించిన పనిఅయిందని నా మనవి.

**తాత్పర్యము :**

(స్వామీ!) పోతే పోనీలే. ప్రవాహంలో కొట్టుకుపోయిన నీళ్ళకోసం బాధపడటం దేనికి? పోయిన నీళ్ళకి అడ్డుకట్ట వెయ్యగలమా? నేనే ఇంతకు జొచ్చితే (నాకే ఇంత చొరవ వుంటే) నిన్నున్ పారనిత్తునా? (బరితెగించిపోనిత్తునా?)

ఓ స్వామీ! పదవోయీ... (పోవయ్యా) నీమాట పట్టింపు నీకే చెల్లింది. మేము నీవారమేనయ్యా! మమ్మల్ని యెప్పుడూ త్యజించబోకు. ప్రభూ! ఒకమాట చెప్పుము. నన్ను నీవు దీనికోసమే ప్రేమించావా? నీ సంగతంతా తెలిసికూడా.. మెచ్చుసేయనా (నిన్ను సమర్థించ మంటావా?) నీకు నేను చెప్పదగినదాననా?

ప్రభూ! చాలునోయీ (ఇక చాలునయ్యా!) నీ సరితలే చూచితిమి యిందాకా (ఇప్పటిదాకా.. నీ చరిత్రలు చాలా చూచాము.) నీపై నాకున్న లాగు (మమకారము) నీకేమి లెక్క? నేడు నా సమక్షముననే (వేరొకదానికి) చేసన్నలు (చేతిసైగలు) చేయుచున్నావు. నీది నాలిగుణము. నీ మనసులో ఏముందో యెవరికీ తెలీదు. నీ సంగతి తెలిస్తే... ఆనాడే మెచ్చుసేయనా? (వ్యంగ్యంగా దెప్పిపొడుస్తున్నది).

దేవా! నీకూ నాకూ తగునోయీ (సరిపోయిందయ్యా!) తతి వచ్చె మితివచ్చె (ఒకరికొకరము సమ వుజ్జీ అయినవారమే). నీవు ఆది దేవుడవని గ్రహించి మొక్కేము ప్రభూ! గంభీరుడవైన శ్రీ వేంకటేశ్వరా! నేనే అలమేల్మంగను. నిగిడి (వ్యాపించి) నన్ను కూడితివి. నీకే మెచ్చుసేసేను (నిన్ను ఆరాధించెదను స్వామీ)!

సంపుటి : 20 కీర్తన : అయ్యో! నీకు వగచినదే దోసమా

సంఖ్య : 120 పుట : 81 - రాగం : సామంతం

**83.** అయ్యో నీకు వగచినదే దోసమా
ఇయ్యెడ నీకు వలచుటిదే దోసమా ॥పల్లవి॥

వాలాయించి మొక్కేవు వాదులకే నిక్కేవు
ఔలే నీతో నవ్వినదే దోసమా
సోలగిలఁ జూచేవు చొక్కి చొక్కి లాచేవు
యీలాగై నీవద్దనుండే దిదే దోసమా ॥అయ్యో॥

బొమ్మల జంకించేవు పూఁటపూఁటకు మించేవు
అమ్మరో నీయాలనైన దదే దోసమా
రమ్మనుచు మరపేవు రాజసాలు నెరపేవు
యిమ్ముల నిన్ను నమ్మినదిదే దోసమా ॥అయ్యో॥

యేకతానకుఁ దీసేవు యేమన్నా నోరుమూసేవు
ఆకుమడిచి యిచ్చిన దదే దోసమా
పైకొని శ్రీవేంకటేశ పచ్చిగా నన్నుఁగూడేవు
యీకడ నీవే నేనై తిదే దోసమా ॥అయ్యో॥

**ఉపోద్ఘాతము :**

అన్నమయ్య కాలం నాటి తెలుగు నుడికారం, నేటి తెలుగుతో పోల్చితే వ్యత్యాసం కొట్టొచ్చినట్లు కనబడుతుంది. అయ్యో! నీకు వగచినదే దోసమా అంటున్నారు. నేటి కాలంలో అయ్యో! నీకోసం వగచుటే దోషమా అని అంటున్నాం. బొమ్మల జంకించేవు, పూటపూటకు మించేవు, రాజసాలు నెరపేవు యేకతానకు దీసేవు, ఆకుమడిచి





ఇచ్చేవు.. వంటి మాటలు నేటి తెలుగులో కనుమరుగయ్యాయి. పచ్చిగా కూడుట అంటే వింతగానే వుంటుంది. ఒక్కసారి వివరణ చదివితే... ఇంతేనా అనిపిస్తుంది.

**తాత్పర్యము :**

అయ్యో! ఇదెక్కడి అన్యాయం? నీకోసం వగచుటిది (ఇలా బాధపడుటయే) దోసమా (తప్పా?) ఇయ్యెడ (ఇప్పుడు) నిన్ను ప్రేమించుటయే నానేరమా?

స్వామీ! నీవు చేసేది మాత్రం ఏమిబాగున్నది? నీవు వాలాయించి (బలవంతం చేసి) మొక్కేవు. (దండములు పెడతావు), అట్లు కాదని వాదిస్తే నిక్కేవు (అలుగుతావు). ఔలే (ఔరా!) నీతో కలిసి నవ్వటమే తప్పా? సోలగిల చూచేవు (నేను వివశురాల నవునట్లు చూచెదవు), చొక్కి చొక్కి లాచేవు (మాటి మాటికీ పరవశత్వంతో (సిగ్గు తెప్పిస్తావు). ఇట్లా నీ దగ్గర వుండటమే నా నేరమా యేమిటి?

స్వామీ! బొమ్మల జంకించేవు (నీ కనుబొమ్మలు ముడివేసి నన్ను భయపెడుతావు), పూట పూటకు మించేవు (అతిశయించేవు); అమ్మరో (అమ్మయ్యో!) నీ పెళ్ళాన్నవటమే నా తప్పులా వుందే? నన్నెలాగో మరపించి రమ్మని బలవంతం చేస్తావు. వచ్చాక రాజసాలు నెరపేవు (నీ రాచఠీవినంతా నాపై చూపిస్తావు); ఇమ్ముల (ఎక్కువగా) నిన్ను నమ్మటమే నా పాపంలా వున్నదే!!

స్వామీ! ఏకతానకున్ తీసేవు (నీతో ఏకాంతమునకు ఆహ్వానింతువు); నేనేమన్నా నానోరు మూయించేస్తావు. నేనే నీకు ఆకుముడిచి యిచ్చినదే దోసమా (నీకు తాంబూలమిచ్చి ఆహ్వానించినదే నా తప్పా!!) ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను పైకొని (ఆక్రమించుకొని) పచ్చిగా గూడితివి (యేమాత్రము మరుగులేక నన్ను కూడినావు). ఈ విధముగా నీవే నేనయిపోయాను. నాకు "త్వమేవాహం" భావన వచ్చేసింది. ఇందులో నాతప్పేముంది ప్రభూ!

సంపుటి : 20 కీర్తన : ఇంతలాయ వింతలాయ నెందాక
సంఖ్య : 284 పుట : 190 - రాగం : వరాళి

84. ఇంతలాయ వింతలాయ నెందాఁక సరసాలు
చెంతలఁ జేరఁగరాదా చెలి జవ్వనమున ॥పల్లవి॥

చిత్తరువు వ్రాతఁలాయ చెలి నివ్వెరగులు
ముత్తెపుముగ్గులాయను మోహములెల్లా
పొత్తుల తేనియలాయ పొలఁతిపలుకులెల్ల
చిత్తగించి చూడరాదా చెలియభావములు ॥ఇంత॥

విడువని జడులాయ వెలఁది మెయిచెమటలు
తడఁబడే సంపదాయ తమక మది
కడివోనివిరులాయ కందువకోరిక లివి
తొడిఁబడఁ జూడరాదా తొయ్యలిచందములు ॥ఇంత॥

పూచిన వెన్నెలలాయ పొలఁతి సెలవినవ్వు
చూచినటల్లానాయ సొంపుకళలు
యేచిన శ్రీవేంకటేశ ఇట్టె ఇంతిఁ గూడితివి
రాచిలుక వంటిదాయ రమణి నీరతిని ॥ఇంత॥

**ఉపోద్ఘాతము :**

అద్భుతమైన శృంగార కీర్తన నాలపిస్తున్నారు అన్నమయ్య. కళాస్రష్టయైన శ్రీవేంకటేశ్వరునికి శృంగార కళ, వినిపిస్తున్నారు. స్వామీ! నీ సరసాలు ఇంతింతైనవి. వింతగా కూడా వున్నాయి. ఇంకా యెంతదాక నీ సరసాలు. నీ చెలి జవ్వన తాపముతో నున్నది. ఆమెచెంత చేరరాదా? ఆమె అవస్థ చూడవయ్యా! అని స్వామికి నచ్చజెబుతున్నారు. రమణి ఇనీరతిని రాచిలుకవంటిదాయ... అని కొసమెఱుపు నందిస్తున్నారు. అంటే యేమిటో భావించాలి అంటే.. కొంత కవితాహృదయంతోపాటు అపరిమితమైన వేంకటరమణుని కృప వుండాలి.





**తాత్పర్యము :**

ఓ ప్రభూ! నీవా దేవితో ఆడే సరసాలు ఇంతలాయ.... వింతలాయ (ఇంతింతేసి అధికముగా నున్నవి. వింతగా కూడా వున్నవి). జవ్వనమున చెలి సతమతమగుచున్నది ఇకనైన నీవామె చెంతకు చేరగరాదా?

స్వామీ! ఈ చెలి నివ్వెరగులు (అచ్చెరువందినప్పుడు) చిత్రకారుని సజీవ చిత్రమువలె తోపుచున్నది. ఆమె మోహ పారవశ్యతనొందినప్పుడు ఆ మోహములు... ముత్యాల ముగ్గులవలె బహుసొగసుగా నున్నవి. మీరు మాటలాడుకొనుచున్నప్పుడు ఆ పొలతి (సుందరి) పలుకులు తేనెజల్లులాయెను. ఆ చెలి భావావేశమును గమనించి చిత్తగించరాదా? అది నీ చేతిలోని పనియే కదా!

ఓ దేవా! ఈ వెలది (సుందరి) మెయిచెమటలు (శరీరంపైన ముప్పిరిగొన్న స్వేదము) విడువని జడులాయ (నిరంతరము కురియు వర్షము వలె తోపుచున్నది. ఆమె తమకము (పరవశత్వము) తడబడునటువంటి సంపదయైనది. కందువ కోరికలు (ఆమె చిలిపి కోర్కెలు) కడివోని విరులాయ (వాసనవాడని సుగంధ సుమములైనవి). ఈ తొయ్యలి (సుందరి) చందము పద్ధతి తొడిబిడన్ చూడరాదా? (చలించిపోవు చున్నదని నీవు చూడలేకున్నావా?

ఓ శ్రీ వేంకటేశ్వరా! ఈ పొలతి (సుందరి) సెలవి నవ్వులు (లేనవ్వులు) పూచిన వెన్నెలలాయ (విరబూచిన వెన్నెలల వలె తోచుచున్నవి). సొంపైన ఆమె కళలు (సొబగులు) చూచినటల్లానాయ (అనగా చూచినవారికి వారి చూపులకు తగినట్లున్నది). నీవు యేచని (అతిశయించిన) ప్రియుడవైనందున ఆ ఇంతిని ఇట్టే కూడితివి. (నీ సంభోగ సంభ్రమమున) ఆమె రాచిలుకయైనది (మధురోక్తులను పలుకు రామచిలుకయైనది) స్వామీ!

సంపుటి : 20 కీర్తన : ఆనలేలయ్య నీవాడినట్టె ఆడేము
సంఖ్య : 177 పుట : 119 - రాగం : కాంబోది

**85.** ఆనలేలయ్య నీవాడినట్టె ఆడేము
పూనిననీమనసులో పూఁపక మేదయ్యా ॥పల్లవి॥

సన్నల నాకెకు నీకు సాకిరి చెప్పుమనేవు
అన్నట్టే నీమాట లవిగోవయ్య
మిన్నక తిట్టే వందుకుమించి వెంగెములంటా
యిన్నిటా దొరవు నిన్ను నేమనందునయ్యా ॥ఆన॥

అప్పటి మొక్కించుమనే వాకెనే నీముందట
చెప్పినట్టెల్లా నింకఁ జేసేమయ్యా
రెప్ప వెట్టక చూచేవు రేసు నెరపేనంటా
దెప్పరాలు నీకునీవే తెలుసుకోవయ్యా ॥ఆన॥

కందువ నీ వెదురేఁగి కాఁగిలించితి వాకెను
అందరికి వొక్కమన సాయనయ్యా
అందపు శ్రీ వేంకటేశ అంతలో మమ్ము మెచ్చేవు
విందువంటిమావంక వెలుతు లేవయ్యా ॥ఆన॥

**ఉపోద్ఘాతము :**

నాయిక శ్రీ వేంకటశ్వరునికి బ్రతిమిలాడుతూ నచ్చజెబుతున్నది. అన్నమయ్య తానూ ఒక నాయిక అయి పూనిన నీ మనస్సులో పూపకమేదయ్యా అంటున్నారు. పూపకము అనే మాటకు నిఘంటువులో అర్థం దొరకలేదు. 'పూపు' అంటే పూనిక (termination) అన్నమాట. కాబట్టి పూపకము అంటే నిశ్చయము అని భావిస్తున్నాను. ఓ ప్రభూ! నీవు చెప్పినట్టల్లా ఆడినాము కదా! ఇంకా ఏవేవో వొట్టు పెట్టుకొని మమ్మెందుకు బాధిస్తున్నావు? అసలు నీ మనస్సులో నన్ను అనుగ్రహించాలనే





నిశ్చయమే లేదయ్యె... ఇంకె యెన్నసుకొంటేనేం, యేమనుకొంటేనేం? అంటున్నారు. ఆనాటి తెలుగు అవటం వల్ల మనకు కొత్తగా వుంటుంది. "విందువంటి మావంక వెలుతులేవయ్యా" అంటే యేమిటి?

**తాత్పర్యము :**

ఓ శ్రీ వేంకటేశ్వరా! నీమీద 'ఒట్లు' పెట్టుకొని నన్నెందుకు బాధిస్తావు? నీవాడినట్లే (చెప్పినట్టే) ఆడేము (చేసితిమికదా!) మరి ఇక పూనిన నీమనస్సులో నాపై) పూపకము (నన్ను అనుగ్రహించాలనే నిశ్చయం) యేదయ్యా!

స్వామీ! మీరూ మీరూ కలహించుకొంటుంటే మధ్య నన్ను సాకిరి చెప్పుమనేవు. (నన్ను నీ తరపున సాక్ష్యం) చెప్పమంటావు). సరే... నేనూ నీవు చెప్పినట్టే చేశాను. ఆవిడ అలిగింది. నీవేమో నన్ను తిట్టుతున్నావు. అందుకు మించి ఆవిడతో నాపై వెంగెములాడేవు (చులకనగా, వ్యంగ్యంగా అనరాని మాటలు నన్నంటూ అవమానించావు). నీవు ఇన్నిటా 'దొరవు. నిన్నేమనగలము? నీకు నీవే ఇది న్యాయమేమో ఆలోచించుకో.

ప్రభూ! ఆమెపై నీవు అలిగి, ఆకెను (ఆమెను) నీ ముందుకు తీసికొనివచ్చి మొక్కించమంటావు. నిన్ను శాంతింపజేయటానికి మేమూ నీవు చెప్పినట్లే చేసేము. ఇంకా నువ్వు శాంతించలేదు. రెప్ప వెట్టక (కనురెప్పలు వాల్చక) బెదరించునట్లు చూస్తున్నావు; రేసు నెరపేవు (చులకన చేస్తున్నావు). దెప్పరాలు (దెప్పుట) కూడా మానవు. నీవేం అటువంటి ఇటువంటి వాడవా? నీకు నీవే తెలుసుకోవయ్యా!

దేవా! నేడు మీ గొడవలు సద్దుమణిగి నీవు యెదురు వెళ్ళి ఆమెను కౌగలించుకొని స్వాంతనపరిచావు. అమ్మయ్య! అని ఒక్క మనసుతో (మనస్ఫూర్తిగా) అందరికీ ఆనందం కలిగింది. అందమైన ఓ తిరుమల నాయకా! అంతలోనే మమ్మూ మెచ్చేవు. విందువంటి మావంక వెలుతులేవయ్యా!) (చుట్టము వంటి నా వంక నీదయ ప్రసరింప చేస్తావు లేవయ్యా! నీవుండగా మాకేం భయం?

సంపుటి : 20 కీర్తన : నిచ్చానిచ్చా విట్ఠలా నీకేలయీా అట్టు
సంఖ్య : 140 పుట : 94 - రాగం : సామంతం

**86.** నిచ్చా నిచ్చా విట్ఠలా నీకేల యీా అట్టు
మచ్చము నే! జూపితేను మాతోనే నవ్వులా ॥పల్లవి॥

వల్లెవాటు పైఁ డిచీర వనిత శ్రీసతి నీకు
చల్లలమ్మే వారితోడ జాణతనాలా
చెల్లఁబో కొండ గొడుగుచేసి యె త్తేనీవు
గొల్లెతల చీరలెల్లాఁ గోరి ముచ్చిలేదా ॥నిచ్చా॥

అందరి నేలే గోపనందనుఁడవై ననీవు
చెంది చీఁకటితప్పులు సేయఁబొయ్యేదా
గొందినే దేవతలు గొనియాడేదట నిన్ను
మందవారిపాలఁ జిక్కి నిందలఁ బడేదా ॥నిచ్చా॥

కొనబుకాఁడవు నీవు కొమిరెవయసు నేను
పనిలేక వొంటినుం టేఁ బై కొనేదా
ననుపై శ్రీ వేంకటేశ నన్ను నిట్టె కూడితివి
మనలోఁ దగవు దేరె మరియింకాఁ గొసరా ॥నిచ్చా॥

**ఉపోద్ఘాతము :**

విట్ఠలేశ్వరునిపై శృంగార కీర్తన వినిపిస్తున్నారు అన్నమయ్య. అచ్చతెలుగు పదాల అల్లిక అయినందువల్ల అంత తేలికగా అర్థం కాదు. ఆనాటి కొన్ని నుడికారములు మనల్ని తికమక పెడతాయి. “గొల్లెతల చీరలెల్లా గోరిముచ్చిలేదా” అంటున్నారు. కావాలని గోపికల చీరెలను దొంగిలించేదా... అని చెప్పుకోవాలి. అంటే నేను దొంగిలించేదా అని కాదు, దొంగిలించేపని చేస్తావా? అని అర్థం. చెంది చీకటి తప్పులు సెయ్యబొయ్యేదా.. అంటే నన్ను చేరి చీకటి తప్పులు





చేయపూనుకొంటావా? అని అర్థం. ఆనాటి నుడికారాలు తేడావలన కొద్దిపాటి తికమక కలిగినా మధురమైన కీర్తన ఇది. “కొనబుకాడు”.. అంటే ఏమిటో నాకెక్కడా దొరకలేదు.

**తాత్పర్యము :**

ఓ విట్ఠలా! నిచ్చా నిచ్చా (ప్రతిపూటా) నీకు ఈ అట్టు యేలనయ్యా! (ఈ తిట్లన్నీ యెందుకయ్యా! స్వామీ!) నేను మచ్చము జూపితే (మేము నీ అల్లరి నిరూపిస్తే) మాతోనే నవ్వేవు (నవ్వుతాలుగా తీసుకొంటావు).

బంగారుతో చేసిన వల్లెవాటు (పైట) గల చీరె ధరించిన శ్రీదేవి నీకు భార్య. మరి ఇంకా ఈ చల్ల కంపు కొట్టే చల్లలమ్మేవాళ్ళతో జాణతనాలా (సరసాలా?) చెల్లబో (వావ్మో!!) కొండ (గోవర్ధన పర్వతమును) గొడుగు పట్టుకొని ఆబాలగోపాలమును రక్షించిన గోవిందుడు, కోరి గొల్లభామల చీరలెత్తికెళ్ళినాడా? ఇదెక్కడి వింత!!

అందరినీ యేలునట్టి (నందవ్రజమునకు నాయకుడైన నందగోపుని కుమారుడవైన) నీవు, చెంది (తెలిసి తెలిసీ) చీకటి తప్పులు (రేతిరినేరాలు) చేస్తావా? తప్పుకాదా స్వామీ? నలకూబరుడు, నారదుడు, ఇంద్రుడువంటి దేవతలు వచ్చి నీకు మొక్కి నిన్ను కీర్తించిపోతుంటారే.. అట్లాంటి నీవు మందబుద్ధులైన గొల్లవాళ్ళకు చిక్కితిట్లుతింటావా? ఇదేమి చోద్యం?

ప్రభూ! నీవు కొనబుకాడవు (కోడెవయసు చిన్నవాడవు.. అని నేను భావిస్తున్నాను...). నేను కొమిరెవయసు దానను (యౌవనంలో వున్న అమ్మాయిని). నేను ఒంటరిగా పనేమీ లేక వున్నానని నాపై బడి ఆక్రమించు కొంటావా? అనుకూలం చేసుకొని శ్రీ వేంకటేశ్వరా! ఇట్టే నన్ను కూడితివి. మనలో మనకున్న పోట్లాటలన్నీ తీరిపోయాయి కదా! మరి ఇంకా కొసరా? మళ్ళీ మొదటికే వచ్చిందా? హతవిధీ!!

సంపుటి : 20 కీర్తన : సింగారరాయడవేదు చెన్నకేశా యింక
సంఖ్య : 157 పుట : 105 - రాగం : నాదరామక్రియ

**87.** సింగారరాయఁడ వౌదు చెన్నకేశా! యింకఁ
జెంగకుమీ మారతుల చెన్నకేశా ॥పల్లవి॥

చిమ్ములచుట్లతోనే చెన్నకేశా! మాకు
చిమ్మిరేఁచేవు వలపు చెన్నకేశా
చెమ్మఁజెమటచెక్కుల చెన్నకేశా! మాపైఁ
జిమ్మకు గోళ్ళ నీవు చెన్నకేశా ॥సింగా॥

సెలవి లేనగవుల చెన్నకేశా! మాకే
సెలవనేవు వయసు చెన్నకేశా
చెలఁగి పసిడిదట్టి చెన్నకేశా! యీ-
చెలువము నీకే చెల్లె చెన్నకేశా

చెప్పరాని మహిమల చెన్నకేశా! మాకు!
చెప్పిలేమోవి యిచ్చితి చెన్నకేశా
యిప్పుడే శ్రీ వేంకటాద్రి నిందుమాచనవోలిలో
చెప్పఁగా నన్నేలితివి చెన్నకేశా ॥సింగా॥

**ఉపోద్ఘాతము :**

మాచవోలు అనే గ్రామంలో వెలసిన చెన్నకేశవ స్వామిపై సరసశృంగారకీర్తన వినిపిస్తున్నారు అన్నమయ్య. ఆ సింగారరాయలు తనకు వలపును చిమ్మిరేచు తున్నాడట. గోళ్ళతో చిమ్ముతున్నాడట. పసిడి దట్టివాడట. మారతుల చెంగకుమీ చెన్నకేశా! అంటున్నారు. ఇదివరలో చెప్పినట్లు కేశి అనే రాక్షసుని చంపినందువల్ల





శ్రీ కృష్ణునికి కేశవుడని పేరు వచ్చినప్పటికీ ఆయన కేశపాశము చెన్నగా(అందముగా) వుంటుందట. అందుకే చెన్నకేశవుడైనాడు. ఇంతటి చెలువము ఆయనకే చెల్లిందట.

**తాత్పర్యము :**

ఓ చెన్నకేశవా! నీవు శృంగార రాయడవుదువు. మా రతుల చెంగకు మీ (మాతోటి రతిక్రీడల నతిశయించకుమయ్యా!)

ఈ చెన్నకేశవుడు చిమ్ముల చుట్లతోనున్నాడు. (విశేషముగా పెరిగిన జుట్టును చక్కటి చుట్లు చుట్టుకొన్నాడన్న మాట). మాకు (ఆ యువతికి) వలపు చిమ్మిరేచేవు (అంటే.. ప్రేమను 'మీటి' రెచ్చగొడుతున్నాడన్నమాట..) ఈ చెన్నకేశవుని చెక్కులపై (చెక్కిళ్ళపై) చెమట చెమ్మగిల్లినదట. మాపై నీవు గోళ్ళతో చిమ్మకు (గాట్లు పెట్టకు). ఎందుకంటే శృంగారరాయడుకదా! నఖక్షతముల కిటుకు నెరిగినవాడు మరి.

ఈ చెన్నకేశవుడు సెలవి లేనగవులవాడు (తన పెదవుల అంచులలో లేత నవ్వులను విరజిమ్ము అందగాడు.) వయసు వురకలేస్తున్న నీవు మాకే సెలవుయనేవు (మమ్మల్నే ఆజ్ఞాపించుచున్నావు). ఓ చెన్నకేశవా! పసిడిదట్టితో (పీతాంబరముతో) చెలగియున్నావు (శోభిల్లుచున్నావు). ఓ చెన్నకేశవా! ఈ చెలువములన్నీ (అందములన్నీ) నీకే చెల్లినవి ప్రభూ!

ఓ చెన్నకేశవా! నీవు చెప్పరాని మహిమలు గలవాడవు. మాకు చెప్పిలేమోవి ఇచ్చావు. 'ఇదిగో చూడు' అని చెప్పి మరీ మధురాధరము నిచ్చావు. ఇప్పుడే.. శ్రీ వేంకటాద్రిపై కూడా వున్నాడు. ఎవరు? ఇంకెవరు? ఈ మాచనవోలు గ్రామంలో వెలసిన చెన్నకేశవస్వామి. ఏమి చేశాడయ్యా! చెప్పగా నన్నేలినాడు (ఆయనపై కీర్తన చెప్పగా నన్ను పాలించి అనుగ్రహించినాడు)

సంపుటి : 20 కీర్తన : ఎప్పడును నాకు లోనైయేరా కృష్ణా
సంఖ్య : 417 పుట : 279 - రాగం : పాడి

**88.** ఎప్పుడును నాకు లోనె(నై?) యేరా కృష్ణా
చెప్పేవు ప్రియ మప్పుడే చెలువపుఁగృష్ణా ॥పల్లవి॥

చన్నుల నొరిసితిని సాదించేననుచు నిన్ను
వెన్నలేల దొంగిలేవు వేసాలకృష్ణా
కన్నుల జంకించితిని కాఁగిటఁ బట్టేనని
పన్న నేల మాయ లింత బాలకృష్ణా ॥ఎప్పు॥

మాటల నిన్నొరసితి మంతనానకు రమ్మని
చాటేవేల రసాలు జంగిలికృష్ణా
యీటుతోనే నవ్వితిని యిద్దర మొక్కటేయని
వోటమి నీ కెందూ లేదు వున్నతపుకృష్ణా ॥ఎప్పు॥

కూడితి కాఁగిట నిన్ను గుఱుతులు నించి నించి
జాడలు దప్పకుమీ జాణకృష్ణా
వీడె మిచ్చితిని శ్రీ వేంకటాద్రిపయి నీకు
వాడికలు మనసొమ్ము వన్నెల వోకృష్ణా ॥ఎప్పు॥

**ఉపోద్ఘాతము :**

నాయిక శ్రీకృష్ణునితో అంటున్నది. కృష్ణా! వద్దనుకుంటూనే ప్రతిసారీ నీకు లొంగిపోతాను. అప్పుడే ప్రియములు చెప్పేవు... అప్పటికప్పుడు ఇచ్చకాలమాటలు చెబుతావు... నీవు చెలువపు కృష్ణుడవు... మనోజ్ఞమూర్తివి. అన్నమయ్య సరిగ్గా ఇటువంటి కీర్తనే ఇదివరలో చాలా చెప్పారు. అయినా దేనిమాధుర్యం దానిదే.





ఓ వన్నెల కృష్ణా! మనసొమ్ము "వాడికలు" అంటున్నారు. 'వాడికలు' అంటే దాచిపెట్టి నేనడిగినప్పుడు నాకు ఇవ్వవలసినది అని చెప్పిదాచుకొన్న వస్తువు. మనసొమ్ము యెందుకు వాడికలయిందంటే... నేను నీకు తాంబూలంతోపాటు అర్పించుకొన్నాను కదా! స్వామీ!

**తాత్పర్యము :**

ఓ శ్రీకృష్ణా! నేను యెప్పుడూ నీకు లోనైయేరా!! నామీద నీదెప్పటికినీ పైచెయ్యే. నీవు చెలువపు కృష్ణుడవు (అందాల కృష్ణయ్యవు). చెప్పేవు ప్రియములప్పుడే (అప్పటికప్పుడు యేవేవో ఇచ్చకాలమాటల చెప్పి నన్ను మభ్యపెడతావు.

కృష్ణా! మొండిగా నిన్ను సాధిస్తున్నానని నా స్తనములను ఒరసిపట్టుకొంటావు. (బిగించి పట్టుకొంటావు).మరి దొంగవేషాలు వేసి వెన్నలెందుకు దొంగిలిస్తావు? నన్ను బిగియార కౌగిలిస్తున్నావని కన్నులతోనే నిన్ను జంకించాను (బెదరించాను). ఓ బాలకృష్ణా! ఇన్ని మాయలు నాపైన పన్నుట యెందుకు స్వామీ!

నాతో మంతనాలకు (సర్దుబాటు ఒప్పందాలకు) రమ్మని, నిన్నుమాటలన్ ఒరసితిని (సాధించాను). నేను నీతో ఆడిన సరసాలన్నీ చాటేవేలనయ్యా! నీవు జంగిలికృష్ణుడవు (గొడ్లుకాచుకొనేవాడివి). నీతోటి గొల్లకుఱ్ఱకారుతో నీకివే మాటలేమో మరి. కాని నేనే నిన్ను మనిద్దరమూ ఒకటే కృష్ణా! అని యీటుతో నవ్వేట్లు చేస్తావు (ఊరకనే నవ్వునట్లు మాయచేస్తావు). నీకు యెప్పుడూ ఓడిపోవడం అనేది లేదయ్యా! కృష్ణా!

ఓ కృష్ణా! గాఢ పరిష్వంగములతో నిన్నుకూడినందువలన, ఆ గుర్తులన్నీ చెప్పకనే జరిగిందేమిటో చెప్పేస్తున్నాయి. ఇప్పుడు నువ్వు జాడలు దప్పుట న్యాయం కాదు. శ్రీ వేంకటాద్రి మీద నాకు వీడెమిచ్చి (తాంబూలమిచ్చి) స్వీకరించావు. ఓ వన్నెల (శోభలీనునట్టి) వేంకటకృష్ణా! మనసొమ్ము (నాకున్నదంతా) నీవాడికమే (నేను నీ దగ్గర దాచుకొన్న నీ సర్వ భుక్త హక్కు అయిన నా మనస్సే...)

సంపుటి : 20 కీర్తన : విన్నపమిదెపో వింటివో వినవో కాని
సంఖ్య : 158 పుట : 106 - రాగం : సామంతం

**89.** విన్నపమిదెపో వింటివో వినవో కాని
కన్ను గిరిపే వేమికారణమో కాని ॥పల్లవి॥

మాఁటలివి మంచివేపో మనసే తెలియఁగాని
ఆఁటదానఁ బుణ్యపాప మంది నీదేపో
నాఁటిన సెలవులను నవ్వులు నవ్వే విది యేాఁబో
యేఁటికొాఁతా వెనకముం దెంచలేము గాని ॥విన్నప॥

ననుపెల్లా మంచిదేపో నడవ దెఱఁగఁగాని
యెనసితి పరభారా లిఁక నీవేపో
నను నీవు సారెసారె నమ్మించే విది యేాఁబో
కొనయౌతా మొదలౌతా గుట్టెఱఁగఁగాని ॥విన్నప॥

పాయమిది మంచిదేపో పంతము లెఱఁగఁగాని
ఆయమంటి కూడితి నీయాసఁ గంటిఁబో
యీయెడ శ్రీ వేంకటేశ యిన్నిటా నన్నేలితివి
రేయి-పగ లిదియని రీతెఱఁగఁగాని ॥విన్న॥

**ఉపోద్ఘాతము :**

కొండలరాయనికి కోటి విన్నపాలు చేసికొనని వారు యెవరుంటారు? కాకపోతే ఆయన ఆ విన్నపాలు వింటాడో వినడో చెప్పటం కష్టమే. ఆయన కన్నుగీటినా అది నిజంగా ప్రేమయో లేక ఆటపట్టిస్తున్నాడో నాయికకు తెలియుటలేదు. ఇక్కడ అన్నమయ్యే ఆ అయోమయంలో పడిన నాయిక. నేను ఆడదాన్ని ప్రభూ! నేనే నిన్ను వలపిస్తున్నానో లేక నీవే నన్ను మాయ చేస్తున్నావో... ఆ పాప పుణ్యాలు నీకే వదిలేస్తున్నాను. నా పాయము (ప్రాయము) మంచిదే ప్రణయంలో పంతం





నెగ్గించుకొనే జాణ తనంకూడా నాకు లేదు. కాని నావంటి దాన్నికూడా ఆయము లంటికూడినావు. నాకు రేబవళ్ళకు తేడా లేకపోయింది స్వామీ! అంటున్నారు. ఈ బేల మాటలకు మనస్సు కఱిగి నీరు అవుతున్నది.

**తాత్పర్యము :**

ప్రభూ! ఇది నీకు నా విన్నపము. అది వింటావో, వినవో కానీ పో... నీ ఇష్టం. నాకేసి చూసి కన్నుగీటుతావు. దానికి ఏమి కారణమో తెలియనిబేలు.. నేను.

స్వామీ! నీ మాటలు వినుటకు మంచివేగానే వున్నాయి. పో... కాని మనసే తెలియుటలేదు. నేను ఆడుదానను. పాపపుణ్యాలెరుగనిదానను. అదంతా నీకే తెలియాలి. మనస్సులో నాటుకొనిపోయే చిరునవ్వులు వెదజల్లుతావు. అది నీ సమ్మతియో కాదో తెలియదు. నేను యెందుకు వెనుక ముందులాడుతున్నానో నాకే తెలియుటలేదు. ఏమి చేయవలెనో యెరుగను.

స్వామీ! నీ ననుపెల్లా మంచిదే పో...(నీ అనురాగం మంచిదిగానే అనిపిస్తున్నది). కానీ నీ నడవడి (ప్రవర్తన) అనుమానం కలిగిస్తున్నది. నిన్ను నేను యెనసితి (పొందాను). ఇక పరభారాలు నీవే (నా బరువు బాధ్యతలన్నీ నీవే ప్రభూ!) నన్ను ప్రతిసారీ నమ్మించివేస్తావు. ఇది అవునోకాదో యెరుగను. మన ప్రయాణానికి ఇది ఆరంభమో... అంతమో? ఆ గుట్టు యెరుగలేకున్నాను. నన్ను పాలముంచినా, నీటముంచినా నీదే భారము.

మనిషి జీవితంలో పాయము (యౌవనము) మంచిదే. పోతే.. చిక్కంతా అది కలిగించే మనోవైకల్యములదే. ప్రణయంలో పంతాలు పట్టింపులు యెటువంటివో కూడా నేనెరుగను. అటువంటి నన్ను ఆయములనంటి కూడితివి (నా మర్మములను తాకి రమించితివి). నీ ఆశ యెంతటి బలమైనదో యెరింగితిని. ఓ శ్రీ వేంకటేశ్వరా! ఇన్ని విధముల నన్ను పాలించి అనుగ్రహించితివి. నాకు రాత్రింబవళ్ళు యెరుక రాకున్నది. త్వమేవాహం... అని నీలో కరిగిపోతిని.

సంపుటి : 20 కీర్తన : నిచ్చలు నా బ్రతుకెల్ల నీ చేతిది; నీ
సంఖ్య : 476 పుట : 318 - రాగం : కన్నడగౌళ

**90.** నిచ్చలు నాబతుకెల్ల నీచేతిది; నీ-
యిచ్చవచ్చినట్టు సేయు మెదురాడ నిఁకను ॥పల్లవి॥

పలికితి నీతోడఁబంతములు సారె సారె
సొలసితిఁ గొంతగొంత చూపులలోను
అలసితి నిఁకనోప నన్నిటా నీ చిత్తమునఁ
గలిగియట్లఁ చేయు కాదన నే నిఁకను ॥నిచ్చలు॥

కక్కసించితిని నిన్ను ఘనమైనరతులను
వెక్కసానఁ గొసరితి వేసరించితి
మొక్కెద నిఁక నే నేర మొదలనుపాయాలు
మక్కువగలట్టే సేయు మఱఁగేల యిఁకను ॥నిచ్చలు॥

కరఁగించితి మనసు కాఁగిటిరతుల నిన్ను
సిరుల శ్రీ వేంకటేశ సేవచేసితి
అరమఱచితి; నవ్వే నలమేలుమంగ నేను
తరవాత నన్నీఁజేయు తమకించ నిఁకను ॥నిచ్చలు॥

**ఉపోద్ఘాతము :**

స్వామిపై అలిగి, సాధించి, నొప్పించి, నొప్పింపబడి ఇకచేతులెత్తి శరణంటోంది అలమేల్మంగమ్మ. నీకు సేవచేసి అరమరచితిని ప్రభూ! తరువాత నన్నీజేయు... తమకించనికను అంటున్నది. వాణి ఆ తల్లిదయినా భావన మాత్రం అన్నమయ్యదే. ఆరువందల యేళ్ళ క్రిందటి వాడుక భాష అవటం దీనికి వివరణ ఇవ్వాల్సి వస్తోంది





కానీ సామాన్య జనులు వుపయోగించే తెలుగులోనే అన్నమయ్య కీర్తనలు చెప్పారు. తేడా యేమిటంటే నుడికారం కొద్దిగా మారింది అంతే... మక్కువగలట్టే సేయు మఱగేల యికను అంటున్నారు. (ఇంకా దాపరికం దేనికి నీ ఇష్టం వచ్చినట్లు చేయుము... అని నేటికాలంలో అంటున్నాం. అంతే తేడా.

**తాత్పర్యము :**

ఓ ప్రభూ! నా బ్రతుకెల్ల నిచ్చలు నీది. (నా జీవితమంతా నిత్యమూ నీదే). ఇకను యెదురాడ (ఇంక నీకుయెదురు జెప్పను). నీ ఇచ్చవచ్చినట్లు సేయుము (నీ ఇష్టం వచ్చినట్లు చేయవయ్యా!)

స్వామీ! నీతో పంతానికి పోయి, మాటిమాటికి పోట్లాడి అలసిపోయాను. చూపులతోను కొంత కొంత సొలసిపోయాను. ఇక నోపను (నాకిక ఓపికలేదు) అన్నిటా నీ చిత్తము (అంతా నీ ఇష్టం). కలిగినయట్లు చేయుము. (నీకెట్లాతోస్తే అలా చేయుము). నేనిక కాదనను.

స్వామీ! ఘనమైన రతులతో నిన్ను కక్కసించితిని (ఇబ్బందిపెట్టాను). అధికముగా కొసరి కొసరి నిన్ను వేసరించితి (విసిగించాను). ఇక నీకు దండము పెడతాను. నేనే ఉపాయములనూ యెరుంగను. ఇంకా నీకు మరుగేల (ఇంకా నీకు దాపరికాలెందుకయ్యా! మక్కువ గలట్టే సేయుము (నీ ఇష్టం వచ్చినట్లు చేయుము ప్రభూ!)

ఓ వేంకటేశ్వరా! గాఢ పరిష్వంగములతో కూడిన రతులతో నీ మనస్సును కరిగించితిని. సిరుల సేవ సేసితి (అనేక వైభవములతో నిన్ను సేవించితిని). అరమఱచితిని (నిన్ను పూర్తిగా నమ్మితిని). నేను వేరెవరినో కాదు ప్రభూ! నీ నవ్వుల అలమేలు మంగను తరవాత అన్నియును నెరపి నన్ను తమకించుము (వేగిరపఱచుము) స్వామీ!

సంపుటి : 20 కీర్తన : కోరినట్టే నీకు జెల్లె గోవిందుడా

సంఖ్య : 3 పుట : 3 - రాగం : సామంతం

**91. కోరినట్టే నీకుఁ జెల్లె గోవిందుఁడా మా-**
**కూరిములు మాకు దక్కె గోవిందుఁడా ॥పల్లవి॥**

**కొలనికఱుత నీవు గోవిందుఁడా । మము**
**గులుగు రేఁచకువోయి గోవిందుఁడా**
**కొలముఁ గొలముఁ గూడె గోవిందుఁడా । ఇంత**
**కులికి నవ్వకువోయి గోవిఁదుఁడా ॥కోరి॥**

**కోకలేల తీసితివి గోవిందుఁడా । నీకుఁ**
**గోకో ఇదివో మొక్కు గోవిందుఁడా**
**గోకులమిందరిలోన గోవిందుఁడా । సిగ్గు**
**కూకులు వత్తులు నాయ గోవిందుఁడా ॥కోరి॥**

**కొప్పు దాఁకించకువోయి గోవిందుఁడా । మా**
**కుప్పెసవరము వీడీ గోవిందుఁడా**
**గొప్ప శ్రీ వేంకటగిరి గోవిందుఁడా । మేలు**
**కుప్పళించి కూడితివి గోవిందుఁడా ॥కోరి॥**

**ఉపోద్ఘాతము :**

గోవిందరాజస్వామిపై లలిత శృంగార కీర్తన వినిపిస్తున్నున్నారు అన్నమయ్య. స్వామికి మొండి పట్టుదల యెక్కువ. అన్నీ ఆయన కోరుకున్నట్లే జరగాలి. భజన పద్ధతిలో కొనసాగుతుందీ కీర్తన. ఇందులో కఱుత, గులుగు, కోవోమొక్కుట, కుప్పళించుట వంటి యెన్నో తెలుగుమాటలు ఈనాడు వాడుకలో లేవు. జాగ్రత్తగా ఆకళింపు జేసుకోవాలి. అంటే ఏమిటి? అని అడిగేవారికి నేనేం చెప్పగలను?





**తాత్పర్యము :**

ఓ గోవిందరాజా! నీవు అనుకొన్నది సాధిస్తావు. నీకు అంతా కోరినట్లే చెల్లుతుంది. దానివల్ల మాకు లాభమే కలిగింది. మాకు నీ కూరిములు (వలపులు) దక్కినవి ప్రభూ!

గోవిందుడా! నీవు కొలని కఱుతవు (కోనేటి ఒడ్డున వున్న దుండగీడువు. మము గులుగురేచకు (మాకు గిలిగింతలు పెట్టకు). కొలమున్ కొలము గూడె (మా కులములో వాళ్ళంతా గుమి గూడి నీపై పితూరీ చేయటానికి వచ్చారు). మరి నువ్వేం చేస్తున్నావు? ఏమాత్రం లెక్కసేయక ఒక కులుకు కులికి పకపకా నవ్వుతున్నావు.

ఓ గోవిందుడా! కోకలెల్లా తీసితివి (చీరెలన్నీ యెత్తుకెళ్ళావు). నీకున్ ఇదివో కోకో మొక్కేము. (కో కొల్లలుగా నమస్కరిస్తాము). ఓ స్వామీ! ఇంతమంది గోకులం వాసులలో మా సిగ్గు "కూకలు వత్తలు" నాయె. (తుత్తునియలైపోయింది... అంటే మా సిగ్గు చితికిపోయింది అని అర్థం).

ఓ గోవిందుడా! అది నీకు అలవాటైతే అవుగాక! కానీ మా కొప్పులు తాకించకు (కావాలని మా కొప్పులపై చేతులు వేయకు). మా కుప్పె సవరము వూడిపోతుంది. గొప్పదైన శ్రీ వేంకటగిరిపై చేరిన గోవిందుడా (శ్రీ వేంకటేశ్వరా!) నీవు మాకు మేలు కుప్పళించి (కుప్పలు తెప్పలుగా ఉపకారములను చేయుచూ) కూడితివి మాతో చేరియున్నావు.

సంపుటి : 21 కీర్తన : పెక్కునిచ్చ కళ్యాణాల పెండ్లికొడుకు
సంఖ్య : 482 పుట : 322 - రాగం : గౌళ

**92.** పెక్కునిచ్చకల్యాణాల పెండ్లికొడుకా
మిక్కిలి జాణఁడవయ్యా మేలయ్య నీకు ॥పల్లవి॥

చెలులు పదారువేల సేసవెట్టినచేతుల
చెలఁగి నాకు మొక్కేవు చెల్లునా నీకు
కలఁగక గొల్లెతలకాలుదొక్కే పాదమున
అలరి నాకాలుదొక్కే వౌనయ్య నీవు ॥పెక్కు॥

పురకాంతలఁగూడ బోడించినమాటల
ధర సరసమాడేవు తగునా నీవు
పరగఁ గొలనిలోని పచ్చితనపు చూపుల
వొరసి మమ్ముఁ జూచేవు వోయయ్య నీవు ॥పెక్కు॥

కదుబలిమి రుక్మిణిఁగాఁగిలించిన కాఁగిట
యెడయక కాఁగిలించే విదిలో నన్ను
కడఁగి శ్రీ వేంకటాద్రిఘనుఁడ నీకు నాకు
బడినే శోభనములు పైకొనెనయ్యా ॥పెక్కు॥

**ఉపోద్ఘాతము :**

శ్రీ వేంకటేశ్వరుడు నిత్య పెళ్ళికొడుకు. అంతేకాదు.. మిక్కిలి జాణ. ఉన్న ఒక్క భార్యను సమాధాన పరచుకోలేక మనం తిప్పలు పడుతుంటే స్వామి అంతమంది భార్యలతోనూ, అంతకు అనంతమైన వలపుకత్తెలతోనూ, అన్నమయ్యవంటి భావనా





ప్రపంచంలో పరమాత్మతో రమించే అన్నులమిన్నలతోను.. నిత్యమూ శోభిల్లుతున్నాడు. రుక్మిణీదేవి గాఢాలింగనంలో బిగిస్తే కడుబలిమి యెడయక కాగిలించేవు నన్నునూ అంటున్నది అన్నమయ్య భావనా భామిని.

**తాత్పర్యము :**

పెక్కు నిత్య కల్యాణాల పెండ్లికొడుకా! నీవు మిక్కిలి జాణడవయ్యా! నీకు మేలు కలుగుతుందయ్యా! నీ ఆనందమే మాకు పరమానందం.

పదియారువేల మందిపై తలంబ్రాలు చల్లిన చేతులతో నేడు నాకు మ్రొక్కుతున్నావు. ఇది నీకు చెల్లునా ప్రభూ! ఆనాడు అదరు బెదురు లేక గొల్లభామల కాలు దొక్కేవు. (దగ్గరయ్యేవు) నేడు నాతోనూ కాలు ద్రొక్కుతున్నావు. ఏమి నా భాగ్యము!!

ప్రభూ! ఆనాడు మధురాపురంలో కుబ్జవంటి పురకాంతలను కూడుటకు నీవాడిన బోడించిన మాటలు (అప్పటి కప్పుడు పబ్బంగడుపుకొనే మాటలు) మాట్లాడి నేడు నాతోనూ సరసమాడేవు. ఇది నీకు తగినపనియేనా? ఆనాడు కొలనిలోని గోపికలను చూచిన 'పచ్చి' చూపులు మాపైననూ ఒరసి (పరీక్షగా) చూచుచున్నావు. ఏలనయ్యా?

ఓ శ్రీవేంకటేశ్వరా! ఆనాడు రుక్మిణీదేవిని గాఢాలింగనంలో బిగించినట్లే నేడు విడువక నన్నునూ నీ బిగికౌగిట కరగించినావు. కడగి (ఉద్యమించి) నీకు నాకు బడినే (శీఘ్రముగా) శోభనములు (మంగళకరసమాగమములు) పైకొనెనయ్యా! (కలిగినవి ప్రభూ!) నేను ధన్యురాలను స్వామీ!

సంపుటి : 21 కీర్తన : ఆనలింకామానవా ప్రహ్లాదవరదా
సంఖ్య : 477 పుట : 318 - రాగం : రామక్రియ

**93.** ఆన లింకా మానవా ప్రహ్లాదవరదా
నానెఁ జెమటఁ జెక్కులు నవ్వులింత చాలదా ॥పల్లవి॥

పిప్పిచేసితివి మోవి బెదరించితివి నీవి
అప్పటి నాసోదమా ప్రహ్లాదవరదా
కొప్పు జారఁజేసితివి కొంగువట్టి తీసితివి
రెప్పలెత్తి చూచే వింకా రేసెంత గలదో ॥ఆన॥

మానముపైఁ దిట్టితివి మర్మము చేముట్టితి
ఐన నింతచాలదా ప్రహ్లాదవరదా
మేనెల్లఁ జొక్కించితివి మేకుల దక్కించితివి
శేననవ్వులు నవ్వేవు సేఁత లింత చాలదా ॥ఆన॥

చెక్కుఁ గడునొక్కితివి చేతెలెత్తి మొక్కితివి
అక్కరింకానేఁటికి ప్రహ్లాదవరదా
యెక్కువ శ్రీ వేంకటాద్రి నిరవైనదేవుఁడవు
దక్కి నన్నుఁగూడితివి తమి యెంతగలదో ॥ఆన॥

**ఉపోద్ఘాతము :**

హిరణ్యకశిపుని చీల్చిచెండాడి పేగులు మెడలో జంధ్యాల వలె వేసికొనిన నృసింహదేవుని సరసశృంగార నాయకుని వలె భావించే అన్నమయ్య భావసౌందర్యానికి జోహారు. తన హృదయేశ్వరియైన శ్రీలక్ష్మికి ఆయన యెన్నో ఆనలు పెడతాడట (ఆజ్ఞలు విధిస్తాడు). చెమటతో నా చెక్కిళ్ళు నానిపోతున్నాయి





అని ఆ ప్రహ్లాదవరదునికి విజ్ఞప్తిని చేస్తోందిట ఆ తల్లి. నా మోవి పిప్పిచేసితివి, నీవి బెదిరించితివి... నీవు అప్పటి నాసోదమా ప్రహ్లాదవరదా! అంటున్నది. అంటే యేమిటో తెలియాలంటే... తాత్పర్యం చదవాలి, తప్పదు.

**తాత్పర్యము :**

ప్రహ్లాదవరదుడవైన ఓ నృసింహా! నీ ఆనలు (ఆజ్ఞలు) ఇంకా మానవు. దేవి చెక్కిళ్ళు చెమటతో నానిపోతున్నాయి. (కొండ గుహలలో ఎంత చెమట పట్టుతుంది?) కాని స్వామి దేవేరి చిరునవ్వు వదలలేదు. ఆ నవ్వులు చాలవా ప్రహ్లాదవరదా!

స్వామీ! ఆమె మోవి (అధరమును) పిప్పిజేసితివి. ఆమె 'నీవి' బెదరించితివి. (ఆమె చీరెముడి సడలించితివి). ఓ ప్రహ్లాదవరదా! అప్పటి నా సోదమా (అప్పటిన్+ ఆసోదమా)... అంటే.. ఆమెకు కలిగే శృంగార భావనలు పైకే ద్విగుణీకృతమై కనబడుతున్నాయి). ఆమె కొప్పుజారిపోవునట్లు చేసితివి. కొంగుపట్టి దగ్గరకు తీసికొనినావు. నీ కనురెప్పలెత్తి చూచినావు. నీకు రెసెంతకలదయ్యా! (ఎంతచులకన!!)

స్వామీ! మన్ననలేక నిందింతువు. మర్మాంగములనంటెదవు. అయినను శాంతింపవు. ఇంతచేసినను, చాలదా? నీవు నా శరీరమంతా పరవశించునట్లు చేతువు. తన్మయత్వం కలిగింతువు. స్వామీ! నీవు శేన (చానా...అంటే మరీ ఎక్కువ)గా నవ్వుతున్నావు. నీవు చేసే ఈ పనులు చాలవా)?

ఓ ప్రహ్లాదవరదా! నీవు నా చెక్కిళ్ళు విపరీతముగా నొక్కివేయుచున్నావు. నీకింత అక్కర (అపేక్ష) యేలనయ్యా! నన్ను ప్రసన్నను చేసికొంటివి. ఎక్కువైన శ్రీ వేంకటాద్రి ఇరవైన (సంస్థానమైన) ఓ దేవా! నీవు నాకు దక్కి నన్ను కూడితివి. నీకు నాపై యెంత తమి (అపేక్ష) యున్నదయ్యా? నేను ధన్యను ప్రభూ!

సంపుటి : 21 కీర్తన : ఇదివో చెలియా భావమిక నీచిత్తమెట్టో
సంఖ్య : 478 పుట : 139 - రాగం : భైరవి

**94.** ఇదివో చెలియభావ మిఁక నీ చిత్త మెట్టో
పెదవులు మోఁపి మోఁపి పేరుకొనిపాడును ॥పల్లవి॥

నీవు వచ్చేవని చెలి నిలుచుండినిలుచుండి
తోవకెదురుగ వచ్చి తొంగిచూచును
భావములో నీరూపు భావించిభావించి
నీవి జారఁ గరఁగును నివ్వెరగు నొందును ॥ఇది॥

యెవ్వరు మాఁటాడినా నీయెలుఁగని సారెసారె
అవ్వల నివ్వలఁ జూచి యాలకించును
జవ్వని గాలివెట్టినచప్పు డట్టె వినివిని
మవ్వపుఁగళవళాన మాటలాడును ॥ఇది॥

యింతలో శ్రీ వేంకటాద్రి యెక్కి ప్రహ్లాద వరద
కాంత నిన్నుఁ గూడి కవకవ నవ్వెను
చింతదీర నీవు మేనఁ జేసినరేకలు చూచి
వంతుల నీమేనఁ జేయవలెనని యెంచును ॥ఇది॥

**ఉపోద్ఘాతము :**

ఉగ్రనరసింహుడంటే ఉర్విలో వారందరికీ వణుకు కావచ్చును, కాని ఆయన హృదయేశ్వరి ఆదిలక్ష్మికేమి భయం? ఆమె ఆయనను కూడి 'కవకవ' నవ్వుతుందట. ఆయన ఆవిడ వంటిపై ఏవేవో రేఖలు చిలిపిగా గీస్తే, ఆవిడకూడా వంతులుగ తానూ గీస్తుందట. ఇదిగో ఆ చెలియ ఆలోచనేమిటో నీ ఇష్టం స్వామీ! ఆమె మాత్రం తన పెదవులు మోపి మోపి (నీవంటికి ఆనించి, ఆనించి) నిన్ను పేరుకొని





(స్తుతించుచు) పాడుచున్నది. జగద్వల్లభుడవు నీకింకొకరు చెప్పాలాస్వామీ! అంటున్నారు, అన్నమయ్య. ఏ జన్మలో చేసికొన్న అదృష్టమో ఆరువందల ఏళ్ళ తర్వాత నాచేత ఇది మళ్ళీ వింటున్నాడు ఆ దేవదేవుడు.

**తాత్పర్యము :**

ఇదిగో స్వామీ! ఆ చెలియ (ఆదిలక్ష్మి) భావము (ఆలోచన) నీ చిత్తము యెట్టిదో మాకెట్లా తెలుస్తుంది? ఆమె మాత్రం తన పెదవులను మోపి మోపి (నీవంటికి ఆనించి, ఆనించి) పేరుకొని (నిన్ను స్తుతించుచూ) పాడేను (పాటలు పాడుతున్నది).

ఆ చెలియ నీవు వస్తున్నావేమోనని నిలుచుని, నిలుచుని వేచి చూస్తూ తోవకెదురుగా వచ్చి తొంగిచూచి నిరాశ చెందుతున్నది. మదనమనోహరమైన నీ నారాయణుని రూపం తన భావనలలో భావించి భావించీ తన యొక్క నీవిజార (చీరెముడి సడలగా) కరగుచు (పరవశించుచూ) ఎందుకిట్లయ్యేనో అని నివ్వెరగైనది (సంభ్రమము జెందినది).

ఎవ్వరిమాటవిన్నా, నీ గొంతేమోనని మాటిమాటికీ అటూ ఇటూ చూచి చెవులు రిక్కరించి వింటుంటుంది. ఆ జవ్వని గాలివీచిన చప్పుడునకు కూడ ఉలికిపడి, మవ్వపు కళవళాన (సున్నితంగా తొట్రుపడి) మాటలాడుచున్నది (ఏమేమో మాటలాడుచున్నది).

ఓ ప్రహ్లాద వరదా! ఇంతలో నీయొక్క శ్రీ వేంకటాద్రిని యెక్కి ఆ శ్రీకాంత నిన్ను కూడినది. తనచింతన దీర (అమ్మయ్య.. నా భర్త ఉగ్రమూర్తికాదు జగన్మోహనుడని) 'కవకవ' నవ్వినది. ఇంతలో నీవు ఆమె వంటిపై ఏవేవో రేకలు (గీతలు) గీస్తుంటే... నేనేం తక్కువ... అని ఆమెకూడా వంతులకు పోయి తానూ నీవంటిపై అలాగే చేయాలని అనుకొన్నది.

సంపుటి : 21 కీర్తన : ఇంకనేలా మాటలు ఎఱుగుదు నేనన్నియు
సంఖ్య : 39 పుట : 27 - రాగం : రామక్రియ

**95.** ఇంకనేలే మాటలు యెఱుఁగుదు నేనన్నియు
కంకిగా నీతోఁ దారుకాణించితిఁ జాలదా ॥పల్లవి॥

సెలవి నీవు నవ్వఁగా సిగ్గువడి ఇంతి నిన్ను
కలువపూవున వేసెఁ గద్దో లేదో
నిలువుటద్దములో నీ నీడ నీవు చూచుకోఁగా
కలిగి కాఁగిటఁబట్టె కద్దో లేదో ॥ఇంక॥

అందముగా నీవు దన్ను ఆయములు చెనకఁగా
గందము నీపైఁ బూసె కద్దో లేదో
సందడిఁ గొలువులోన సరిఁ బరాకై యుండఁగా
కందువలు నిన్ను నంటెఁ గద్దో లేదో ॥ఇంక॥

నిక్కి నీవు చూడఁగాను నిన్నుఁ జేయివట్టి తీసి
గక్కున రతులఁ గూడె కద్దో లేదో
యిక్కడ శ్రీ వేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
కక్కసించి జంకించెఁ గద్దో లేదో ॥ఇంక॥

**ఉపోద్ఘాతము :**

నాయిక (అన్నమయ్య) గద్దించి స్వామితో ఇంకానీతో నాకు మాటలేమిటయ్యా నేనన్నియు నెఱుగుదును. కంకిగా యెన్నో తార్కాణాలు చూపించాను. ఇంకా కావాలా? ఇది చాలదా? అని దెప్పిపొడుస్తున్నది. కద్దో లేదో.. అని అడుగుతున్నది. నేటి భాషలో అవునా? కాదా? అని అడగటం అన్నమాట. చివరికి స్వామీ! ఆమె నీవు





నన్ను కూడినావని కక్కసించి జంకించినది అవునా? కాదా? అంటున్నది. ఏదో అర్థమైనట్లే వున్నా... వివరించలేము కద్దో లేదో? అందుకని తాత్పర్యం చదవండి.

**తాత్పర్యము :**

స్వామీ! ఇంకనేలా మాటలు? నేనన్నియును యెరుగుదును. నీతో కంకిగా (గద్దించి) అన్నీ తారుకాణించితిని (నిరూపించాను). ఇది చాలదా?

ఇదిచెప్పవయ్యా! ఆమె (స్వామిని వలచిన మరొక చిన్నది) నీవు చిరునవ్వు నవ్వగానే సిగ్గుపడి తన చేతిలో నున్న కలువపూవును నీపై విసిరేసింది. కద్దో లేదో (అవునా? కాదా?) నిలువుటద్దములో నీ ప్రతిబింబం నీవు చూచుకొంటుంటే వెనుకనుంచి వచ్చి నిన్ను కౌగలించుకొనినదా లేదా?

స్వామీ! అందముగా నీవామె సున్నితమైన అవయవములనంటగా... తాళలేక నీపై గంధము పూసినదట. అవునా? కాదా? సందడిగావున్న నీ రాచసభలో నీవు యేదో సమస్యవల్ల కాస్త పరధ్యానంగా వుంటే... అదెవత్తో వచ్చి నీ కందువలు అంటెనట (నీ ఏకాగ్రతను భగ్నం చేసినదట. అవునా? కాదా? ముందు ఇది తేల్చి చెప్పవయ్యా!

అవన్నీ అట్లావుంచి, ఇది చెప్పవయ్యా! నీవు రహస్యంగా ఆమెను చూడగానే నీ చేయివట్టి... తీసి (ఆపైన) గక్కున (వెంటనే) నీతో రతిని గలిసినదా? లేదా? ఓ శ్రీ వేంకటేశా! ఇక్కడ (ఈ తిరుమలపై) ఇట్లా నన్ను (నాయిక రూపంలో వున్న అన్నమయ్యను) కూడా కక్కసించి (ఇబ్బందిపెట్టి) జంకించి (బెదరగొట్టి) కూడినావు. కద్దో... లేదో చెప్పవయ్యా! శృంగారరాయా!

సంపుటి : 21 కీర్తన : కేరడమాడగలనా కేశవరాయా

సంఖ్య : 495 పుట : 330 - రాగం : గుండక్రియ

**96.** కేరడమాడఁ గలనా కేశవరాయా
చూరగొని మర్మములు సోఁకింతుఁగాక ॥పల్లవి॥

పంతమాడితే నీతోఁ బతి యాడఁగలనా
కాంతలతోఁ జెప్పి నవ్వఁగలఁగాక
దొంతి సాకిరివెట్టేవు తొలమనఁగలఁగాక
కొంత మోముమూసుక సిగ్గున నుందుఁగాక ॥కేర॥

వట్టియెమ్మె మెరసితే వద్దనే నేఁ గలనా
చుట్టపుమొకమోటానఁ జూతుఁగాక
వెట్టినీచేఁతలకు వేఁగై మాడఁగలనా
కిట్టి మరునికి నొప్పగించఁగలఁగాక ॥కేర॥

కాఁగిలించితే నిన్నుఁ గాదనఁగఁ౧లనా
లోఁగి యందులకే చొక్కి లోనౌదుఁగాక
నాఁగులెల్లఁ దీర మాఁచనవోలిచెన్నుఁడవై
మూఁగితి శ్రీ వేంకటేశ మోవి యిచ్చేఁగాక ॥కేర॥

**ఉపోద్ఘాతము :**

మాచనవోలులో వెలసిన చెన్నకేశవ స్వామిపై సరసశృంగార కీర్తన చెబుతున్నారు అన్నమయ్య. నాగులెల్లదీర మూగితి.. శ్రీవేంకటేశా! మోవి యిచ్చేగాక... అంటున్నారు. కేవలం ఒక నిఘంటువుతో కీర్తనను వివరించడం కష్టం. భావించాలి. ఇది నా భావన. నాలుగు అంటే... వడ్డీగా ధ్యానముతో ఇంకొక సగం ధ్యానం ఇవ్వటం. ఇక్కడ అర్థం ఎలా చెప్పుకోవాలి అంటే...





ఓ వేంకటేశ్వరా! మాచనవోలిలోని చెన్నకేశుడవూ నీవేయై మూగితివి. నీకు ఇవ్వవలసినది అంతా ఇచ్చేశాను గనుక నాకు నీ మధురాధరమును అందింతువుగాక! ఇంత తిరకాసువున్నది, ఈ కీర్తనలో...

**తాత్పర్యము :**

ఓ కేశవరాయా! (చెన్నకేశవా) నేనెంతదానను? నీతో కేరడమాడగలనా? (తిరస్కారపుమాటలు) మాట్లాడగలనా? చూరగొని (కొల్లగొట్టి) నా మర్మావయవములను స్పర్శింతువు. ఇది తగునా?

ఓ చెన్నకేశవా! నీవు నాతో పంతం పడితే నేను తిరిగి అదే పని చేయగలనా? నీవు ఇతర స్త్రీలతో నా గురించి చెప్పి కించపరచినా, నవ్వుకొన్నా నవ్వుకుందువుగాక! నాతో దొంతిసాకిరి (ఆగని చాకిరీ) చేయించినా కాదనను. నేనా చాకిరిలో తలమునకలైనా కాదనను. నీవలా చేయించావని కొంత చిన్నబుచ్చుకొందునేమో!! అయితే ఔగాక!

స్వామీ! నీవు నాపై వట్టి యెమ్మెలు (ఉత్తుత్తి ఇష్టాలు) చూపిస్తే కూడ నిన్ను కాదనగలనా? దూరపు చుట్టాలపై చూపు మొగమాటములను చూపింతువుగాక! నిరర్థకమైన నీ పనులకు, వేగైమాడగలనా (తపించగలనా?) కిట్టిమరునికి (సమీపించి బాధించు మన్మథునికి) నన్ను నేను ఒప్పగించుకొందును గాక!

ప్రభూ! నీవు నన్ను గుచ్చి కౌగలించితే కాదనగలనా? నీకు లోగి (లొంగిపోయి) అందుకు చొక్కి (పరవశించి) లోనౌదుగాని (లొంగిపోతాను గానీ!) నిన్ను నిరాశ పరచగలనా? మాచనవోలులో వెలసిన ఓ చెన్నకేశవా! నీవే తిరుమల శ్రీ వేంకటేశుడవు కదా! నాగులు యెల్లన్ తీరిపోగా (నీకు కట్టవలసిన పన్నులన్నీ కట్టేస్తాను). నా మధురాధరము నీకందింతును గాక!

సంపుటి : 21 కీర్తన : ఇంకా నీ మనసెట్టో యెఱఁగజుమ్మీ
సంఖ్య : 494 పుట : 330 - రాగం : ఆహిరి

97. ఇంకా నీమనసెట్టో యెఱఁగజుమ్మీ
కొంకితి నింతే నేఁగొసరఁజుమ్మీ ॥పల్లవి॥

చుక్కలు గాయఁగా నేఁ జూడఁ దలెత్తితి నింతె
ఇక్కడ నేముండుతా నే నెఱఁగజుమ్మీ
చిక్కువడ్డముత్యములు చేతులఁబట్టితి నింతే
అక్కర నివేఁటివని యడుగఁజుమ్మీ ॥ఇంకా॥

తుమ్మిదలు బెదరఁగా దోడ నే నవ్వితి నింతే
తమ్మి మోవి నిన్ను నేమీఁ దడవఁజుమ్మీ
వుమ్మ గాలివిసరఁగా నొంటి నేఁ బండితి నింతే
అమ్మరో నీతో నే నలుగఁజుమ్మీ ॥ఇంకా॥

చీకాకు రేకలు చూచి చే గోరగీరితి నింతే
చేకొని నీమేను పచ్చి సేయఁజుమ్మీ
యీకడ శ్రీ వేంకటేశ ఇటు నన్నుఁ గూడితివి
పైకొని చొక్కితి నింతే పదరఁజుమ్మీ ॥ఇంకా॥

**ఉపోద్ఘాతము :**

"స్వామీ! నీ మనసెటువంటిదో యెరుగనైతిని. నేను కోరికయెంతవున్నా సంకోచము వలననే వెనుకంజ వేస్తున్నాను సుమా! నీవంటే నాకిష్టం లేకకాదు.. శ్రీరమణుని వలచిన రమణిగా తనని తాను భావించుకొని అన్నమయ్య ఆలపించిన సరసశృంగార కీర్తన ఇది. స్వామిలో ఆమె చీకాకు రేకలు చూచిందట.





అందుకని నీపని ఇలాగుండా అని గోటితో గీరిందట... ఇప్పుడు చెప్పండి అన్నమయ్య సాటియైన లలిత శృంగార కవి దొరుకుతాడా?

**తాత్పర్యము :**

ప్రభూ! ఇంకా నీ మనస్సేమిటో నేను యెరుంగను జుమ్మీ!! (సుమా!) కొంకితిన్‌యెంతో (ఎంతయో సంకోచించుచుంటిని) నేన్ కొసరన్ జుమ్మీ! (కోర్కెను మెండుచేయలేకున్నాను). అంటే... కోరిక నాకెంతున్నా బహిరంగం చేయలేకున్నానని భావము.

స్వామీ! ఆకాశంలో నక్షత్రాలు వచ్చేశాయా అని తలెత్తి చూచాను. ఇక్కడ నేముండుతా నేనెఱుగను (ఇక్కడ యేమిజరుగుతున్నదో, యెంతజాము గడించిందో నాకేమీ తెలియదు ప్రభూ!) నీ మెడలో ముత్యాలహారాలు చిక్కుపడ్డాయి యేమిటా అని వాటిని చేతితో పట్టి సవరించాను. అంతే, అక్కర నివేటివని యడుగ జుమ్మీ!! (ఇట్లా జరుగాల్సిన అవసరమేమిటని అడుగలేదు సుమా!)

ప్రభూ! నీ పెదవులపై మకరందమున్నదని కొన్ని తుమ్మెదలు మూగినవి. అది చూచి నవ్వు వచ్చి నేనూ నవ్వాను. అది తమ్మిమోవి (తామరలవంటి పెదవులని) సమాధానపడ్డాను కానీ నేన్ తడవన్ జుమ్మీ! (నేనేమీ వాకబు చేయలేదు కదా!) ఉక్కపోస్తున్నదని గాలికోసం కాస్త ఒంటరిగా పడుకున్నాను. అమ్మరో! (అమ్మయ్యో!) నీపై అలుగలేదు సుమా!

స్వామీ! నీ వదనములో చీకాకురేకలు (చిరాకుపడుతున్న చిహ్నములను) చూచి అది సరికాదని నా గోటితో కొద్దిగా గీరి మందలించుటకు యత్నించాను. నీ శరీరంపై గాయము చేయుటకు కాదుసుమా! అంతెందుకు.. ఇప్పుడు ఓ శ్రీ వేంకటేశ్వరా! ఇట్లు నన్నుకూడినావు కదా! దానికి నేనుపైకొని (అతిశయించి) చిక్కితిని (పరవశించితిని). అంతేకాని పదరను జుమ్మీ!! (తొందరపడను సుమా!)

సంపుటి : 26 కీర్తన : రామారామా రాజీవ నయనా
సంఖ్య : 44 పుట : 32 - రాగం : ఆహిరినాట

**98.** రామా రామా రాజీవనయనా
కామించి నినుఁ జూచె గక్కన మా చెలియ ॥పల్లవి॥

యింతి పిలువనంపె నెడమాటలేలా
యింతలో విచ్చేయు ఎన్నికగాక
చెంత నిందులకుఁగా సెలవి నవ్వేలా
పంతముతో నాకెఁ బాలింతు గాక ॥రామా॥

తరుణి పూవుల వేసె తలవంచనేలా
సరి నీవు మోహమే చల్లుదుగాక
నిరతి నిందుకుఁగా నివ్వెరగేలా
మరిగి యాకెను నీవే మన్నింతుగాక ॥రామా॥

మగువ కాఁగిటఁ గూడె మరి సిగ్గులేలా
వెగటురతుల విఱ్ఱవీఁగుదుగాక
వగల శ్రీ వేంకటేశ వావిలిపాటిరామ
మిగుల సీతతో మెఱతువుగాక ॥రామా॥

**ఉపోద్ఘాతము :**

నేటి కడప జిల్లాలోని వావిలిపాడులో వెలసిన శ్రీరామచంద్రునిపై సరసశృంగార కీర్తన చెబుతున్నారు అన్నమయ్య. తానే చెలికత్తెయై రాజీవాక్షునితో విన్నవించుకొంటున్నారు. నీకు మరెన్నో రాచకార్యాలుంటే వుండుగాక యింతి (సీతాదేవి) పిలువనంపెన్ యెడమాటలేలా వెంటనే రావయ్యా! ఎన్నికగాక అంటున్నారు. ఎన్నికగాక... అంటే ఆక్షేపించక... అని అర్థం.





మగువ కౌగిట గూడె, ఇంకా సిగ్గులెందుకు వెగటురతుల విఱ్ఱవీగుదుగాక అంటున్నారు అన్నమయ్య రామచంద్రుని ఇలా సన్నుతించుట అరుదైన విషయమే.

**తాత్పర్యము :**

రాజీవ నయనుడవైన శ్రీరామచంద్రా! మా చెలియ (సీతాదేవి) కామించి (విరహోద్విగ్నయై) నిన్ను చూచినది. గక్కన (వెనువెంటనే) విచ్చేయవయ్యా!

ఇంతి పిలువనంపె (సీతాదేవి నిన్నురమ్మని పిలుపును పంపింది). ఎడమాటలేల (తిరస్కారపుమాటలెందుకు). ఎన్నికగాక (ఆమెను ఆక్షేపించక) ఇంతలో (ఉన్నవాడివున్నట్లే) విచ్చేయవయ్యా! ఇందులకుగా (దీనికోసం... అంటే ఆవిడే పిలువనంపిందని) సెలవి నవ్వేలా (చిరునవ్వులు ఏల చిందిస్తున్నావు). పంతముతో (దీక్షాదక్షుడవై) ఆమెను ఏలుకోవయ్యా!

ఆ దేవినీపై పూవులు వేసె (మరు విరులు చల్లింది) అంతమాత్రాన నీవు తలవంచనేల? నీవు కూడ అందుకు సరియగునట్లు మోహమును ఆమెపై చల్లెదవుగాక! ఆమె వలపుకోసం ఇంత పారవశ్యం తగదు. ఆమెను నీవు గాఢంగా ప్రేమించిన వాడవైనందున ఆమెను మన్నింతువుగాక!

స్వామీ! ఆ మగువ నిన్ను కౌగిలింతలో గూడినది. మరింక సిగ్గులేలనయ్యా! వెగటురతుల (విరసత్వము గల) రతులతో విజృంభింతువు గాక! శృంగారకళలతో నెలకొన్న వావిలిపాటి రామచంద్రా! నీవు స్వయానా, మా తిరు వేంకటేశ్వరుడవే. నీవు నేడు ఈ వావిలిపాడులో సీతాదేవితో శోభింతువుగాక!

సంపుటి : 26 కీర్తన : కోరిక లీడేరె నేడు కోనేటిరాయ
సంఖ్య : 299 పుట : 210 - రాగం : సామంతం

**99.** కోరికె లీడేరె నేఁడు కోనేటిరాయ । ఇట్టె
కూరిముల వూటుకూరి కోనేటిరాయ ॥పల్లవి॥

కుమ్మరించేవు సిగ్గులు కోనేటిరాయ । యీ...
కొమ్మలెల్లఁ జూడఁగాను కోనేటిరాయ
కొమ్ముvంటి కొనగోరఁ గోనేటిరాయ । మేను
కుమ్మెలుగా నొత్తకుమీ కోనేటిరాయ ॥కోరి॥

కొప్పుగడు వెడజారె కోనేటిరాయ । నిండా
గుప్పేవు సెలవినవ్వు కోనేటిరాయా
కుప్పళింపుఁ జెమటలగోనేటిరాయ । యెంత
గొప్పవాఁడవయ్య నీవు కోనేటి రాయ ॥కోరి॥

కొండికపాయ మమరెఁ గోనేటిరాయ । పైఁడి
గొండెలపచ్చడముతో గోనేటిరాయ
అండనే శ్రీ వేంకటాద్రి నలరి నన్నేలితివి
కొండలలో నెలకొన్న కోనేటిరాయ ॥కోరి॥

**ఉపోద్ఘాతము :**

నేటి కడపజిల్లాలోని రాజంపేటకు, తాళ్ళపాకకు సమీపంలో వున్న గ్రామం ఊటుకూరు. అక్కడ వెలసిన దేవుని కోనేటిరాయడు అని వ్యవహరించి యెన్నో కీర్తనలు చెప్పారు అన్నమయ్య. "కొండలలో నెలకొన్న కోనేటి రాయడువాడు, కొండలంత వరములు గుప్పెడివాడు.." అనే సుప్రసిద్ధకీర్తన ఇక్కడిదే. నేడు





నాకోరికలన్నియును ఈడేరినవి. మా కూరిములు ప్రేమలుకూడా ఇట్టే నెరవేరినాయి.. అంటున్నారు. శ్రీ వేంకటాద్రి నలరించిన కోనేటిరాయా! నీవు కొండలలో నెలకొని నన్నేలితివి అంటున్నారు.

**తాత్పర్యము :**

కోనేటిరాయుడవైన శ్రీ వేంకటేశ్వరా! నేడు మా కోరికలన్నియున్ ఈడేరినవి (నెరవేరినవి)... ఊటుకూరిలో నెలకొన్న ఓ కోనేటిరాయా! మా ప్రేమలు ఫలించినవి స్వామీ!

కొమ్మలెల్ల జూడగా (స్త్రీలందరూ చూచుచున్నప్పుడు)సిగ్గులొలకబోస్తున్నావు. వాడియైన కొమ్ములవంటి కొనగోళ్ళతో గోసేవు (రక్కిపెడతావు). ఓ కోనేటిరాయా! నా మేను (శరీరము) కుమ్మెలుగా (గాయమగునట్లు) ఒత్తకుమీ (నొక్కిపట్టవద్దు) నాకు నొప్పి కలుగుతుంది స్వామీ!

ఓ కోనేటిరాయా! నా కొప్పు ముడి సడలి జారిపోయినది. అట్లా యెందుకు జరిగిందో గుర్తుకువచ్చి నీవు నిండైన చిరునవ్వులు చిందిస్తున్నావు... కుప్పళింపు జెమటల (ధారగా కారిపోయే చెమటలుగల) కోనేటిరాయా! నీవు ఎంత గొప్పవాడవయ్యా!!

ఓ కోనేటిరాయా! ఇంతా చేసి నీవు కొండికపాయమువాడవు (బాలుడవు) పైడికొండెల పచ్చడము వాడవు. (మేరు పర్వతమువలె సువర్ణపురంగు గల పీతాంబరమును ధరించినవాడవు). అండనే (అక్కడే) వున్న శ్రీ వేంకటాద్రిపై నెలకొనిన శ్రీ వేంకటేశ్వరా! నీవు నన్నునుగ్రహించి యేలుకొంటివి. అందుకే నిన్ను "కొండలలో నెలకొన్న కోనేటిరాయడు వాడు"... అని కీర్తిస్తున్నాను.

సంపుటి : 26 కీర్తన : కుందనపు బిల్లగోవి గోపీనాథా
సంఖ్య : 186 పుట : 131 - రాగం : దేశాళం

**100.** కుందనపుఁబిల్లఁగోవి గోపీనాథా । మాపైఁ
జిందేవు మోహరసాలు చిన్నిగోపీనాథ ॥పల్లవి॥

కొలనిలోపలిమాతో గోపీనాథా । యేల
కులికి నవ్వు నవ్వేవు గోపీనాథా
కొలువు మొక్కు మొక్కేము గోపీనాథా । నీ
చలము చల్లితేఁ జాలు జాణ గోపీనాథా ॥కుంద॥

గొబ్బన మాచీరలిమ్ము గోపీనాథా । మా
గుబ్బలపైఁ గాకరేఁగె గోపీనాథా
గుబ్బతిల్లీఁ దమకమే గోపీనాథా । నీ
కబ్బితి మేమైనఁ జేయవయ్య గోపీనాథా ॥కుంద॥

కుప్పవడె మాసిగ్గు గోపీనాథా । మా
కొప్పు జారె ముడువుమా గోపీనాథా
వొప్పుగ శ్రీ వేంకటాద్రినుండి వచ్చి కూడితివి
అప్ప తొండామారేగుళ్ల ఆదిగోపీనాథా ॥కుంద॥

**ఉపోద్ఘాతము :**

తొండమారేగుళ్ళ అనే వూరిలో వెలసిన గోపీనాధునిపై ఈ కీర్తన చెబుతున్నారు అన్నమయ్య. ఇదమిద్ధంగా ఇదెక్కడున్నదో తెలియరావటంలేదు. కాలగర్భంలో అనేక మార్పిడి చేర్పిడులు జరిగి వుండవచ్చును. అన్నమయ్య కాలంలో ఆ స్వామికి బంగారంతో చేసిన పిల్లగోవి (మురళి) వుండి వుంటుంది. మాపై మోహములుప్పొంగే





మోహరసాలు చిందిస్తున్నావయ్యా! అని కీర్తిస్తున్నారు. కొలనులో గోపికలు స్నానం చేస్తుంటే చీరెలెత్తుకుపోయిన కొంటె గోపీనాథుని గోపికలు వేడుకొంటున్నారు.

**తాత్పర్యము :**

కుందనపు బిల్లగోవి (బంగారు మురళి) కలిగిన ఓ గోపీనాథా! నీవు మాపై మోహరసమును చిందించుచున్న చిన్నారి గోపీనాధుడవు.

ఓ గోపీనాథా! మేము కొలనులోపల నగ్నంగా స్నానం చేస్తుంటే మాతో నీవు శృంగారపు నవ్వులను, యేలకులికేవు (ఎందుకు వెదజల్లుతున్నావు). స్వామీ! నీకు కొలువు మొక్కు మొక్కేము (రాజాస్థానములో రాజుకి సేవకులు వినయంతో మ్రొక్కునట్లు మ్రొక్కెదము). జాణవైన గోపీనాథా! నా చలము (మత్సరము) చెల్లితే చాలును.

ఓ గోపీనాథా! గొబ్బన (గొబ్బున... అంటే... శీఘ్రముగా) మా చీరెలు మాకు ఇచ్చేయవయ్యా! మా గుబ్బలపై కాకరేగెనయ్యా! (పాలిండ్లు వేడైనవి). ఓ గోపీనాథా! తమకము గుబ్బతిల్లెన్ (పారవశ్యము పరిధులు దాటినది). నీకు అబ్బితిమి (ప్రాప్తించితిమి). నీ ఇచ్చవచ్చినట్లు యేమైనా జేయుమయ్యా!

ఓ గోపీనాథా! మా సిగ్గు కుప్పవడె (కుమ్మరింతకు గురైనది). అయిందేదో అయింది. ఇకనీ జారిన మా కొప్పును సవరించి ముడిచే బాధ్యతకూడా నీదే. ఎందుకంటే... నీవు ఆ శ్రీవేంకటాద్రిపై నుంచి మా కోసం వచ్చి గొప్పగా కూడినావు. ఇక్కడ ఈ తొండామారేగుళ్ళలో ఆది గోపీనాథుడవు (తొల్లిటి గోపికా రమణుడవైన) అప్పవు మా తండ్రివి.

సంపుటి : 21 కీర్తన : సోబాన బాడేము మేము సుదతులము
సంఖ్య : 40 పుట : 27 - రాగం : లలిత

**101.** **సోబానఁ బాడేము మేము సుదతులము**
**యీ బుద్ధులు మీకుఁ జెల్లు నిద్దరికి నయ్యా ॥పల్లవి॥**

**చూపులనే వుంకువలు సుదతికిఁ బెట్టితివి**
**పూపనవ్వులు మించే కప్పురవిడేలు**
**యేపుమీరి నవ్వులనే యెదురుతెర వేసితి-**
**వీపొద్దే పెండ్లాయను మీకిద్దరికినయ్యా ॥సోబా॥**

**తరితీపుమాటలనే తలఁబాలు వోసితి**
**గరిమ సరసములే కంకణాలు**
**గొరబైన వలపుల కొంగులు ముళ్లువేసితి**
**విరవాయ వేడుకలు ఇద్దరికినయ్యా ॥సోబా॥**

**పొంచినకెమ్మోవినే బువ్వపువిందు వెట్టితి**
**మంచముపై కాఁగిలే మంచిచవికె**
**అంచల శ్రీవేంకటేశ అలమేలుమంగ నీవు**
**యెంచి కూడితిరి తగు నిద్దరికినయ్యా ॥సోబా॥**

**ఉపోద్ఘాతము :**

శ్రీ వేంకటేశ్వరుడు అలమేల్మంగను పరిణయమాడుతున్నాడు. మంగళగీతములు పాడుతున్నారు ముత్తైదువలు. అన్నమయ్య తానూ ఒకతెయై పరవశించి ఆలపిస్తున్నారు. మీకు ఇద్దరికీ ఈ బుద్ధులు జెల్లు అంటున్నారు. సాధారణ వధూవరులకు బుద్ధులు (హితవు) చెప్పాలికానీ జగతికే మాతాపితలకు మనం చెప్పే బుద్ధులేముంటాయి? అయినా సాంప్రదాయంగా పాడుతున్నాం.





వధూవరులకు చవిక (శోభనమునకు అమర్చిన పడకగది) యేమిటో తెలుసా?... మంచముపై కాగిలే అంటున్నారు. ఆనాటి పదములు ఈనాడు వాడుకలో లేవు. అదో సమస్య.

**తాత్పర్యము :**

సుదతులము (ముత్తైదువులము) అయిన మేము సోబాన బాడేము (మంగళ గీతికలను పాడుచున్నాము). మాకు తోచిన హిత వాక్యములను చెబుతున్నాము. అయ్యా! (స్వామీ!) మీ ఇద్దరికి యీ బుద్ధులు జెల్లు. మేము వేరే చెప్పవలెనా?

ప్రభూ! నీవు ఈ సుదతికి (దేవికి) పెట్టిన ఉంకువలు (కన్యాశుల్కము) యేమిటో తెలియునా? నీవు చూసే మనోహరమైన నీ చూపులే. విరిసిన నీ నవ్వులే ఆమెకు నీవిచ్చే కర్పూర తాంబూలము. మీకు అమర్చిన ఎదురుతెర (వధూవరుల మధ్య వుంచెడి తెర) యేమిటంటే యేపు మీరిన (అతిశయించిన) మీ నవ్వులే, ఈ విధంగా మీ ఇద్దరికీ ఈ పొద్దున పెండ్లాయెను.

ప్రభూ! తరితీపుమాటలే (ఆడపెళ్ళివారు మొగపెళ్లివారు పలుకరించుకొను మాటలే, మీ తలంబ్రాలు.) ఒకరితో నింకొకరు ఆడుకొనే పరాచికాలే మీ కంకణాలు (వధూవరులకు కట్టే తోరణాలు). అప్పుడు నీవామెకు గాఢమైన వలపులనే కొంగుముళ్ళు వేసినావు. ఇప్పుడు మీ ఇద్దరికీ వేడుకలు విరివాయె (అధికములైనవి).

స్వామీ! వివాహానంతరం బువ్వలు (విందు భోజనం) వుంటుంది కదా! మీ మధురాధర పానమే మీకు కావలసిన విందు భోజనం. శోభనపు శయ్యపై మీ గాఢాలింగనమే, మీ చవికె (శోభనమండపము). ఓ శ్రీవేంకటేశ్వరా! నీవూ అలమేల్మంగ నేడు అంచల (ఈవైపున) కూడినారు. మీ ఇద్దరికీ ఈ కూటమి తగినదయ్యా!

**శ్లో॥ శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్ ।**
**శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥**

Author

రచయిత :

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**


| | | |
|---|---|---|
| పిలవండి | : | **అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు** |
| పుట్టింది | : | **9-6-1945** |
| చదివింది | : | **M.Tech** |
| ఉండేది | : | ఫ్లాట్ నెం. 5, ప్లాటు నెం. 61,<br>సిద్దార్థ అపార్ట్‌మెంట్స్, సిద్దార్థ నగర్,<br>హైదరాబాద్–500 038. ఆం.ప్ర. భారతదేశం. |
| రంధి | : | భగవన్నామ సంకీర్తన |
| నచ్చింది | : | శాస్త్రీయ సంగీతం |
| నచ్చంది | : | నక్కజిత్తులు |
| మెచ్చింది | : | సజ్జన సాంగత్యం |
| రింగండి | : | **00919393021360** |
| చదవండి | : | **www.geetadeeksha.com** |
| ఇవ్వండి | : | **e-mail : geetadeeksha@gmail.com** |


ఏలుకో శృంగార రాయ